ఓం

నారాయణాయ నమః

# గణపతి రామాయణసుధ





చర్ల గణపతిశాస్త్రి

వెల: 15-00

ఓం

పరమాత్మయగు

శ్రీమన్నారాయణునికి

శ్రీ తిరుపతి దేవస్థానమువారిచే ప్రారంభించబడిన
హిందూధర్మరక్షణ ప్రణాళికక్రింద
ఇయ్యబడిన విరాళముతో
ముద్రించబడినది.

# రా మా య ణ సు ధ

## (మథనము)

### : కొన్ని చర్చనీయములు ;

రాముని అయనమును మార్గమును అనఁగా రామాయణమును పరిశోధించి మథించి రామాయణ తత్త్వమును తెలిసికొని ఆ సుధను ఆస్వాదించవలసె యున్నది. ఈ రామాయణము ఆదికావ్యము. రామాయణ రచనకు పూర్వము వేదములలోనేగాని లోకములో ఛందస్సు పద్యరచనలేదు. తమసానదీతీరమున చెట్టుపైని కొమ్మమీదనున్న పక్షులజంటలో ఒకపక్షిని బోయవాఁడు చంపఁగాఁ గ్రిందఁబడి రక్తపుమడుగులో దొర్లుచున్న పక్షిని కళ్ళారఁజూచి దుఃఖింప వచ్చిన శోకమె శ్లోకమైనది.

మానిషాద! ప్రతిష్ఠాంత్వ, మగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితం॥

ఓ నిషాద! క్రౌంచపక్షుల జంటలో కామియైన యొకపక్షిని జంపితివి గాన నీవెంతోకాలము ఉండవు. అని యప్రయత్నముగా వేదఛందస్సులలో మునిఁగితేలు వాల్మీకినోట వెలువడినది. దీనిలో "ఓ లక్ష్మీపతీ! రాక్షసుల జంటలో కామాంధుఁడైన యొకనిజంపితివిగాన శాశ్వత ప్రతిష్ఠను పొందుము" అనునర్థము స్ఫురించినది. ఈ స్ఫురించిన యర్థమునుబట్టి బ్రహ్మ గోచరించి "నారదునివల్ల విన్న రాముని చరిత్రను పై విధమైన శ్లోకములతో వ్రాయు" మని చెప్పఁగా వాల్మీకి వ్రాసెను. వాల్మీకి మొదట వ్యాధుఁడుగానుండి నారదుని యుపదేశముచే ఋషియయ్యెననుకథ ఎంతవఱకు సత్యమో చెప్పజాలము. వాల్మీకి అనఁగా వల్మీకము (పుట్ట) నుండి బయలుదేరినవాడు అను వ్యుత్పత్తినిబట్టి యీతని జీవితము ఊహించి యుండవచ్చును. ఏది యేమైనను మహర్షియును మహాకవియునగు వాల్మీకినుండి వచ్చిన రాముని యయనముమార్గము–రామాయణము జగత్ప్రసిద్ధమైనది. 'నీనోటనుండివచ్చిన ప్రతిమాట సత్యమె. లేశమైనను అనృతము ఉండదని బ్రహ్మ చెప్పనేచెప్పెను. అందుకనియె' రామాయణమంతయు సరిగా జరిగినదె. రామాదులు మాటాడిన

శ్రీ తిరుపతి దేవస్థానమువారిచే ప్రారంభించబడిన
హిందూధర్మరక్షణ ప్రణాళికక్రింద
ఇయ్యబడిన విరాళముతో
ముద్రించబడినది.

"ఇతి సీతాచ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః
అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్
తాన్మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్
ఆస్యతా మితిచోవాచ స్వాగతంతు నివేద్యచ.

అయోధ్యాకాండ 56–16, 17

ఈ వాల్మీకియె రామాయణ కర్తయయి యుండవచ్చును. భరతుఁడు వచ్చి పాదుకలను పట్టుకొని వెళ్లువరకు సీతారామలక్ష్మణులు చిత్రకూటములోనే యుండిరి. మొదటిలోఁడక్క నింకెపుడును వాల్మీకిసంగతి రాలేదు. చివర ఉత్తరకాండలో మాత్రము వచ్చినది. రాముని రాకవల్ల రాక్షసులు వచ్చుచుం డుటచే ఋషులు భయపడుచుండుట జరిగినది. రాముఁడు అక్కడ ఋషులకు కష్టములేకుండుటకై ఆ చోటువిడిచి అగస్త్యాశ్రమమునకు వచ్చి యక్కడనుండి దండకాటవికి వచ్చెను. సీతారామ లక్ష్మణులు వచ్చివెళ్ళిన కొంత కాలమునకు నారదుడు వచ్చుటయు వాల్మీకి యడిగిన ప్రశ్నలకు నారదుఁడు రామునిచరిత్ర చెప్పుటయు జరిగియుండవచ్చును.

"రామః సీతామనుప్రాప్య రాజ్యం పునరాప్తవాన్"

(బాలకాండ)

రాముఁడు రావణునిజంపి సీతనుపొంది మరల రాజ్యము పొందెను అని చెప్పి

"రామోరాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకంగమిష్యతి"

పదునొకండువేల యేండ్లు రాజ్యము పాలించి బ్రహ్మలోకము పొందును. అని చెప్పెను. దీనిని బట్టి వాల్మీకికి నారదుడు ప్రారంభము నుండి పట్టాభి షేకము వరకు చెప్పెనని తరువాతఁ గొంతకాలము రామాయణము రచించెనని పిదప సీత ఆశ్రమములోనున్నపుడు ఉత్తరకాండ రచించెనని మనమూహింప వచ్చును. పిదప కుశలవులు పుట్టుట వారిచే రామాయణము గానము చేయించుట మొదలగునవి గ్రంథములోనే చెప్పఁబడెనుగదా.

ప్రతిమాట చేసిన ప్రతిపని సత్యమేయని జగమంతయు నమ్మి తమకు అసంగతముగాఁ దోఁచిన విషయములను శంకించుట, విమర్శించుటయు జరిగినది. ఇది కవి కల్పితమన్నచో అసలు ప్రశ్నలకు తావేలేదు.

వాల్మీకి వ్రాసిన రామాయణమె అన్నిటికంటె ప్రాచీనము. అసలు రామాయణముకన్న పూర్వము రచితవాఙ్మయమె లేదు. ఉండునన్నను అది దొరకలేదు. అయినపుడు వాల్మీకి రామాయణముకంటె భిన్నమయిన రామాయణములు ఎందుకు వచ్చినవి? రామాయణములో సూచింపఁబడిన విషయము ననుబట్టి యనేకులు రామునిచరిత్ర అనేకరకములుగా వ్రాయుట జరిగినది. వాల్మీకి రామాయణములోని సంగతులకు విరుద్ధముగానున్నవి అప్రమాణములేయని అనకతప్పదు. అధ్యాత్మ రామాయణాది గ్రంథములందు రామునికి అతిమానవ శక్తులున్నట్లు చూపబడినది. "నిజమైనసీత అగ్నిలోఁబడెను. మాయాసీత అగ్నినుండి వెడలెను. ఆ సీతను రావణుడు దొంగిలించినట్లును, చివర అగ్నిలో మాయసీత పడినట్లును, నిజమైనసీత అగ్నినుండి వచ్చినట్లును ఇది సీతారాములకే తెలియు"నని కల్పితము. రాముఁడు తాను మానవుఁడననుకొన్నపుడేకాని రావణునిచంపుట కుదురదు. వాల్మీకి రాముని పూర్ణమానవునిగా చూపినాఁడు. ఏమైన రామునికి బలహీనతలు మొదటఁ గలిగినను వానిని అధిగమించినట్లు కనిపించును.

## —: రా మా య ణ ర చ న :—

అసలు రాముని చరిత్ర జరుగుటకుముందే ఈ రామాయణము వ్రాయబడినదను వాదము బయలుదేరుటవలను జరిగినది.

కైక కోరిన వరముల ప్రకారము సీతారామ లక్ష్మణులు అత్రియాశ్రమమునుండి చిత్రకూటగిరి దగ్గఱకు వెళ్ళిరి. అక్కడ వాల్మీకి యాశ్రమమునకు వెళ్ళి వాల్మీకికి నమస్కరించిరి. వాల్మీకి వారిని గౌరవించి కూర్చుండమని చెప్పి స్వాగతమిచ్చెను. పిదప వాల్మీకికి నివేదించి అక్కడ పర్ణశాల నిర్మించుకొనిరి.

"ఇతి సీతాచ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః
అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్
తాన్మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్
ఆస్యతా మితిచోవాచ స్వాగతంతు నివేద్యచ.

అయోధ్యాకాండ 56–16, 17

ఈ వాల్మీకియె రామాయణ కర్తయయి యుండవచ్చును. భరతుఁడు వచ్చి పాదుకలను పట్టుకొని వెళ్లువరకు సీతారామలక్ష్మణులు చిత్రకూటములోనే యుండిరి. మొదటిలోఁదక్క నింకెపుడును వాల్మీకిసంగతి రాలేదు. చివర ఉత్తరకాండలో మాత్రము వచ్చినది. రాముని రాకవల్ల రాక్షసులు వచ్చుచుండుటచే ఋషులు భయపడుచుండుట జరిగినది. రాముఁడు అక్కడ ఋషులకు కష్టములేకుండుటకై ఆ చోటువిడిచి అగస్త్యాశ్రమమునకు వచ్చి యక్కడనుండి దండకాటవికి వచ్చెను. సీతారామ లక్ష్మణులు వచ్చివెళ్ళిన కొంత కాలమునకు నారదుడు వచ్చుటయు వాల్మీకి యడిగిన ప్రశ్నలకు నారదుఁడు రాముని చరిత్ర చెప్పుటయు జరిగియుండవచ్చును.

"రామః సీతామనుప్రాప్య రాజ్యం పునరావ్తవాన్"

(బాలకాండ)

రాముఁడు రావణునిజంపి సీతనుపొంది మరల రాజ్యము పొందెను అని చెప్పి

"రామోరాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకంగమిష్యతి"

పదునొకండువేల యేండ్లు రాజ్యము పాలించి బ్రహ్మలోకము పొందును. అని చెప్పెను. దీనిని బట్టి వాల్మీకికి నారదుడు ప్రారంభము నుండి పట్టాభిషేకము వరకు చెప్పెనని తరువాతఁ గొంతకాలము రామాయణము రచించెనని పిదప సీత ఆశ్రమములోనున్నపుడు ఉత్తరకాండ రచించెనని మనమూహింప వచ్చును. పిదప కుశలవులు పుట్టుట వారిచే రామాయణము గానము చేయించుట మొదలగునవి గ్రంథములోనే చెప్పఁబడెనుగదా.

## —: రామాయణమున కాండలెన్ని :—

పాద్మపురాణములో పాతాళఖండము 17వ అధ్యాయములో ఇటు చెప్ప బడినది.

"షట్కాండాని సురమ్యాణి యత్రరామాయణేఽనఘ
బాలమారణ్యకం చాన్యత్కిష్కింధం సుందరం తథా
యుద్ధముత్తరమన్యచ్చ షడేతాని మహామతే.

అనఘా! రామాయణములో ఆఱుకాండలు రమ్యమైనవి. బాలకాండ అరణ్యకాండ, కిష్కింధకాండ, సుందరకాండ, యుద్ధకాండ, ఉత్తరకాండ అని ఇవి ఆఱుకాండలు అని, అయోధ్యకాండ వేరుగాఁ బరిగణింపక బాలకాండలోనే అంతర్భావింపఁ జేసిరి.

చతుర్వింశతి సహస్రాణి శ్లోకానా ముక్తవాన్ ఋషిః
తథా సర్గ శతాన్పంచ, షట్కాండాని తథోత్తరం బాల॥ 4-1

అనుశ్లోకమునుబట్టి 24 వేలశ్లోకములు 5వందలసర్గలు, ఆఱు కాండలు. మఱియు ఉత్తరకాండ వాల్మీకిఋషి రచించెను. అనుదానినిబట్టి అయోధ్యకాండ వేఱుగా పరిగణింపబడిఆఱుకాండలును, ఉత్తరకాండయు అనిచెప్పెను. దీనిని బట్టి అయోధ్యకాండనుగూడ వేఱుగాగ్రహించినట్లు తెలుచున్నది. కాన ఉత్తర కాండతో ఏడుకాండలగును.

## —: శాంత—దశరథుని కూతురు :—

రామాయణములో వాల్మీకి కొన్ని విషయములను సూచించి వదలి పెట్టును. వానిని మనమూహింపవలయును. దశరథునికి కౌసల్యయందు శాంతయను కుమార్తె కలిగినట్లును ఆమెను రాకుమారునికీయఁబోఁగా వరశు రాముఁడువచ్చి ఈమెను రాకుమారునికీయవలదని మునికుమారునికిమ్మనగా అపుడామెను రోమపాదునికి పెంపుడు కుమార్తెగానిచ్చెననియు పిదప ఆమెను ఋశ్యశృంగుఁడు గ్రహించినట్లు చెప్పెదరు. ఆ ఋశ్యశృంగుడే పుత్రకామేష్టి చేయించినట్లు పుత్రులు కలిగినటులు ఉన్నకథ మనకు తెలిసినదే.

—: పాయసము—విభాగము :—

పుత్రకామేష్టిలో ఒక యజ్ఞపురుషుఁడు పాయసమును దశరథునికిచ్చెను దశరథుఁడా పాయసములో సగము కౌసల్యకిచ్చి మిగిలిన సగము మరల సగముచేసి దానిని సుమిత్రకిచ్చెను. ఆ మిగిలిన సగమును మరల సగముచేసి కైకకిచ్చి చివర మిగిలిన సగమును కైకకంటె సుమిత్ర పెద్దదికాన కైకకంటె తేడా చూపుటకై విశేషజ్ఞుడగురాజు మరల సుమిత్రకిచ్చివేసెను. ఈ విధముగా కౌశల్యకు సగము సుమిత్రకు పావు, మరల ఎనిమిదవ వంతు, కైకకు ఎనిమిదవ వంతు అయ్యెను.

ఇటులు చెప్పుకొన్నపుడు

భరతోనామ కైకేయ్యాంజజ్ఞే సత్యపరాక్రమః
సాక్షాద్విష్ణో శ్చతుర్భాగః సర్వైఃసముదితో గుణైః

సత్యపరాక్రముడగు భరతుడు సాక్షాద్విష్ణువునకు నాల్గవ యంశవాఁడు. సర్వ గుణములు గలవాఁడు. సాక్షాత్తు విష్ణువునకు ఇట ఎనిమిదంశ వాఁడు పాయసమును బట్టి యయ్యెనుగాన నాల్గవయంశవా డెటు అయ్యెనని ప్రశ్న వచ్చుచున్నది కాని ఇక్కడ సాక్షాత్తు విష్ణువునకు అనుచోట విష్ణువు సాక్షాత్తు అవతరించిన సగము అంశయైన రామునకు నాల్గవ యంశవాడు అని యర్థము చెప్పుకొన్నచో ఈ విరోధము ఉండదు. ఇదే యన్నిటి కంటె మంచిదిగా వ్యాఖ్యాన కర్తలు అంగీకరించిరి.

అథ లక్ష్మణ శత్రుఘ్నౌ సుమిత్రాఽజనయ త్సుతౌ
వీరౌ సర్వాస్త్ర కుశలౌ విష్ణోరర్థ సమన్వితౌ. బాల 18-73

ఇక్కడ లక్ష్మణ శత్రుఘ్నులు విష్ణువునకు అనఁగా అవతరించిన రామునికి సగము, సగములో సగ భాగము కలవారని భావము. ఇక్కడ అర్థ

శబ్దమునకు ఆ సగము అని కాక అంశము అని చెప్పుకొని షష్ఠమున కంశలు అని వ్యాఖ్యానకర్తలు సమన్వయించిరి.

## రాముని తరువాత భరతుఁడు పుట్టెను

కౌసల్యాఽజనయద్రామం సర్వలక్షణ సంయుతం. బాల 18-11

అని రాముని జననము తరువాత

భరతోనామ కైకేయ్యాంజజ్ఞే సత్యపరాక్రమః. బాల 18-12

సత్యపరాక్రముడైన భరతుఁడు కైకకు పుట్టెను అని చెప్పుటచే రాముని తరువాత భరతుఁడు పుట్టెనని గ్రహింపవలయును.

భరతాదేవ రామస్య రాజ్య సాధారణాద్భయం
తద్విచింత్య విషణ్ణాస్మి.

అని మంధర రామునికి భరతునివల్లనె రాజ్యభాగ సామ్యమును బట్టి భయము. అందు అది ఆలోచించి రాముడు భరతుని కేమి చేయునా అని భయపడు చున్నానని అన్నది. దీనిని బట్టి రాముని పిదప భరతుడె పుట్టెనని తెలియుచున్నది.

శక్య ముద్ధర్తుం నసంఖ్యే భరతానుజః. యుద్ధ 59-112

రామేణాపి పరిష్వఽక్తో లక్ష్మణేనాభివాదితః. యుద్ధ 3-8

యుద్ధములో భరతుని తమ్ముఁడగు లక్ష్మణుడు ఉద్ధరింప శక్యముగాని వాఁడు అనుచోట లక్ష్మణుఁడు భరతునితమ్ముఁడనెను. లక్ష్మణునిచే నమస్కరింపబడినవాడు. అను వీనినిబట్టి భరతుఁడు లక్ష్మణునికంటె పెద్ద అని గ్రహింపవలెను. వీనికి భిన్నముగా నున్నవి మరొక రీతిగా సరిపుచ్చుకొనవలెను.

# సీతారాముల వయస్సు

యాగ రక్షణకై రాముని పంపమని దశరథుని విశ్వామిత్రు డడిగెను. అపుడు

ఊన షోడశవర్షో మే రామో రాజీవలోచనః. బాల 20-2

రాముఁడు పదునారేండ్లు నిండనివాడు. ఎటు పంపుదును అని దశరథుఁ డనెను. అనఁగా నాలుగేండ్లు తక్కువ గలవాడు 12 ఏండ్ల వాఁడు అని యను కొనవలెను. కనుకనే మారీచుఁడు రావణునితో రాముని శక్తిగురించి చెప్పుచు

ప్రత్యువాచ మహాభాగం విశ్వామిత్రం మహామునిం
బాలో ద్వాదశవర్షోఽ యు మకృతాస్త్రశ్చ రాఘవః. అరణ్య 38-6

నా కుమారుడు అస్త్ర పాటవము లేనివాడు 12 ఏండ్ల వాడు అని దశరథుఁడు మహాభాగుడైన విశ్వామిత్రునికి చెప్పెను. దానినిబట్టి రామునికి 12 ఏండ్లై యున్నవనుకొనెను. మరియు సీత అడవిలో రావణునితో నిట్లు అనెను.

ఉషిత్వా ద్వాదశసమా ఇక్ష్వాకూణాం నివేశనే
భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామ సమృద్ధినీ
తత స్త్రయోదశేవర్షే రాజాఽమంత్రయత ప్రభుః
మమభర్తా మహాతేజా వయసా పంచవింశకః, అరణ్య 47

ఇక్ష్వాకుల యింట పన్నెండేండ్లు భోగములు అనుభవించుచుండఁగా పదుమూడవయేట రాజు వనవాస సంకల్పము చేసెను. నా భర్తకు అప్పుడు ఇరువదియైదుయేండ్లు అనెను. విశ్వామిత్రుడు యాగరక్షణకై తీసికొని వెళ్లి మిథిలకు వెళ్లి వివాహము జరపెను. అప్పుడు 12 ఏండ్లు. వివాహమైన పిదప 12 ఏండ్లు ఇక్ష్వాకుల యింటిలో నుండెను. 13వ ఏట వివాహము. కనుక 12 ఏండ్లు, 13 ఏండ్లు కలుపగా 25 ఏండ్లు వనవాసమునాటి కనెను. ఇంక వనవాసము 13 ఏండ్లయ్యెను కనుక రామునికి సీతను రావణుఁ డెత్తికొనిపోవునప్పటికి 38 ఏండ్లు అని తెలినది. ఇంక కౌసల్య రాముఁడు వనవాసమునకు వెళ్లు నప్పుడు

దశస ప్తచ వర్షాణి తవ జాతస్య రాఘవ. అయోధ్య 20-11

నీవు పుట్టి పదునేడు ఏండ్లు అయినవి. వనవాసమునకు వెళ్లునపుడు రామునికి 25 ఏండ్లు ఉండగా పదునేడు ఏండ్లు అని కౌసల్య ఎట్లన్నది అనగా మొదటి జన్మ నుండికాక (అప్పుడు రామునికి ఎనిమిదేండ్లు) రెండవ జన్మ యగు ఉపనయన కాలమునుండి చెప్పెననియు అనుకొనవలెను. ఉపనయ నము నాటికి 8 ఏండ్లు పిదప పదునేడేండ్లు అయినవి గాన ఎనిమిది పదునేడు కలిపిన ఇరువది యైదు అని సమన్వయించుకొనవలయును.

## సీత వయస్సు

రావణుడు సీత నెత్తుకొనిపోవుటకు సన్యాసి వేషముతో వచ్చినపు డిట్లు అన్నది.

అష్టాదశ వర్షాణి మమ జన్మని గణ్యతే. అరణ్య 47

పదునెనిమిదేండ్లు నా జన్మయందు లెక్కింపబడున్నవి. ఇంక తాను పన్నెండు ఏండ్లు ఇక్ష్వాకులయింట భోగములను అనుభవించినట్లు పై వాక్య ములవలన తెలియుచున్నది, పదునెనిమిదేండ్లలో పన్నెండేండ్లు తీసివేయుగా వివాహ కాలమునకు అయిదేండ్లు ఉన్నట్లు తెలియుచున్నది. కాని సీత అనసూయతో

పతి సంయోగ సులభం వయో దృష్ట్వాతు మే పితా
చింతామగమద్దీనో వి త్తనాశాది వాధ్వగః. అయోధ్య 118-34

పతితో కలియుటకు వయస్సువచ్చినట్లుచూచి నా తండ్రి ధనము పోయిన బాటసారి వలె దుఃఖించెను. అని చెప్పిన దానినిబట్టి సీతకు వివాహ కాలమునకు 12 ఏండ్లు ఉన్నవనవలయును. అయితే 18 ఏండ్లు అని రావణు నితో నెట్లు చెప్పెను. అనగా సీత జనకునికి దొరకకముందు పెట్టెలో 6 ఏండ్లు ఉన్నదనవలెను. ఈ యారేండ్లు కలిపిన 24 ఏండ్లు అగును. తరువాత ఏండ్లు వనవాస సమయము కాన 25 ఏండ్లు అగును. వనవాసపు ఏండ్లు 13 కలిపినచో సీతకు 38 ఏండ్లగును. ఇట్లు చెప్పుకొన్నచో పై మాటలు సరిపోవును.

# కైకవరములు

కుమారులందఱకు పెండ్లియయిన తరువాత భరతుఁడు శత్రుఘ్నునితోఁగూడ మేనమామ యింటికి వెళ్లియుండెను. రాముఁడు గుణాభిరాముఁడని ప్రజలకు రామునిమీఁద అనురాగము గలిగినది. దశరథుడు రామునికి పట్టాభిషేకము చేయవలెనని కోరెను. ప్రజలను సామంతులను వారి యభిప్రాయము కనుగొనుటకు పిలిచెను. కేకయరాజును జనకమహరాజును పిలువలేదు. వారి దేశములు దూరము. అభిషేకము తొందరగా కావలయును. వారు తరువాత ఈ సంగతి విందురులే యని యనుకొనెను. కేకయరాజును పిలువకపోవుటలో ఏదైన భయ మున్నదేమో. తనకో దుర్నిమిత్తములు కనిపించుచున్నవి. రాముని పిలిచి యిట్లు అనెను.

విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః
తావ దేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతోమమ॥

ఈ పురమునుండి వెళ్ళి పరదేశములో భరతుడు ఉన్నంతలోనే రామునికి అభిషేకము చేయవలసి యున్నది.

కామంఖలు సతాంవృత్తే భ్రాతాతే భరతః స్థితః
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః
కింతు చిత్తం మనుష్యాణా మనిత్య మితిమేమతిః

అయోధ్య–4-26, 27.

నీ సోదరుఁడు భరతుఁడు పూర్తిగా సత్ప్రవర్తనలోనేయున్నాడు. జ్యేష్ఠుడవైన నిన్ననుసరించువాఁడు, ధర్మాత్ముఁడు, జితేంద్రియుఁడు గాని మనుష్యుల మనస్సు స్థిరముగానుండదని నాయుద్దేశము. అని దశరథుఁడు అనెను ఇట్లు ఎందుకు అనవలసి వచ్చినది. వాల్మీకి కొన్ని విషయములు సూచించి వదలుచుండును. కైకను వివాహమాడునపుడు కేకయరాజు తన కుమార్తెకు పుట్టినవానికి రాజ్యమిచ్చినచో నా కుమార్తెను ఇచ్చెదనని పురోహితుని ద్వారా తెలుపగ దశరథుఁడు

వివాహస్తు మమాభీష్టో నపుత్రే రాజ్యమర్పణం
యదిచేన్మమ పుత్రాశ్చ భవిష్యంతి హ్యపుత్రిణః
తేచాస్య వంశస్య మర్యాదాంచ కుమారకాః
న్త్యజంతి మహాత్మాన స్త్వాదా విక్ష్వాకునాకృతాం॥

- ఉమాసంహిత

కైకను వివాహమాడుట యిష్టమె కాని కైకపుత్రునికి రాజ్యమిచ్చుట నాకిష్టము గాదు. పుత్రులులేని నాకేకనుక పుత్రులు పుట్టినచో వాడు ఇక్ష్వాకులు చేసిన మర్యాదను కాపాడకపోరు. జ్యేష్ఠునికే రాజ్యమివ్వ అంగీకరింతురు అని తలచి

యథా వదసి భోవిప్ర తథై వ కరవాణ్యహం
పట్టాభిషేకసమయే భవేయం స్మారితోయది
త్వయా వాక్యేన భూపాల తదాచేత్కరవాణ్యహం
ఇత్థం ప్రతిజ్ఞా మకరోచ్చ్వివాహ గ్రహణేనృపః
తస్మాదస్మి న్నరవ్యాఘ్రే నదోషో స్తి శుభాననే. - ఉమాసంహిత

ఓ విప్రా! యట్లే చేయుదును కాని పట్టాభిషేక సమయమున నాకు జ్ఞాపకము చేసినచో నీ వాక్యము ప్రకారము చేయుదును. అని రాజు ప్రతిజ్ఞచేసెను. కనుక ఎవరు జ్ఞాపకము చేయలేదు కనుక రాజులో దోషములేదు. అని ఉమాసంహితలోఁ జెప్పఁబడినది. ఇట్లు ఎవరైనను జ్ఞాపకము చేయుదు రని భరతుని విషయములో రాజు భయపడినట్లు కవి సూచించెను.

ఈ విషయము మంథరయైనను జ్ఞాపకము చేయలేదు. రాముని పట్టాభిషేకపుసంగతి మంథరవలని కైకతోఁ జెప్పగా కైక "ఎంత మంచిమాట చెప్పితివి" నాకు భరతుడొకటి రాముడొకటినా అని సంతోషముతో మంథరకు హారము బహూకరింపగా దానిని నేలపై కొట్టి మంథర నీసవతి కౌసల్యవల్ల నీకుఁజిక్కు వచ్చును. రాముడు నీ కొడుకును తనకడులేకుండుటకై చంపింప గలడని దుర్బోధచేయుటచే కైక సరేయన్నది. మంథర వివాహపునాటి షరతును జ్ఞాపకము చేయక శంబరాసుర యుద్ధసమయములో దశరథుఁడిచ్చిన రెండు వరములను కోరమన్నది. షరతు ప్రకారమైతే భరతునికి రాజ్యమొకటే సిద్ధించును రామునివల్లభయము ఉండనే యున్నది. రాముడినే ప్రజలు రాజుగా అంగీకరించెదరేమో అనితలచి కాఁబోలు శంబరాసుర యుద్ధసమయమున ఇచ్చిన వరములనే కోరునట్లు చేసినది. రెండవవరముచే రాముని వనవాసము కోరుట చేసినదని యనుకొనవలెను. సరే కైక వివాహకాలపు షరతు రామునికి

తెలియునా? తెలిసినచో తన పట్టాభిషేకమునెట్లు ఒప్పుకొనెను. భరతుఁడు రాముని వనవాసము విని దుఃఖించి తల్లిని నిందించి రాముని తీసికొనివచ్చుటకు వెళ్ళి రమ్మని ప్రార్థించి బలవంతపెట్టఁగా చివర- "మన తండ్రి నీ తల్లికి పెండ్లిలో రాజ్యము శుల్కముగా నిచ్చెద" ననెను. కాన రామునికిది తెలిసియు తండ్రి యాజ్ఞచే అభిషేకమున కంగీకరించెనని గ్రహింపవలెను.

రాముఁడు ఏకపత్నీవ్రతుఁడు

రాముఁడు ఏకపత్నీవ్రతుఁడా కాఁడా ? అను విషయములోఁగూడ పెక్కు ర్లను బయలుదేఱినవి. ఇందుకు క్రిందివి ప్రమాణముగా తోఁచుచున్నవి.

హృష్టాఃఖలు భవిష్యంతి రామస్య పరమాః స్త్రియః. అయోధ్య 12-12.

రాముని గొప్ప స్త్రీలు పట్టాభిషేకమునకు సంతోషింతురు అని మంథర అన్నది, స్త్రీలు అని బహువచనముచే ఎక్కువ భార్యలున్నారని తోఁచును కాని ఇది మంథర చేసిన పరిహాసము గావున ఇది ప్రమాణము గాదు. ఇట్లే

యుత్సుఖేషూపధానేషు శేతే చందన రూషితః
వీజ్యమానో మహార్హాభిః స్త్రీభిర్మమ సుతోత్తమః. అయోధ్య 42-12

చందనము పూసికొని సుఖమైన తలగడలపైఁ పరుండి మహార్హలగు స్త్రీలచే విసరఁబడు నా కొడు కెట్లు అడవిలో నుండఁగలఁడని దశరథుఁడు విలపించెను. స్త్రీలనఁగా పరిచారికలని కాని భార్యలని కాదు. కాన ఇదియు రాముఁడు బహుపత్నీకుండు అనుటకు ప్రమాణముకాదు. ఇట్లే సీత

పితుర్నిదేశం నియమేన కృత్వా
వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ
స్త్రీభిశ్చ మన్యే విపులేక్షణాభి
స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః. సుందర 27.

సీత అశోకవనిలో తాను చనిపోవగా తండ్రియాజ్ఞను పాలించి వనవాసవ్రతము పూర్తిచేసి అనేక స్త్రీలతో సుఖింతువు." అన్నమాట పూర్వపు సంగతి

కాదు. తాను చనిపోయిన తరువాత రాముఁడు అనేక స్త్రీలను పెండ్లిచేసుకొను నేమో. అని దుఃఖావేగముతో అన్న పలుకులు గాన అవియు బహు పత్నీత్వ మును సాధింపవు. ఇక

భుజైః పరమ నారీణాం పరిమృష్ట మనేకథా. యుద్ధ 21-3

పరస్త్రీల భుజములచే అనేక పర్యాయములు పరిమృష్టము రామ భుజము అన్నది పరిచారికలచే పరిమృష్టము అనియే గ్రహింపఁదగినది. కనుకనే ఉత్తర కాండమున సీతా త్యాగము పిదప

ఇషయజ్ఞో రఘుపతిః పుత్రద్వయ సమన్వితః
న సీతాయాః పరాం భార్యాం వవ్రే రఘునందనః. ఉత్తర 99-8.

యజ్ఞముచేసిన రాముఁడు పుత్రులతోఁగూడినవాఁడై సీతకంటె వేఱుగా ఇంకొక భార్యను వరింపలేదు. అని వాల్మీకి చెప్పెను. మఱియు

కాంచనీం మమపత్నీం దీక్షార్హాం యజ్ఞ కర్మణి
అగ్రతో భరతః కృత్వా గచ్ఛ త్వగ్రే మహాయశాః. ఉత్తర 91-౯.

నా భార్య బంగారు ప్రతిమను యజ్ఞకర్మలో దీక్షకు తగినదానిని మహా యశుఁడు భరతుఁడు ముందుంచుకొని వెళ్ళును. అని రాముఁ డన్నదియు దీనిని ధ్రువపఱచుచున్నది.

## రాముఁడు సత్యపరాక్రముఁడు

రాముఁడు సత్యమె పరాక్రమముగాఁ గలవాఁడు. ఆడిన మాట తప్పని వాఁడు. "రాజు దశరథుఁడు చెప్పినది శుభమైనను అశుభమైనను చేయుదువా" అని కైక రామునితో అనఁగా "రాజు చెప్పినచో అగ్నిలోఁ బడెదను. విషమై నను త్రాగెదను. సముద్రములో ఉఱికెదను. రాజున కిష్టమైనది రాముఁడు చేయును. రాముఁడు ఎప్పుడును రెండు మాటాడఁడు." అనును. అపుడు తన కిచ్చిన రెండు వరముల సంగతి కైక చెప్పఁగా "ఈమాత్రపు దానికి తండ్రి

నాతో చెప్పరాదా, నాతో మాటాడఁ డేల, ఈ విచార మేల. తండ్రియే కాదు, నీవు చెప్పినను చేయువాఁడనే అని, తల్లికి సీతకు చెప్పి వెళ్ళెదను" అని వచ్చి బయలుదేఱును. అప్పుడు తల్లి "నేను తల్లిని తల్లిమాట వినవలదా" అనఁగా బ్రతిమాలి, తండ్రి మాటయె యుండఱకు శిరోధార్యమని చెప్పి సెలవు తీసికొని సీతతో "నీవు అత్త మామలకు సేవ చేయుచు అయోధ్యలో నుండుము. అడవిలో చాల కష్టము లుండును." అనును. అపుడు ఎంత చెప్పినను వినకపోగా అపుడు "నీవు మగ వేషము వేసికొన్న స్త్రీ అని మా తండ్రి తలపలేదు." అని పౌరుషముగా సీత అనినది. ఇంక అప్పుడు కాదనలేక సీతను తనతో రమ్మనెను. తనతో లక్ష్మణుఁడు వచ్చెద నన్నాఁడు, సరే అన్నాఁడు. సీతారామలక్ష్మణులు వనమునకు బయలుదేఱిరి. సుమంత్రుడు రథముపై ఎక్కించి తోలుచుండెను. వడిగా తోలుమని రాముఁడు అనెను. తోలకు అని దశరథుఁ డనెను. ఇదివిని అపుడు రాముఁడు నా తండ్రి బాధ చూడలేను త్వరగా తోలుము. ఒకవేళ తండ్రి నా మాట వినలేదా అన్నచో వినబడలేదు అని తండ్రితో చెప్పు అని రాముఁడు అనెను. ఇది యసత్యము కాదా అని సందేహము కలుగవచ్చును. కాని తాను చేయుదునని మాట యిచ్చినవి చేయకపోయినచో అనృతమగుము.

సత్యంబ్రూయాత్ ప్రియంబ్రూయాత్
నబ్రూయాత్ సత్య మప్రియం.

సత్యము పలుకవలయును. ప్రియము పలుకవలెను. సత్యమైన యప్రియము పలుకరాదు. అని ధర్మము.

అందుచేత చిరకాలము తండ్రి బాధ చూడలేక, ఇది తాను తన నోటితో చెప్పుటకాదు. ఏదో సర్ది చెప్పుట కటు సూతుని చెప్పుము అనెను. ఇది యసత్యముగా రాముఁడు తలఁపలేదనుకొనవలయును.

ఇట్లే హనుమంతునిజూపి రాక్షసస్త్రీలు ఈతడెవరు? అని సీతను తఱచి అడుగుదురు. అపుడు "ఇట్టి మోసములు తెలిసిన మీకుగాని నాకేమితెలియును పాముకు కాళ్ళు ఉన్న వోలేవో పాముకుగాని నాకేమి తెలియును అనును. ఇది పైదానివంటిదే.

రాముని జూచి గుహుఁడు శోకించి ఈ వనరాజ్యమంతయు నీదే. దీనిని పాలించుచు సుఖముగా ఉండుమనెను. "నేను కైకతో అడవిలో దొరకువానినే తినుచు ఉందునంటిని. కనుక నీవిచ్చినవి గ్రహింప" నని గుహునితోచెప్పి లక్ష్మణుడు తెచ్చిన నీళ్ళుత్రాగి ఆ మొదటి దినము వనమున గడపెను.

భరతుఁడు రామునిఁ దీసికొనివెళ్లుటకు వనమునకువెళ్ళి మాఅమ్మ అంగీకరించినది. నేను నీకు రాజ్యమును ఇచ్చుచున్నాను గ్రహింపుమనెను. నేను అంతకుముందు వనవాస ప్రతిజ్ఞచేసి తండ్రిపోయిన తరువాత అందఱునచ్చి రాజ్యము ఏలుమన్నచో నేను అయోధ్యకు వచ్చినచో జనమేమందురు. నేను అన్నమాట ప్రకారము చేసితీరెదను. నీ వాటా ప్రకారముఁ రాజ్యమేలు, నేను వనవాసము చేయుట అనిచెప్పి చివరకు తనపాదుకలనిచ్చెను. ఈ యన్నిటిలోను సత్యము తూచా తప్పక రాముడుఆచరించెను.

రాముఁడు మానవహృదయము కలవాఁడు. అతనికి సుఖములన్నియు ఇష్టమేకాని కర్తవ్యముముందు సుఖములను త్రోసిపైచును.

విరాధుఁడు మొదలైనవారు సీతను అపహరించి తీసికొనిపోఁగా దానింసకామా కైకేయీ, సంపూర్ణాకామా, కైక కోరిక నేడు తీరినది. కైక కోరిక పూర్తిగా తీరినది' అనును. కాని కర్తవ్యనిష్ఠలో వెనుకాడలేదు. ఇంకను వనవాసపు మొదటగూడ ఇట్లేయనును.

—: వాలిని చాటుగాఁజంపుట అన్యాయముకాదా :—

సీతను రావణుఁడు హరించిన తరువాత సీతను వెదకుచు ఋశ్యమూకము చేరి సుగ్రీవునితో సఖ్యముచేసి "వాలినిచంపి నీకు రాజ్యమిప్పింతును. సీతను వెదకించి నాకు సాయము చేయుము" అనును. వాలిసుగ్రీవులు యుద్ధము చేయుచుండగా చెట్టుమాటునుండి బాణము వేసి వాలిని చంపును. అపుడు చాటు నుండి చంపిన వంచకుఁడవు అని వాలి రాముని నిందించును. ఇక్కడ వాలి తన ఎదురుగానుండి యుద్ధము చేయునపుడు ఎదుటివారి బలములో సగము వాలికి వచ్చునని సంగతి యున్నట్లు వాల్మీకి తననోటితో చెప్పకుకాని అట్టి వరమున్నదని రామునికితెలిసినట్లును, ఎదురుగాబోయి యుద్ధముచేసినచో తనబలములో సగము వాలికి పోవునని రాముఁడు చెట్టుచాటునుండి కొట్టినట్లును

రాముడు చెట్టుచాటునుండి కొట్టుట సూచించుచున్నది. బ్రహ్మాదులు వరము లిచ్చుటయు, ఆ వరములు కూడ పట్టనట్టి యుపాయములు పన్ని రాక్షసాదులను చంపుటయు పురాణప్రసిద్ధము. వాలి రాముడు తన్ను చంపినపుడు "నీవు అన్యాయముగా జంపితివి అనుచుగాని తనకు ఎదుటివాని బలమువచ్చును గాన ఈ విధముగ చంపెనుగదా అని యనుకొనడు. పోని తాను అకృత్యములను చేయక యుండునా. తాను అకృత్యములను చేయువచ్చును. రాముడు తన వరముల షరతులు పట్టకుండ గొట్టెను అది న్యాయమె అనియు అనుకొనడు. అటులు అనుకొనక ముఖ్యముగా ఇటు ఆక్షేపించును. "నీకు అన్యాయముచేసిన వాడనుగాను. పైగా ఇతరునితో యుద్ధముచేయుచు పరాకుగా నున్నపుడు నన్నేల చంపితివని యాక్షేపించును. దానికి రాముడు 'సోదరుడు బ్రతికియుండగా అతని భార్యను దొంగిలించినందుకు శిక్ష మరణమె. భరతుని రాజ్యములో ఇట్టి అన్యాయము జరుగుటకు వీలులేదు. రాజశాసనము ప్రకారము నేను చంపితిని. పైగా సుగ్రీవునికి వాగ్దానముచేసిన ప్రకారము నిన్ను చంపితిని అనును. "నేను కోతిని తినుటకు పనికిరానుగదా ఏల చాటుగాచంపితివి" అని వాలి అన్న దానికి రాజులు వేటాడుదురు. క్రూరమృగములను చంపుటకు ఎదురు, చాటు అను నియమము లేదు అని జవాబుచెప్పి యొప్పించును. 'ఎదురుగానున్న వాని సగము బలము వాలికి వచ్చు' నను వరమున్నదన్నపుడు చాటుగా రాముడు చంపుట అన్యాయము అని విమర్శకు లనరని యనుకొందును.

పూర్వకథలలో శాపములు, వరములు ఉన్నవి. ఆ శాపాదుల ప్రకారము యిప్పుడు జరుగుటలేదని మనము వానిని నమ్మము. మనము విమర్శించునపుడు కథలలోగాని చరిత్రలలోగాని కవులు చెప్పినవి సరిగానమ్మి విమర్శింపవలసి యుండును. ఎదురుగానున్న వానిబలము వాలికివచ్చునని నమ్మినపుడు దుష్టుని వాలినిచాటుగా చంపుటయు న్యాయమె అనవలయును. సీత అగ్నిలోబడినది. ఆమె పావిత్ర్యమునుబట్టి ఆమెకు ఏమియు కష్టము కలుగలేదు. ఇత్యాదులుకూడ పై వానివంటివే.

హనుమంతుడు వచ్చి సీతకు రాముని జయము, రావణ సంహారమును చెప్పి నిన్ను బాధలుపెట్టిన యీ రాక్షసస్త్రీలను చంపెదను సెలవిమ్ము అనును, అపుడు సీత యిట్లనును. 'పాపము ఈ రాక్షసస్త్రీలు రావణుని దాస్యములో నున్నపుడు నన్ను బాధించిరి. వీరు రావణుని బానిసలు కనుక బాధించిరి. ఇప్పుడు రావణుడు హతుడయ్యెను. నన్నింక వీరు బాధింపరు. లోకములో

ప్రభువు చెప్పినట్లు దాసదాసీలు చేయుదురు. అది వారితప్పుగాదుగాన వారిని బాధింపవలదని యనును.

రాముఁడు సీతను తీసికొనిరమ్మని విభీషణుని పంపగా "నేనిట్టే స్నానము చేయక వచ్చెదను" అనును. అపుడు రాముని యాజ్ఞ ప్రకారము చేయుట మన విధి. స్నానముచేసి యలంకరించుకొని రమ్మనును. సరే అట్లేయని సీత స్నానముచేసి అలంకరించుకొని వచ్చును.

## —: రాముని మానవత్వము :—

అపుడు సీతనుచూచి రాముడు నీకై నేను జయింపలేము దుష్టసంహారము చేసితిని. నీకిష్టము వచ్చినట్లు వెళ్ళవచ్చును." అని రాముడు సామాన్య పురుషునివలె అనును.

అపుడు నీవు నా సంగతి తెలిసియు ఇట్లు అనవచ్చునా? ఎవరో ఒక దుష్ట స్త్రీనిబట్టి స్త్రీజాతినంతటినిబట్టి అవమానించుచున్నావు. అని [redacted] ముతో గట్టిగా అని లక్ష్మణుని చితిపేర్చుమని ప్రవేశించును.

## —: సముద్రముపైని రాముడు సేతువు గట్టుట :—

రాముఁడు దారి యిచ్చుటకు సముద్రునిమీద బ్రహ్మాస్త్రము వేయబోగా సముద్రుడు వచ్చి "రామా! భూమ్యాది భూతములు శాశ్వతముగా స్వభావము గనే యుండును. నలుడు విశ్వకర్మ కొడుకు సేతువును గట్టగలడు, ఆ సేతువును దాల్తును" అనగా నలుని పిలిచి రాముడు సేతువు గట్టించును. అపుడు నలుని మాట వలన వానరులు పర్వత శిలలను సాల వృక్షములను వేసి సముద్రమును పూరించిరి. త్రాళ్ళతో గట్టిరి. కర్రలు పైచిరి. మొదటినాడు 14 యోజనములు రెండవనాడు 20 యోజనములు, మూడవనాడు 21 యోజనములు, నాల్గవనాడు 24 యోజనములు. అయిదవనాడు ౨౩ యోజనములు కట్టిరి. ఈ విధముగా అయిదు రోజులలో సేతువు పూర్తియైనది.

## —: ఇంద్రజిత్తు కథ :—

ఇంద్రజిత్తునకు "14ఏండులు నిద్రాహారములు లేనివాడే చంపగల" డని వరమున్నది. ఇది వాల్మీకి సూచింపలేదు. 14 ఏండులు వనములోసీతారాముల సేవలో నిద్రాహారములు లేని లక్ష్మణుడు చంపునని వాసిష్ఠ రామాయణములో గలదు.

రావణునికి వేదవతి, నందికేశ్వరుడు. నలకూబరుడు, రంభలు ఇచ్చిన శాపములనుబట్టి రావణుడు సీతకు హాని ఏమియు చేయలేకపోయెను. ఆ శాపములు రావణుని వరములకంటె బలిష్ఠము అని గ్రహింపవలయును.

## —: సీత పూర్వ జన్మలో వేదవతి :—

వేదవతితండ్రి కుశధ్వజుడు. ఆమె విష్ణువును వివాహముచేసికొన తపస్సు చేయుచుండగా రావణుడు బలాత్కరింపబోయి జుట్టు పట్టుకొనగా ఆమె తన చేతితో జుట్టు గోసిపైచి యగ్నిలో బడెను. పిదప ఆమె అయోనిజగా లంకలో పద్మములో పుట్టెను. ఈమెవలన నీకు మరణమున్నదని జ్యోతిష్కులు చెప్పగా ఆమెను పెట్టెలో పెట్టి సముద్రములో విడువగా క్రమముగా ఆమె జనకుడు హాలము దున్నునపుడు నాగటి చాలులో దొరకెను గాన సీత అని పేరు పెట్టిరి. సీత యనగా నాగటి చాలు అని యర్థము.

## —: సీతా త్యాగము :—

జనులు బజారులలోను, ఉద్యానవనములలోను, అన్నిచోట్ల సీతను గూర్చి అపవాదములు చెప్పుకొనుటతో అవి భద్రుడను గూఢచారునివలన విని రాముఁడు సీతను అడవిలో విడచెను.

## —: శంబూకుని కథ :—

ఉత్తరకాండలోని కథ యిది. ఒక బ్రాహ్మణుని కుమారునికి అకాల మృత్యువు వచ్చినది. ఆ బ్రాహ్మణుఁడు రాముని రాజ్యపాలనను నిందించి నీ యన్యాయ పాలనము వలన నా కొమారుడు చనిపోయెను. దీనికేమి సమాధానము చెప్పుదువు అని నిలదీసి అడుగును. రామునితో అప్పుడు నారద మహర్షి అనెను. "నీ రాజ్యములో శూద్రుఁడు తపస్సు చేయుచున్నాఁడు. అటు శూద్రుడు తన వర్ణధర్మమగు శుశ్రూష చేయక తపస్సు చేయుచున్నాడు. కాన యిటు బ్రాహ్మణుని కుమారుఁడు చనిపోయెను. వానిని దండించుము." అన రాముఁడు వెదకి దండకావనములో శరీరముతో స్వర్గము పదవి కోరు శంబూకుఁ డను శూద్రుని జూచి వానిని జంపును. శంబూకుఁడు చనిపోయి గంధర్వు డయ్యెను. బ్రాహ్మణుని కుమారుడు బ్రతికెను. అని కథ.

ఉత్తర 76.

పూర్వపు ధర్మముల ప్రకారము బ్రాహ్మణుఁడు బ్రహ్మమును [illegible] ధన సంపాదన చేయక దొరకినంతతో తృప్తి పడి బ్రహ్మమెకావలయును.

స్థిత్యర్థాదధికం గృహ్ణన్ బ్రాహ్మణో యాత్యధోగతిం.

తాను బ్రతుకుటకు గావలసినదానికంటె ఎక్కువ గ్రహించిన బ్రాహ్మణుడు అధోగతిని పొందునని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇట్లే క్షత్రియుడును దుష్టశిక్షణలో, శిష్ట రక్షణలో ఆహుతి కావలయును. వైశ్యుడు కృషి, గోరక్షా వాణిజ్యాదులద్వారా ప్రజలను సేవింపవలయును.

శూద్రుడు తల్లివలె ప్రజలకు సేవచేయవలెను. చేసెను. అందుచే అతడు సంఘమునకు ఆధారమయ్యెను. ఈ సంఘముల నియమములను అతిక్రమించినచో అందరు శిక్షార్హులే. స్వధర్మములను పాటించినచో అందరు మోక్షము పొందుదురు. దీనినే గీత బోధించెను. గుణములో నైక్యాన్ని ఫలితములో అందరు సమానులే. అందుచే రాముడు రాజుకనుక వర్ణధర్మరక్షణ చేసెను. అందుచే చనిపోయిన బ్రాహ్మణుని కొడుకుకూడ బ్రతికెను.

'భవిష్య(తి)చ్ఛూద్ర యోన్యాం వై తపశ్చర్యా కలౌయుగే'
ఉత్తరకాండ–74.

కలియుగములో శూద్రుడు తపస్సు చేయవచ్చునని నారదుఁడు రామునితో అనెను. ఇతర యుగములలో చేయరాదని నాటి నియమము.

ఈనాడు పూర్వపు వర్ణ ధర్మముల ప్రకారము–ధనమునకు ప్రాధాన్యము నీయక–జీవించువారు లేరు. తల్లివలె కర్తవ్య నిష్ఠతో సేవ చేయు శూద్రులు లేకపోవుటచే సమాజస్థితి శోచనీయమైనది. కుటుంబములో చిన్నపిల్ల మొదలుకొని యజమానివఱకు ఎవరే పని చేసినను ఫలితము సమానముగానే యున్నది. కనుక కుటుంబములో సంఘర్షణలు లేవు. అట్లే సంఘములో గూడ అందఱకు పనులు వేరైనను ఫలము సమానముగా ఉన్నచో నేటి సంఘర్షణలుండకపోయెడివి. విద్య వినయమునకు జ్ఞానమునకుగాక ఆశ పెంచెడిదైనది. త్యాగజీవితమేపూర్వము అందఱకు ఆదర్శమైనది.

రాముడు రాజ్యము కోరలేదు. రాముని సేవయే లక్ష్మణునికి స్వర్గము. కైక సంపాదించి పెట్టినను భరతుఁడు రాజ్యము గ్రహింపక అన్నలాగుననే నార బట్టలు ధరించి నందిగ్రామములో ఉండి వనములో దొరకు నాహారమునే తిని ఋషి జీవితము గడపెను.

రామాయణములో సీతకున్నంత ప్రాధాన్యము ఊర్మిళ, శ్రుతకీర్తి, మాండవులకు లేదుగాన వారి ప్రస్తావనను వాల్మీకి తేలేదు.

పట్టాభిషేకమైన తరువాత కూడ సీత పట్టణవాసము గోరక ముని కన్యలతో ఆశ్రమములో నుండగోరెను. రాముఁడు సంపూర్ణ మానవుడుగా నుండి ప్రజారంజనమే యాదర్శముగా నుంచుకొని పాలించెను. రామాదుల నడతయే మనకు ఆదర్శముగా నుండునుగాక.

ఈ విధముగా వాల్మీకి రామాయణమును అన్నివిధములా తీర్చిదిద్దెను. దానిని సరిగా అర్థముచేసికొనవలయును. గ్రంథవిస్తర భీతిచేనిటులు సంగ్రహముగా కొన్ని విషయములు చర్చింపబడెను.

## —: కృతజ్ఞతలు :—

ఈ "రామాయణ సుధ"ను ప్రచురించుటకు తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివు ఆఫీసరుశ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాదుగారును, సంపాదకులు అయిన శ్రీ కె. సుబ్బారావుగారును దయతో తిరుపతిదేవస్థానములచేత ముద్రణా వ్యయములో సుమారు సగము ద్రవ్యము విరాళముగా ఇప్పించినారు. వారికెంతయు కృతజ్ఞుఁడను. వారికి నా కృతజ్ఞతాభినందనము లర్పించుచున్నాను.

ఈ ప్రెస్‌ను పెట్టుటకు ఉదారముగా స్థలమును గృహమును ఇచ్చిన శ్రీ కొల్లూరు కృష్ణమూర్తిగారికి వారి కుటుంబమునకు నా హృదయపూర్వకాభినందనములు.

ఇంక నాకు ముద్రణ విషయములోనే గాక అన్ని విషయములలోను రామునికి హనుమంతుడు, సుగ్రీవాదులవలె సహాయపడుచు కుడిభుజముల వలె నున్న శ్రీ కోపల్లె రామమూర్తిగారికి, చి॥ ముడుంబై శ్రీనివాసాచార్యులుకు, చి॥ రామానుజాచార్యులుకు నా ఆశీస్సులు.

ముద్రించుటలో శ్రద్ధ చూపి చక్కగా పనిచేసిన చి॥ ఎమ్. శ్రీరామ ప్రసాదునకు, చి॥ మండా అప్పలనరసింహమూర్తికి నా ఆశీస్సులు.

ఇట్లు,
బుధవిధేయుడు,
చర్ల గణపతిశాస్త్రి.

# రా మా య ణ ము

## —: అనువాదముల రీతులు :—

బా ల కాం డ :-

తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. 1-1

తపమున స్వాధ్యాయంబున
నిపుణుని వాగ్విద్వరేణ్యు నిఖిల మునిజనా
ధిపు నారదు సంప్రశ్నము
తపస్వి వాల్మీకి యిటు తమి గావించెన్.

శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు

తపస్స్వాధ్యాయ కమనీయ శీలు
మునినాథు నారదముని లోకవంద్యు
ననఘు తపోనిధియైన వాల్మీకి
గనుగొని యొకనాఁడు కర మర్థినడిగె.

రంగనాథరామాయణము

మునివరుఁడు తపస్స్వాధ్యా
యనిరతుఁడై పండితాళి యందు త్తముడై
తనరెడు నారదు ప్రశ్నిం
చెను వాల్మీకియను తపస్వి చిత్తంబలరన్.

శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు

తపమున స్వాధ్యాయంబున
సువరము వాగ్విద్వరేణ్యు శుద్ధాత్ము మునీ
శవదాఢ్యు నారదుం గని
తపస్వి వాల్మీకి పలికెఁ దద్దయు భక్తిన్.

రామకథామృతము, తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు, బాల. 1

శ్రీయుత తపోవిశిష్టు స్వాధ్యాయ నిరతు
వాగ్విదగ్రణి నిత్యతపస్వి వరుని
నారదమునీంద్రు నతుల విజ్ఞానరాశి
నడిగె వాల్మీకి మునిపుంగవుఁడు ప్రియముగ,

శ్రీ బులుసు వెంకటేశ్వరులు బాల. 1

తపమున స్వాధ్యాయంబున
నెపుడు మునిఁగి వాక్కుతత్త్వ మెఱిఁగిన చతురున్
తపసి విశారదు నారదు
నపు డా వాల్మీకిమౌని యడిగెను నిటులన్.

చర్ల గణపతిశాస్త్రి. 1-1

మా నిషాద ప్రతిష్ఠాంత్వ మగమః శాశ్వతీః సమాః
య త్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితం.

బాల 1-15

ఓరి మహోగ్రపాతకుడ యోరి నిషాదుఁడ క్రౌంచయుగ్మ మిం
పారఁగఁ గాముకేళి మెయినాడగ నందొకపక్షి నీల్గ ని
ష్కారణ మేల చంపితటు గావున నీవును వేగ జావు ని
రోరి దురాత్మ యంచుఁ గడు నుగ్రత నమ్ముని పల్కెఁ బల్కనన్.

భాస్కర రామా. బాల. 10

తెలియుమా నిషాదుండ ! ప్రతిష్ఠ నీక
ప్రాప్తమయ్యెడు శాశ్వత హాయనములఁ
గ్రౌంచ మిథునంబునందు నొక్కండు నీవు
కామమోహితముం జంపు కారణమున.

వావిలికొలను బాల. 161

వినుమా నిషాద ! క్రౌంచమి
థునమున నీవేటి కొకఁడు దునిమితొ కామం
బున మోహము నొందుచు గడు
చవరఁగ నిలగనుమ శాశ్వతమగు ప్రతిష్ఠన్.

జనమంచి బాల.

ఓ నిషాదుండ ! యీ యిల నుండఁబోకు
మింక శాశ్వతమగు సమలేల నీకుఁ
గ్రౌంచ మిథునంబులోన నొక్కండు కామ
మోహితముఁ బొరిగొంటివి మోసమునను.

రామకథా. తాడేపల్లి. బాల. 96

మా నిషాదాప్రతిష్ఠ నీకౌనుగాక
ఇలను శాశ్వతభంగిఁ దుల్యులను గొనక
క్రౌంచ మిథునంబునందు నొక్కటిని మోహ
వశను ద్రుంచితి వేకైక బాణనిహతి.

బులుసు బాల. 9

తెనుఁగు అనుష్టువ్పు -

క్రౌంచ మిథునంబు నుండి, కామి నొక్కని జంపుటన్
మహాప్రతిష్ఠఁ బొందుమా, నిషాద ! శాశ్వతంబుగన్.

చర్ల గణపతిశాస్త్రి, 8

తముఁవాచతతో బ్రహ్మ ప్రహసన్ మునిపుంగవం,
శ్లోక ఏవ త్వయాబద్ధో నాత్ర కార్యా విచారణా. 1-30
మచ్ఛందా దేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ
రామస్య చరితం సర్వం కురు త్వమృషిసత్తమ.

బాల. 1-31

జానుగ నీ ముఖాబ్జమున శారద యున్నది నా యనుజ్ఞ వి
జ్ఞానముతోడ మున్ను సుసంయమి చెప్పిన వాక్య పద్ధతిన్
సూనృత భాషణాఢ్యముల శ్లోకనిబద్ధము గాథఁగవిత్వ సు
శ్రీ నొగి విస్తరించి తగఁ జెప్పుము రామకథా ప్రపంచమున్.

భాస్కర. బాల. 17

దరహాసాంకురమొప్పఁ బద్మభవుఁ డా ధన్యాత్ము నీక్షించి సా
దరుడై యేటికిఁ జింతసేయ మునినాథా ! శంకఁ బోవీడుమీ
యురయన్ బద్యమె చుమ్ము యద్ది యెటులౌరా ! వచ్చెనం చెంచకా
సరణిం దెల్పెద మన్ని దేశమున భాషా కాంత నీ వాక్కునన్
యురయన్ నిల్చి పల్కెను.

వావిలికొలను బాల. 174

అయోధ్యాపతి యైన యా యిక్ష్వాకువునకు కుక్షియును, కుక్షికి వికుక్షియును వికుక్షికి మహాతేజుఁ డైన బాణుఁడును బాణునికి అనరణ్యుడును అనరణ్యునికి పృథువును పృథువునకు త్రిశంకువును త్రిశంకునకు దుంధుమారుఁడును దుంధుమారునికి మహారథుఁ డైన యువనాశ్వుఁడును యువనాశ్వునికి మాంధాతయును మాంధాతకు సుగంధియును సుగంధికి ధ్రువసంధి, ప్రసేన జిత్తు-అను నిర్వురును ధ్రువసంధికి భరతుఁడును భరతునికి అసితుఁడును పుట్టిరి. అతనిని ప్రతిరాజులైన శత్రువులు హైహయులు తాళజంఘులు శశిబిందువులు మహాయుద్ధములో ఓడింపఁగా అతఁడు హిమాద్రికివచ్చి భృగు తటమున నుండెను. ఆయసితుఁ డల్పబలుఁడు అతఁడు మంత్రులతో నచట నె వసించెను. అతనికిద్దఱు గర్భవతులైన భార్య లుండి రని వినికిడి. అందులో ఒకతె గర్భము నశించిపోవుట కయి సవతికి గరము (విషము)తో గూడిన సగ రమును (భక్ష్యమును) పెట్టెను. పిదప భృగువంశ్యుఁడైన చ్యవనుఁడను ఋషి రమ్యమైన యాహిమాలయమునకు రాఁగా అందులో మహానుభాగురాలును తామరపువ్వులఁ బోలిన కన్నులుగల - కాళింది యనునామె ఆ భార్గవునికి నమస్కరించి తనకు పుత్త్రుఁడు కలుగ వలెనని కోరఁగా అతఁ డిట్లనెను. ఓమహాభాగురాలా! నీగర్భమున మహాబలుఁ డైన యొక సుపుత్త్రుఁడు ఉద్భ వించును. అతఁడు మహాతేజుఁడు, అతఁడు గరము (విషము)తోఁ గూడిన వాఁడు. అయిన దుఃఖింపకుము అనెను. అపుడామె అతనికి నమస్కరించినది. ఆమెయు భర్త లేనిది. ఆచ్యవనుని యనుగ్రహమువల్ల ఆమె ఒక కుమారుని కనెను. సవతి గర్భ విచ్ఛిత్తి కావలయునని గరమును (విషమును) పెట్టెను గాన ఆగరముతోఁ గూడిన వాఁడు గాన సగరుఁ డని పేరు పొందెను. ఆసగరు నికి అసమంజుఁడు వానికి అంశుమంతుఁడును వానికి దిలీపుఁడును వానికి భగీ రథుఁడును వానికి కాకుత్స్థుఁడును వానికి రఘువును వానికి పురుషాదుఁడు అను కల్మాషపాదుఁడును వానికి శంఖణుఁడును వానికి సుదర్శనుఁడును వానికి అగ్నివర్ణుఁడును వానికి శీఘ్రగుఁడును వానికి మరువును వానికి ప్రశు శ్రుకుడు వానికి అంబరీషుఁడును వానికి నహుషుడును వానికి యయాతియు వానికి నాభాగుఁడును వానికి అజుఁడును వానికి దశరథుఁడు వానికి అనుజు లైన ఈ రామలక్ష్మణులును పుట్టిరి. 312

అవలన్ బ్రహ్మ, మొగంబునన్ నగవు తొల్కాడంగ నమ్మౌనిపుం
గవుతో నిట్లనె "నోయి బ్రహ్మ ! యిది శ్లోకం, బిందు శంకిల గొం
దువు నా యిచ్ఛనె యీ సరస్వతి యిటుల్ నీలోఁ బ్రవర్తిల్లె మౌ
నివరా ! రాముచరిత్ర వ్రాయుము మిపుడే నీ విట్టి పద్యంబులన్.

చర్ల గణపతిశాస్త్రి. బాల. 18

ఉదార వృత్తార్థ పదై ర్మనోరమై స్తదాస్యరామస్య చకార కీర్తిమాన్
సమాక్షరై శ్లోకశతై ర్యశస్వినో యశస్కరం కావ్య ముదారధీ ర్మునిః.

1-42

సార మనోర హవాక్యో
దారము సమవర్ణ వృత్తతత గూఢార్థా
ధారము సదమల కీర్తి వి
హారము రామాయణంబు నఘహరణంబున్.

వావిలికొలను బాల. 184

అతి మనోరమోదార వృత్తార్థ సరస
మాక్షర శ్లోక శతముల నయ్యుదార
ధాముని యశస్వి రచియించె రాము చరిత
మాద్యము యశస్కరము కావ్యమగుచు వెలయు.

రామకథా. తాడేపల్లి. బాల. 119

మహితోదార కథార్థ సత్పద మహామాన్యంబులై సర్వలో
కహితంబౌనటు సర్వరంజకముగాఁ గావ్యంబుగా నెంచె ధీ
మహితుం డా మౌని తల్లజుండు రఘుస్వామి గాథన్ ముదా
వహ తుల్యాక్షర పద్యరాజము నింపన్ దివ్య కీర్తిద్యుతుల్.

బులుసు బాల. 36

శ్రేయ ముదారవృత్త మగు హృద్య పదార్థము తేర్పడన్ సమా
మ్నాయ సమాక్షరాలు గల మానిత పద్య శతాలతోడ రా
మాయణ కావ్యమున్ మలచె స్వచ్ఛ యశోయుత రాముగాథ లా
ప్యాయ యశస్వి వాల్మికి మహాకవి శిల్పి యుదార చిత్తుఁడై.

చర్ల గణపతిశాస్త్రి బాల. 26

తచ్ఛ్రుత్వా మునయ స్సర్వే బాష్పపర్యాకులేక్షణాః
సాధు సాధ్వితి తావూచుః పరం విస్మయ మాగతాః.
జలజల రాల బాష్పములు సర్వ మునీశులు దాని నెల్ల వీ
నుల కనువిందుగా విని మనోగతి నచ్చెరువంది హర్ష సం
కలితమతిం గుశీలవుల గాయనవర్యుల మౌనివేషులన్
సలలిత రూపయుక్తులఁ బ్రశంస యొనర్చిరి సాధు సూక్తులన్.

వావిలికొలను బాల. 219

ఆహా యెంత విచిత్రమంచుఁ గనులన్ హర్షాశ్రువా ర్చిందు సం
దోహంబుల్ చిలుకం గుమారకుల నస్తోక ప్రభావాఢ్యుల
న్నీహారాంశు సమాన వక్త్రుల రహి న్వీక్షించి కారుణ్య ము
త్సాహంబుం జెలగ న్నుతించి రతి చిత్తప్రౌఢి వాగ్వైఖరిన్.

గోపీనాథ బాల. 116

అది విని మౌను లెల్లరు రసాలసవృత్తిఁ దలిర్చు ప్రీతిమైన్
బొదలుచు బాష్పజాలములఁ బొంపిరివోవుశుభేక్షణంబులన్
పదలఁగరాని స్నేహమున వారి నెడంద గదించుకొంచు గ
ద్గదిక తగం బలే ! యనుచు గార్కొను విస్మయమోజ నెక్కొనన్.

రామకథా. తాడేపల్లి. బాల 13-[illegible]

ప్రణుతింపన్ విని దానిఁ, జిత్తము ద్రవింపన్ బాష్ప పర్యాకులే
క్షణులై మౌనులు బాగుబాగని మహాశ్చర్యంబు నానందమున్
గని,యోహో ! భళి ! గీత మాధురియు శ్లోక ప్రాభవం బెట్టిదో
యని శ్లాఘించిరి ధర్మవత్సలత నెయ్యం బొప్ప నా బాలురన్.

చర్ల గణపతిశాస్త్రి. బాల. 3[illegible]

తామగ్నిమద్భి ర్గుణవద్భిరాకృతాం, ద్విజోత్తమై ర్వేదషడంగ పారగైః
సహస్రదైః స్సత్యరతై ర్మహాత్మభి ర్మహర్షికల్పైః ఋషిభిశ్చ కేవలైః
5-2[illegible]

దురిత హరుల్ సుకర్మ నిరతుల్ విజితేంద్రియు లంచితవ్రతుల్
సరసులు సత్కళావిదులు శాస్త్ర మతజ్ఞులు సద్గుణాకరుల్
సురుచిర పుణ్యు లవ్యయులు సూనృత వాదులు చిత్రదీప వి
స్తరిత బృహత్తముల్ సుజనసత్తము లప్పురి భూసురోత్తముల్.

భాస్కర బాల. 3

రామునకును భరతునకును
నేమాత్రము భేద మే నెఱుఁగ నేనటు గానన్
భూమీశుడు పట్టంబును
రామునకుం గట్ట మనసు రంజిలకున్నే.

వావిలికొలను అయోధ్య 185

శ్రీరామ పట్టాభిషేకోత్సవంబు, చేరి నాకెఱిగించి చెవులకు విందు
చేసితి వేమందుఁ జెలువ నీ పొందు, వాసిగా ఫలియించె వక్రోక్తులును
భరతునికంటె నా భరతాగ్రజుండు, తిరమైన భక్తి విధేయుండు నాకు.

రంగనాథ అయోధ్య 82 పు

చెలియా పరమ ప్రియ మగు
నల జనక సుతాధినాథు నభిషేకము నొం
పలరం జెప్పితి దీనికిఁ
గల ప్రత్యుపకార మేమి గావింతు నికన్.

గోపీనాథ అయోధ్య 8-4

ఆ రాముఁడు భరతుఁడు నా
కారయ నొక్కరూప యటుగావున నా
భూరమణుఁ డతని రాజ్య
శ్రీరమణునిఁ జేయు టరయ ప్రియమగుగాదే.

గోపీనాథ అయోధ్య 185

భరతుఁడు రాముఁ డంచను విభాగము నాకుది లేదొకప్డు న
వ్వరమ గుణాఢ్యు మేలెఱుకపాటొనరించితి గాన నింక నొం
డరయను గోరు మిష్టకరమాధృతిమై నిడుదాన దీనిలో
పరియగు సంతసంబు తతి చానరొ ! కానఁగరాము చూడఁగన్.

రామకథా అయోధ్య 2-51

ప్రియమైన మాట చెప్పితి
రయమున నీ నగను గొమ్ము రావే యనిజన్
భయ కోప వివశ మంథర
యయోయయోయనుచు నేడ్వ నారంభించెన్.

విశ్వనాథ రామాయణకల్పవృక్షము అయోధ్య అభిషేక 18 పుట

ఇంతకంటెను ప్రియమైన దేది వాకు
సంత శుభవా ర్తఁ దెచ్చిన యట్టి నీకు

ఘనుఁడున్ స్నిగ్ధుఁడు లక్ష్మివర్ధనుఁ డమోఘప్రేముఁడా లక్ష్మణుం
డనఘుం డన్నయు లోకరాముఁడు హితవ్యాపారుఁ డా రామభ
ద్రునకున్ దక్షిణబాహువై ప్రియుఁడునై తోడై సదా భూరిశో
భనసంధాయనుఁడై రహిం దగె బహిఃప్రాణంబు చందంబునన్.

గోపీనాథ బాల. 432

సొంపార రామభద్రుఁడు
నింపుగ లక్ష్మణుని విడిచి యించుకయు న్ని
ద్రింపఁడు సరసాన్నము భుజి
యింపఁడు క్రీడఁ జరియింపఁడు నెపుడున్.

గోపీనాథ బాల, 433

రామునే ప్రీతిమైఁ జూచి రామచంద్రు
నకుఁ బ్రియంబులఁగూర్చి యన్నకుఁ దలంపఁ
దనువు వెడలి ప్రాణమో యను విధమున
వర్తనము చేయుచుండు విద్వాంసు లలర.

జనమంచి

అనుజుని లక్ష్మణున్ విడిచి యప్పురుషోత్తముఁడైన రాముడుం
గనఁడు సుషుప్తి రుచ్యముగఁ గ్రోలెడు నన్నము తల్లిదెచ్చి యుం
చిన భుజియింపనొల్లఁ డల చిన్ని సహోదరుఁ బ్రాణముల్
గనుగొనకొంటిమై నృపుల గాదిలి పెద్దకుమారుఁ డొప్పియున్.

జనమంచి బాల. 574

మఱపుటేనుగు కెక్కి మరలించు రాముండు
మీఱి గుఱ్ఱములపై స్వారిచేయు
వేదాలనిక ధనుర్వేదాన స్థిరుఁ డయ్యు
స్వపితృ శుశ్రూష నాసక్తుఁ డగును
బాల్యమాదిగ స్నేహవంతుఁడై మెలఁగును
లక్ష్మివర్ధనుఁడైన లక్ష్మణుండు
సర్వప్రియుఁడె యయ్యు సతతంబు సేవించు
అన్నయౌ రాము లోకాభిరాము

లక్ష్మనిధి లక్ష్మణుఁడు శరీరమున వేఱె
యయ్యు నన్న రాముని బహిఃప్రాణ మయ్యె
నిద్ర పురుషోత్తముఁడు గనం డితఁడు లేక
తినడు మృష్టాన్నమైన లక్ష్మణుని విడిచి.

చర్ల గణపతిశాస్త్రి బాల. 285

విశ్వామిత్రో యయావగ్రే తతో రామో ధనుర్ధరః
కాకపక్షధరో ధన్వీ తంచ సౌమిత్రి రన్వగాత్
కలాపినౌ ధనుష్పాణీ శోభమానౌ దిశోదశ
విశ్వామిత్రం మహాత్మానం త్రిశీర్షావివ పన్నగౌ.

12, 6, 7

ముందు విశ్వామిత్రముని యేగఁగఁ బిఱుంద
డాకేలఁ జాపంబు డాక మెఱయ
ముద్దు జుల్పంబులు మోదంబు నింపగ
ననుఁగు తమ్ముఁడు వెంటనంటి రాగ
రామభద్రుం డేగె గ్రాల భూషణములు
దశ దిశల్ వెలుగంగ.

వావిలికొలను బాల. 612

రాణింపన్ రఘువర్యు లిద్దఱుఁ దనుత్రాణుల్ గృపాణుల్ ధను
ష్పాణుల్ శౌర్య ధురీణు లద్భుతులు భాస్వద్బద్ధ గోధాంగుళీ
త్రాణుల్ తాపసరాజు వెంటఁ జని రండంబొప్ప లీలారతిన్
వాణీనాథుని వెంట వహ్నులు భాస్వల్లీలఁ బోవుఁ గతిన్.

గోపీనాథ బాల. 509

మునుకొని దివ్యశంఖములు మ్రోగుచునుండఁగ ముందు మౌని వె
ళ్ళెను పిదపన్ ధనుస్సును ధరించియు రాముఁడు వెళ్ళెఁ బిమ్మటన్
జునుపములన్ ధరించి యనుజుండును లక్ష్మణుఁ డేగె నిట్లు మౌ
నివమసరించి యేగిరి వనిన్ దిశిరస్సుల పాములో యనన్.

చర్ల గణపతిశాస్త్రి బాల. 29-1

ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వపాణినా.

బాల. 73-21

ఈ సీత నాదు కూతురు
నీ సహధర్మచరి దీనినిం గైకొనుమీ
కౌసల్యాసుత! నీకును
భాసుర శుభమగు గ్రహింపు పాణింబాణిన్.

వావిలికొలను బాల. 1287

నా తనూజాత సాధ్వియా సీత నీకు
ధర్మ సహచరియై సంతతంబు ఛాయ
గతి ననుగతయై యుండు నీ కన్య కరము
కరమునఁ బ్రతిగ్రహింపుము గలుగు శుభము.

గోపీనాథ రామాయణము బాల.

విను మీ సీత మదాత్మజ
వనితామణి నీకు ధర్మపత్ని యగును గై
కొనుమీ నీకున్ శుభములు
తనరున్, బాణిని గ్రహింపు తరుణి కరమ్మున్.

జనమంచి బాల.

ఈ యది సీత నా సుత సదీడిత త్వత్సహధర్మ చర్యకున్
బాయక నిల్చు సాధ్వి వరభాగ మహోన్నత ఛాయవోలె ని
న్నెయెడఁ గొల్చు భద్ర మిక నింతి కరంబు కరంబునన్ బ్రహ
ర్షాయిత వృత్తిఁ గైకొనుము సంపద సొంపెసలారుచుండగన్.

రామకథా. బాల. 10-3-64

ఈ సీత నాదు పుత్రిక
నీ సహధర్మచరి యౌచు నెగడుచు నుండున్
ఈ సీతను గైకొను మెం
తో శుభము, గ్రహింపు పాణితోడన్ బాణిన్.

చర్ల గణపతిశాస్త్రి బాల. 949

స నిత్యం ప్రశాంతాత్మా మృదుపూర్వంతు భాషతే
ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే
కథంచి దుపకారేణ కృతేనైకేన తుష్యతి
నస్మర త్యపకారాణాంశ తమ ప్యాత్మకత్తయా.

అయోధ్య. 1-9-10

మరియు శీలవృద్ధుండును జ్ఞానవృద్ధుండు దయావృద్ధుండును
మధుర భావణుండును జిత క్రోధుండు .... .... .... నగు రాముండు.

భాస్కర. అయోధ్య. 10

ఎవ్వరి నేనియుఁ దన్నున్
నొవ్వం బలికినను దాను నుడువఁడు కఱకుల్
నవ్వుచు మృదుపూర్వంబుగ
ద్రెవ్వనఁ బ్రతివచనమిచ్చుఁ దిరమగు శాంతిన్.

ఉపకార మేమి పనికే
నెపుడే నించుక యొనర్ప నెలమిఁగను సదా
యుపకార శతము సల్పిన
విపరీతమునెంచఁ డాత్మ విజ్ఞుం డగుటన్.

వాలి. అయోధ్య 11

ఒరులు పరుషంబు లాడిన
నురుమతిఁ బేశల సుధామయోక్తులఁ దగ ను
త్తర మిచ్చుఁగానీ కినుక
న్బరుషోత్తర మీఁడు శాంతిభావుం డగుటన్.

గోపీనాథ. అయోధ్య 10

తనుఁ బరుసములాడ నతం
డని యుపని నొకండయేని నగపడఁ డున్నన్
మనమున నిడఁ డవ్వాని
సన్నను నుడుఁడు ప్రత్యుత్తరముల మొగకొని మెలఁపన్.

రామకథా. తాడేపల్లి. అయోధ్య 1-73

తచ్ఛ్రుత్వా మునయ స్సర్వే బాష్పపర్యాకులేక్షణాః
సాధు సాధ్వితి తావూచుః పరం విస్మయ మాగతాః.
జలజల రాల బాష్పములు సర్వ మునీశులు దాని నెల్ల వీ
నుల కనువిందుగా విని మనోగతి నచ్చెరువంది హర్ష సం
కలితమతిం గుశీలవుల గాయనవర్యుల మౌనివేషులన్
సలలిత రూపయుక్తులఁ బ్రశంస యొనర్చిరి సాధు సూక్తులన్.
వావిలికొలను బాల. 219

ఆహా యెంత విచిత్రమంచుఁ గనులన్ హర్షాశ్రువా ర్చిందు సం
దోహంబుల్ చిలుకం గుమారకుల నస్తోక ప్రభావాఢ్యుల
న్స్నిహరాంశు సమాన వక్త్రుల రహి న్వీక్షించి కారుణ్య ము
త్సాహంబుం జెలగ న్నుతించి రతి చిత్తప్రౌఢి వాగ్వైఖరిన్.
గోపీనాధ బాల. 1(6

అది విని మౌను లెల్లరు రసాలసవృత్తిఁ దలిర్చు ప్రీతిమైన్
బొదలుచు బాష్పజాలములఁ బొంపిరివోవుశుభేక్షణంబులన్
పదలఁగరాని స్నేహమున వారి నెడంద గదించుకొంచు గ
ద్గదిక తగం బలే ! యనుచు గార్కొను విస్మయమోజ నెక్కొనన్.
రామకథా. తాడేపల్లి. బాల 12-8

ప్రణుతింపన్ విని దానిఁ, జిత్తము ద్రవింపన్ బాష్ప పర్యాకులే
క్షణులై మౌనులు బాగుబాగని మహాశ్చర్యంబు నానందమున్
గని యోహో ! భళి ! గీత మాధురియు శ్లోక ప్రాభవం బెట్టిదో
యని శ్లాఘించిరి ధర్మవత్సలత నెయ్యం బొప్ప నా బాలురన్.
చర్ల గణపతిశాస్త్రి. బాల. 39

తామగ్నిమద్భి ర్గుణవద్భిరాకృతాం, ద్విజోత్తమై ర్వేదషడంగ పారగైః
సహస్రదైః స్సత్యరతై ర్మహాత్మభి ర్మహర్షికల్పైః ఋషిభిశ్చ కేవలైః.
5-23

దురిత హరుల్ సుకర్మ నిరతుల్ విజితేంద్రియు లంచితవ్రతుల్
సరసులు సత్కళావిదులు శాస్త్ర మతజ్ఞులు సద్గుణాకరుల్
సురుచిర పుణ్యు లవ్యయులు సూనృత వాదులు చిత్ప్రదీప వి
స్ఫురిత బృహత్తముల్ సుజనసత్తము లప్పురి భూసురోత్తముల్.
భాస్కర బాల. 30

రామునకును భరతునకును
నేమాత్రము భేద మే నెఱుఁగ నేనటు గానన్
భూమీశుడు పట్టంబును
రామునకుం గట్ట మనసు రంజిలకున్నే.

వావిలికొలను అయోధ్య 185

శ్రీరామ పట్టాభిషేకోత్సవంబు, చేరి నాకెఱిగించి చెవులకు విందు
చేసితి వేమందుఁ జెలువ నీ పొందు, వాసిగా ఫలియించె వక్రోక్తులును
భరతునికంటె నా భరతాగ్రజుండు, తిరమైన భక్తి విధేయుండు నాకు.

రంగనాథ అయోధ్య 82 పు.

చెలియా పరమ ప్రియము మగు
నల జనక సుతాధినాథు నభిషేకము నొం
పలరం జెప్పితి దీనికిఁ
గల ప్రత్యుపకార మేమి గావింతు నికన్.

గోపీనాథ అయోధ్య 8-4

ఆ రాముఁడు భరతుఁడు నా
కారయ నొక్కరూప యటుగావున నా
భూరమణుఁ డతని రాజ్య
శ్రీరమణునిఁ జేయు టరయ ప్రియమగుగాదే.

గోపీనాథ అయోధ్య 185

భరతుఁడు రాముఁ డంచను విభాగము నామది లేదొకప్డు న
ప్పరమ గుణాఢ్యు మేలెఱుకపాటొనరించితి గాన నింక నొం
డరయను గోరు మిష్టకరమాధృతిమై నిడుదాన దీనిలో
సరియగు సంతసంబు తటి చానరొ! కానఁగరాదు చూడఁగన్.

రామకథా అయోధ్య 2-51

ప్రియమైన మాట చెప్పితి
రయమున నీ నగను గొమ్ము రావే యనినన్
భయ కోప వివశ మంధర
యయోయయోయనుచు నేడ్వ నారంభించెన్.

విశ్వనాథ రామాయణకల్పవృక్షము అయోధ్య అభిషేక 18 పుట

ఇంతకంటెను ప్రియమైన దేది వాకు
నంత శుభవార్తఁ దెచ్చిన యట్టి నీకు

నేమి యొసంగినంగాని యోసీ మిగులను
నల్పమే యగుం బరికింప నల్పతమము.

బులుసు వెంకటేశ్వరులు అయోధ్య. 20

ఇంతకుమించి నాకుం గడుదృప్తిని గూర్చెడిదేమి మంధరా!
ఎంతటి మంచిమాట వినిపించితి విప్పుడు నన్ను నీవలెన్
సంతసపెట్టువా రెవరు చక్కని వార్తను తెచ్చినందుకున్
ఎంతటి కాన్కయైన సరియే మఱి కోరు మికేమి యిత్తునో.

చర్ల గణపతిశాస్త్రి అయోధ్య 170

కింతా మన్యత వైదేహః పితామే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుష విగ్రహం.

అయోధ్య 30-3

మజ్జనకుండగు జనకుండు బలపరాక్రమ సత్యసుగుణంబులు గల
మహానుభావుండ వని నన్నిచ్చెం గాని నీవు పురుషాకృతిం
గైకొనిన యింతి వగుట యెఱుంగండు.

భాస్కర అయోధ్య 167

నాదు జనకుండు మిథిలాధినాథుం డిప్పు
డిది వినంగ వైదేహుడే యెంచు నిన్ను
రామ! జామాత పురుష విగ్రహముం గొన్న
స్త్రీ యటంచును దలంపడే చిత్తమునను,

వావిలికొలను అయోధ్య 534

రామ! మా తండ్రి జనకుండు రమణతోడ
రూపమాత్రంబు చేతం బురుషుండ వైన
నిన్ను స్త్రీనిగా నెఱుంగక నన్నొసంగె
నెఱిగి యుండిసం గని గని యేల యిచ్చు.

గోపీనాథ అయోధ్య 855

తలంపడా యేమి రామ! నా తండ్రి జనకుం
డా యశోనిధి మిథి లాధినాయకుండు
స్త్రీపురుష విగ్రహంబయి సిరికిం గూర్చె
ననుట జామాత తన కెటో యబ్బె ననుచు.

రామకథా అయోధ్య 3-431

అసదృశ విదేహుండౌ మిథిలాధిపుండు
నన్ను గొనిపోవ జంకిన నిన్నుఁ గూర్చి
యేమి తలపోయునో రామ ! యెఱుఁగవొక్కొ
పురుష విగ్రహుఁ డయ్యు స్త్రీమూర్తి యనఁడె.

బులుసు అయోధ్య 30-2

మగవేషము వేసిన
మగువంగఁ బిత తెలిసికొనక మగువను నన్నున్
మగటిమియె లేని నీ కిడి
యెగిరెను నల్లుండ వనుచు నేమనుకొనెనో.

చ. గ. శాస్త్రి అయోధ్య 30

రాజా భవతుతే పుత్రో భరతశ్శాస్తు మేదినీం
వయంతత్ర గమిష్యామో యత్ర రామో గమిష్యతి.

అయోధ్య 25-10

నీ కొడుకే ధరిత్రి గొననీ ప్రభుతం గననీ ధ్రువంబుగా
లోకుల మెల్ల రాముఁ డెటు లోలమతిం జరియించునందము
ర్చీకులమై చరించెద మిసీ నెఱిమాలిన నీదు వీటిలో
నేకరణిన్ వసింతురు సుధీంద్రులు సజ్జను లార్య సన్నుతుల్.

వావిలికొలను అయోధ్య 986

సరె నీ పుత్రుఁడు భరతుఁడు
నరపతి యగుఁగాక మేము నగర నివాసుల్
అరిగెదము రాముతోనే
భరతుఁడు నీ వేలుకొనుఁడు పాడగు పుడమిన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

నీ రాజ్యములో బ్రాహ్మణు
లేరును వాసంబుచేయు నెంచరు సుమ్మీ
ఈ రీతిగ నీవు దురా
చారపుఁ గర్మలనె యెపుడు సలిపెదుగానన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

నహి తద్భవితా రాష్ట్రం యత్ర రామో న భూపతిః
తద్వనం భవితా రాష్ట్రం యత్ర రామో నివత్స్యతి.

అయోధ్య 37-29

రాముఁడు పాలింపనిచోఁ
గామిని రాష్ట్రం బదెప్డుఁ గానేరదు శ్రీ
రాముఁడు నిలిచిన వనమే
శ్రీమానిత రాష్ట్ర మగును సిద్ధము సుమ్మీ.

వావిలికొలను అయోధ్య 1041

ఇక జనులెల్లఁ బోవఁదరులే తుదకుండిన శూన్యమౌ ధరన్
యొకతెపె రాజ్యమేలుచును నుండుము రాముఁడు రాజుగాని యీ
సకల ధరిత్రి కాసయగు సాధువు రాముఁడె యున్న కానయే
సకల జనాఢ్యమై తనరు చక్కనిరాజ్యమయౌను పాతకి.

చ. గ. శాస్త్రి అయోధ్య

రామం దశరథం విద్ధి మాంవిద్ధి జనకాత్మజాం
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత యథా సుఖం. అయోధ్య 40-9

మనమున రాముని దశరథ
జననాయకుఁగాఁ దలంపు జనక తనూజన్
ననుగాఁ దలఁపుము కానన
ము నయోధ్యఁగఁ దలఁపు మేగు ముదమునఁ దండ్రీ.

భాస్కర అయోధ్య 224

రాముఁడ యెఱుంగుమీ దశరథుఁడు నిందఁ
ఎను దలంపుమా జనకుని తనయఁ బుత్రి!
యటవి యయోధ్యయంచు నాత్మఁ జూడు
పోయి రమ్ము యథా సుఖముగను దండ్రి.

వావిలికొలను అయోధ్య 1094

రాముని దశరథ రాజుగాఁ జూడు
భూమిజ నన్నుఁగా బుద్ధిఁ జింతింపు
మడవి నయోధ్యగా నాత్మలోఁ దలపు
కడు భక్తి యుక్తి రాఘవు బోల్చి యుండు.

రంగనాథ అయోధ్య 99

తనయ శేఖర రాముని దశరథునిగ
గహ్వరీ పుత్రికను నన్నుఁగాఁగ దండ
కాటవి నయోధ్యగా హృదయమున నెరిగి
భూరి సుఖలీల నడవికిఁ బోయి రమ్ము.

గోపీనాథ అయోధ్య 854

అన్నా లక్ష్మణ ! కాననాంతరములం దక్రాంతముం దైవమ
ట్లన్నఁజేరి చతుర్దశాబ్దములు నిద్రాహారముల్ మాని తం
డ్రి న్నాఁగొల్వుము, జానకిని జననిగా గూడ భక్తి భావింపుమీ
కొన్నాళ్లున్ వనమే యయోధ్య యనుచుఁ గోర్కిన్ బ్రవర్తింపుమీ.

శ్రీకృష్ణరా. అయోధ్య 1-111

అన్న ! దశరథుఁగా రాము నెన్నఁగనుము
మలసి నన్నట్లె భావింపుమా జనకజ
నటవి నెప్డు నయోధ్యగా నరసికొనుచు
ననుచుము యథా సుఖస్థితి మనుము చనుము.

రామకథా అయోధ్య 4-195

దశరథునిగాఁగఁ జూడుమీ దాశరథి
జనకజాతను నన్నుఁగాఁ గనుము వత్స !
అడవిని నయోధ్యగాఁ గను నరయు మన్న !
పోయి రమ్ము సుఖముగాఁ బోయి రమ్ము.

బులుసు అయోధ్య 40-9

కను, రాముని దశరథుఁగా
కనుమీ మాతగను సీతఁ గర్తవ్యముతో
కనుమి యయోధ్యగ వనమును
కనుగొనుచు యథాసుఖముగఁ గడు వడి రమ్మా.
మాతగను=తల్లిగను
మా=లక్ష్మిగా, తగను తగునట్లు.

చ. గ. శాస్త్రి అయోధ్య

తిష్ఠేతి రాజా చుక్రోశ యాహియాహీతి రాఘవః
సుమంత్రస్య బభూవాత్మా చక్రయోరివ చాంతరా,

అయోధ్య 40-46

కూడంజాల రథంబు నిల్పుమని యాక్రోశించుచుంగూడ రాఁ
జూడం దండ్రి యవస్థఁజూచి మదిలో శోకం బదైర్యంబుతోఁ
గూడందోడనె తెంపు గూడుటయు వక్కుంభిన్న ధీశాగ్రణి
చూడారత్నము తేరు వేనడుపుమంచుం జెప్ప నయ్యాజ్ఞ కున్.

భాస్కర అయోధ్య 240

నిలు నిలు మటంచు నఱవంగ నృపతి పిఱుఁద
పద పద మటంచు రాముఁడు పలుకుచుండ
బండి కలుదోఁయి జిక్కినవాని భంగి
మిడికెను సుమంత్రు మనమంత మడుకు గదుర.

వావిలికొలను అయోధ్య 112

ఓ సుమంత్రుఁడ రథ మునుపవే యనుచు
నా సుమంత్రుఁడు వినునట్లు చీరుచును
వెనుకొని పురి దాటి వెసవెస నేగుదేర
మనుజేశుఁ జూచి సుమంత్రుతో ననియె
నిదె వచ్చుచున్నాఁ డిసకులేశ్వరుఁడు
పొదపొద పోనిమ్ము పోనిమ్ము రథము
అని యని రఘురాముఁ డందంద తఱుమ
మొనసి యాతఁడు రయంబునఁ దేరుఁ బఱపె.

రంగనాథ అయోధ్య 101 పుట

నిలు నిలు మని పలుకు దశరథుని వాక్యంబును రథంబు రయంబున దోలు మనియెడి రాముని వాక్యంబును విని సుమంత్రుఁడు యెద్దియుఁ జేయ నేరక చక్రమధ్యంబునఁ జిక్కియున్న చందంబున.

గోపీనాథ అయోధ్య 867

ఆగు త్రోలకుమని రాజు నఱచుచుండె
నడపు నడపని రాముండొ నుడువుచుండె
వారి నుడువుల మధ్య సుమంత్రు స్వాంత మపుడు
నడచు మునువెన్క చక్రాల నడుమఁ బడెను.

చ. గ. శాస్త్రి అయోధ్య

యావత్తు నిర్యత స్తస్య రజోరూప మదృశ్యత
నైవేక్ష్వాకువర స్తావత్ సంజహారాత్మ చక్షుషీ

యావద్రాజా ప్రియంపుత్రం పశ్యత్యత్యంత ధార్మికమ్
తావద్వ్యవర్ధతేవాస్య ధరణ్యాం పుత్ర దర్శనే.

అయోధ్య 42-1, 2

రామ రథోత్థితం బగు పరాగము దోఁచెడు నంతదాక నా
భూమివిభుండు పుత్రకుని బోయినవంకను ఱెప్ప వాల్పఁ డా
భూమి పరాగమున్ సుతుని పోవుట భూపతి చూచునట్లున
స్తోమముగాఁగ రేగెఁ బతి ప్రస్ఫుటక యుండెడిఁగాక యంచునో.

వావిలికొలను అయోధ్య 1140

అధవుడు దశరథుఁ డటు పోక నిలిచి
తన సూను రథమును దప్పక చూచి
యదియుఁ గానక ధూళి నటు చూచి చూచి
యదియుఁ గానక బయు లటు చూచి.

రంగనాథ అయోధ్య 101 పుట

రాము రథమేగినట్టి మార్గంబునందు
బయలు వెడలిన ధూళి కన్పడువఱకు
నవనిపతి చూచుచుండె నేకాగ్రదృష్టి
సకల లోకాభిరాము యశశ్ప్రధాము.

బులుసు. అయోధ్య 42-1

రాము రథంపు ధూళి కనులంబడి కన్పడు నంతదాక న
ట్లే మొగమెత్తి చూచు మరలింపఁడు, కన్నుల ధార్మికున్ సుతున్
వేమఱు చూచునందనుక వేగమె వెంటనె మేనుసాచు నెం
తో మెయి సాగిపోయె మది నుబ్బిన పుత్రుని బెంగతోడుతన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

అదె రఘువీరుఁ డున్నరథ మల్లదె పోయెడి రాము తేజ మా
మ్మదె యదె పోయె నయ్యరద మక్కడఁదోచెఁ దదీయ భూ రజం

బదియు నడంగెఁ బొమ్మకట హా గుణరత్నమ హాకుమార హా
సదమల కీర్తిహార ! నృపసత్తమ హా నన్నుఁగూడనీఁగదే.

భాస్కర అయోధ్య 244

అదిగో రాము రథంబు చక్రము లవే యానాను జెండాయు న
ల్లదె యాపై పుగనున్న ధూళి యదియే యా చెట్లపై పే రథం
బదిగో పోవుచునుండె నాకస మదే యాపైపె యంచున్ గడున్
మదిఁ దృప్తింబడి రాజు నద్దియు గనన్ రామిన్ నిరాశన్ గనెన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

రామప్రస్థాపికాయాశ్చ ప్రతిఘ్నాశ్చ తవోదరే
దశమాసా మయానీతా హాలోకే నిందితోహ్యహం
కంఠేఽవసజ్య పాశంవావిషం పీత్వాఽథవాశఠే
త్యజప్రాణాంశ్చ దుర్మేధేజలమగ్నిం ప్రవిశ్యవా.
త్వామద్య నిహనిష్యామినో చేద్రామస్య దుర్యశః
రాఘవస్యానుజో భ్రాతా భరతోమాతృహా ఇతి.

అయోధ్య. 73-౬-7.

అడవుల రామచంద్రుఁడు జటాజినముల్ ధరియించి యుండనేఁ
బుడమి భరించి భోగములు బొందగలానటె యిట్టి చొప్పులే
యెడఁగననింక నన్ను మొగమేమి తెఱుంగునఁ జూతుఁ బాపపుం
గడుపునఁబుట్టి యీ భువనగర్హకు పాత్రుఁడనైతి రాక్షసీ.

ఆ భరతుండొహో శత్రుఘ్న! మనమీపాపజాతిం జంపిన మాతృహంతలని పచంద్రుండు మనమొగంబును చూడండు. గావుననీ పుణ్యహీన తన దురి బునఁ బోవుఁగాక.

భాస్కర. అయోధ్య 358-360.

పెనుపేది తల్లిఁజంపిన నీచులనుచు
మనలఁజూడఁగ రోయుమది రామవిభుఁడు

అట్లుగాక వలదని యతని వారించి
యటుపోయి కౌసల్య నడుగుల కెఱఁగి.

రంగనాథ, అయోధ్య 114.పు

ఈయెడ నగ్నిని దూకుము
హోయని దండకను జొరుము యురిపోతను వే
పోయుము ప్రాణమువేఁటొక
ప్రాయశ్చిత్తంబులేదు పాపిని నీకున్.

వావిలికొలను. అయోధ్య 1860

దుష్టచారిణివైన కతంబున మహీరమణుండు లోకాంతర గతుండయ్యె రామభద్రుండు వనంబునకుఁ జనియె నేను వంశపాంశనివగు నీకుంబుట్టిన కతంబున లోకంబునందు ఉపక్రోశమలీమసుండనైతి.

గోపీనాథ. అయోధ్య 1522.

కృతి రాము వనికి గెంటియు
పతికంతము పిసికిచంపు త్వద్గర్భములో
మతిచెడఁగా పదినెలలున్
వెత గడపియు హాజగములనింద్యుఁడనైతిన్.
మెడలో నురిపోసికొనియొ
తడఁబడకయొ ఘోరవిషముఁ త్రాగియొ పాపీ
కడువడినీళ్ళనో యగ్నినో
విడువకపడి ప్రాణములను విడు దుర్మేధా.
అనఘుండగు రాముని
యనుజుఁడు భరతుండు మాతృ హంతకుఁడని రా
ముని కపయశ మగునేమో
యని కాక యిపుడునిను హతమార్చియె యుందున్.

చ. గ. శాస్త్రి, అయోధ్య 73

రామో విగ్రహవాన్ధర్మ స్సాధు స్సత్య పరాక్రమః
రాజా సర్వస్య లోకస్య దేనానాం మఘవానివ.

అరణ్య 37-13

లోకము రక్షించుటకై
కైకేయి వరంబు నెపముగా నా పుణ్య
శ్లోకుఁడు తండ్రికి నసృతము
రాకుండగ వచ్చినాఁ డరణ్యమ్మునకున్.

భాస్కర అరణ్య 16

రాముఁడు ధర్మమూర్తి, యపరాజిత సత్యపరాక్రముండు సు
త్రాముఁడు దేవతా తతికి. రాణ విభుండు సమస్తమౌ జగ
త్స్తోమము పాలికిన్ సుమతి సూర్యుని కాంతి హరించు నట్టి యో
ద్దామ సుశీల గుప్త వసుధా సుతనా హరియింప జూడగన్.

వావిలికొలను అరణ్య 583

ఒడలూనిన ధర్మమె రా
ముఁడు, సత్యపరాక్రముండు పూతచరితుఁ డా
తఁడు, సర్వలోకంబులకును
నొడయుఁడు దేవతలలోన నుదు శక్రుఁ డటుల్.

చ. గ. శాస్త్రి అరణ్య

వృక్షాద్వృక్షం ప్రధావంత్స గిరేశ్చాద్రిం నదా న్నదీం
బభూవ విలప న్రామ శ్శోకార్ణవ పరిప్లుతః
అపికాచి త్త్వయాదృష్టా సా కదంబప్రియా ప్రియా
కదంబ యదిజానీషే శంస సీతాం శుభాననాం.
అశోక శోకాపనుద ! శోకోపహత చేతసం
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియాసందర్శనేన మాం.

అరణ్య 60-11-17

నా కాంతఁ బాసి యెంతయు
శోకించుచు నున్నవాఁడ శుభతర కృపతో
శోకాపనుద ! యశోకమ
శోకము వారింపు నన్నశోకుం గాఁగన్.

భాస్కర అరణ్య

శోకాపహమ యశోకమ
శోకోపహితాత్మునన్ను శుభమగు త్వన్నా
మాకలితుని జేయఁగదే
యాకలికంటీ విధంబునని నాతోడన్.

వావిలికొలను అరణ్య 1027

ఘనుఁ డా రాముఁడు చెట్టుచెట్టు గలయంగాఁ జూచుచున్ శైలముల్
వనముల్ పల్వలముల్ నదీనదము లావాసంబు లీక్షించుచున్
వనితం గానక వెఱ్ఱిపట్టినగతిన్ వర్తించుచున్ శోకతా
మ్రమనితాంతేక్షణుఁడై వనిన్ వెమక నారంభించె నుద్వేగియై

గోపీనాథ అరణ్య 1051

చెట్టు చెట్టు పుట్ట పుట్ట గట్టుం గట్టు
వాగు వాగు తిరిగి వనరఁదొడఁగె
నెందు గానఁబడునొ యెదియేని దెలుపును
అనెడు నాస రాముఁ డమలచరిత.

రామకథా అరణ్య 3-4

కంటివె కదంబమ కదంబకాననా ప్రి
యాత్మ నా ప్రియ సీత శుభాంగి నిందు
బిల్వ బిల్వోపమ స్తనిని వేగఁ జూపు
చివురుఁబోఁడి వచింపు సిరి దలంచి.

రామకథా అరణ్య 3-4

శోకోపహత మనస్కు న
శోకమ యూరార్పవలదె శోభనమూర్తి
శ్రీకలన నెఱిఁగి తెలిసి త్వ
దేకార్థపదుంబొనర్చి యెలమిఁ దొలంకన్.

రామకథా అరణ్య 3-47

తనువుననుండి తరువునకుఁ
గిరినుండి గిరి నదినుండి గిరికిన్ నదికిన్
పరువిడు విలపించును గడుఁ
దిరుగు వెతల బురదజలధి దిగఁబడిపోవున్.

చ. గ. శాస్త్రి అరణ్య 60-11

కడిమిపూఁ బ్రియుఁ బ్రియున్ గడిమిరో ! కంటివే
సుముఖి సీత నెఱుంగుచో వచింపు
మిసిమి చివురుఁబోలి పసుపుఁ బుట్టముఁ దాల్చు
బిల్వస్తనిని గన్న బిల్వ! చెపుమ
అర్జునప్రియుఁ బ్రియు నర్జున ! భీరువౌ
సీత బ్రదికియున్నఁ జెపుమి త్వరగ
చివురుపూవుల నిండిన వనస్పతి కుకుభ
మా ! కకుభోరు నర్ధాంగి దెలుపు
భ్రమరములు ముసరుచుఁ బాడవఱలు తరువు
తిలకమా ! తిలకప్రియ తెరువు తెలుపు
శోకహత చిత్తుఁడను సైతి శోకహారి
యో యశోక ! యశోకుఁగాఁ జేయు నన్ను.

చ. గ. శాస్త్రి అయోధ్య 60

నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభి వందనాత్.

కిష్కింధ 6-22

అనవుడు లక్ష్మణుండును నిజాగ్రజు తోడుత నిట్లు పల్కె నో
యనఘ ! యెఱుంగఁజాల వనితాంగదముల్ గుఱితింపలేన యీ
గౌనబగు కుండలంబులను గోమలి కేను దినంబు పాద వం
దన మొనరించుచుంగనుట నాతివి యందియ లే నెఱుంగుదున్.

వావిలికొలను కిష్కింధ 187

అధిప ! యీ కమనీయ రత్నాంగదములు
నీ రుచిర కుండలంబులు నే నెఱుంగ
ననవరతము పాదాభివందనము వలనఁ
బదకటక నూపురము లెఱుంగుదు మహాత్మ.

గోపీనాథ కిష్కింధ 219

ఎఱుగం గేయూరము లే
నెఱుఁగం గుండలము లెప్డు డెఱగుచు నుంటన్
ఎఱుఁగుదు నూపుర యుగ్మము
మఱవను నిక్కముగ నివి మా వదినవియే.

శ్రీకృష్ణ రామాయణము కిష్కింధ 1-73

అవి తల్లి కాలి యందెలు
నవి గురుతే నాకు నిచ్చలాయమ చరణచ్ఛ
చ్ఛవిదీప్తములై వెలిఁగెడు
నవి రూపముచేతఁ గష్టమయ్యె గుఱుతిడన్.

విశ్వనాథ రామాయణ కల్పవృక్షము కిష్కింధ 1025

ఎఱుఁగనయ్య కేయూరములెఱుఁగఁగుండ
లమ్ములటు లాతిపొమ్మల యిమ్ములెరుఁగ
నమ్మనూపురముల మాత్రమరయుఁగాంతు
నిచ్చలుఁ బదాభినందన నిరతిఁజేసె.

రామకథా. కిష్కింధ 1-114

ఎఱుగను చెవి కుండలముల
నెఱుగను నే బాహుపురుల నెప్పుడును వదెనన్
చరణముల వ్రాలి మ్రొక్కుట
నెఱుగుదుఁ జరణములనున్న యీ యందెలనే.

ఛ. గ. శాస్త్రి, కిష్కింధ-6

## —: సీతను రక్షించు స్త్రీలవర్ణన :—

ఏకాక్షీ మేకకర్ణాంచ కర్ణప్రావరణాం తథా
అకర్ణాం శంకుకర్ణాంచ మస్తకోచ్ఛ్వాస నాసికాం
అతికాయో త్తమాంగీంచ తనుదీర్ఘ శిరోధరాం
ధ్వస్తకేశీంతథాఽ కేశీంకేశ కంబలధారిణీం.
లంబకర్ణ లలాటాంచ లంబోదర పయోధరాం
లంబోష్ఠీం చుబుకోష్ఠీం లంబాస్యాం లంబజానుకాం
హ్రస్వాం దీర్ఘాం తథాకుబ్జాం వికటాం వామనాంతథా
కరాళాం భుగ్నవక్త్రాంచ పింగాక్షీంవికృతాననాం.

సుందర 17-5-8

ధరణీసుతనుజూచి తన్నికటంబున
ఘోరదర్శన సురారిసతుల
నేకాక్షిని నకర్ణ నేక కర్ణనుశంకు
కర్ణను దనుసుదీర్ఘ కంధరలను
నెగయుముక్కున దాని దిగవ్రేలు చెవిదాని
ధ్వస్తకేసిని బోడితలలవారి
నతికాయమగు నుత్తమాంగంబుగల. దాని
గడ్డంబునంటు పల్కప్పుదాని.
లంబకర్ణ లలాటను లంబకుచను
కేశకంబళధారిణి గీశవరుడు

లంబజానుక లంబాస్య లంబజఠర
లంబరదనాంశుకలయుఁ గదంబములను.

వావిలికొలను. సుందర 480

ఒంటికంటిదొకతె ఒంటిచెవిదొకతె
తలఁగప్పు చెవులతోఁదనరు నొకతె
చెవులె లేనిదొకతె చెవుల మేకులదొకతె
ఎత్తైన ముక్కుది యెంతొతలది
పొడుగు సన్న మెడది విడిన వెండ్రుకలది
అసలె వెండ్రుకలేమి యొసఁగనదియు
కంబళ్ళ కురులది లంబోష్టి చుబుకోష్టి
లంబజానువులది లంబవక్త్రి.

బిట్టుకేలాడు పాలిండ్లుఁ పొట్టగలది
పొట్టిది, వికార, మరగుజ్జు పొడుగుగలది
గూనిది కరాళ ఘోర వంగున్న తలది
పచ్చకళ్ళది వికృతాస్య వరలెనచట.

చ. గ. శాస్త్రి సుందర 17-7

నిష్ప్రభాం శోకసంతప్తాం మలసంకుల మూర్థజాం
క్షీణపుణ్యాం చ్యుతాం భూమౌ తారాంనిపతితామివ
చంద్రరేఖాం పయోదాంతే శారదాభ్రై రివావృతాం
క్లిష్ట రూపా మసంస్పర్శా దయుక్తామివ వల్లకీం.
సీతాం భర్తృ వశేయుక్తా మయుక్తాం రాక్షసీవశే
అశోకవనికా మధ్యే శోకసాగరమాప్లుతాం
తాభిః పరివృతాం తత్రసగ్రహా మివ రోహిణీం
దదర్శ హనుమాన్ దేవీం లతా మకుసుమామివ.

సుందర 19-2

వెం్రుకల్ జడగట్టి వేడి నిట్టూర్పుతో
విన్ననై వదనంబు వెల్లబాఱ

....    ....    ....    ....

భయముబొంది యలంతమైఁ బఱఁగుదాని
అతి నిందాన్విత కీర్తికై వడి విహీనార్థోక్తి చందంబునన్
తత ధూమాకృత వహ్ని సంగతిని నబ్ధచ్ఛన్న చంద్రప్రభా
కృతి    ....    ....    ....    ....    ....

మలినాంగిన్ సతతోపవాస కృత రామ ప్రేమ చింతా సమా
కలితన్ శోక సమేత సీతఁ గనియెం గార్యంబు ధుర్యంబుగన్.

భాస్కర సుందర 141-145

ఆ చెట్టు క్రిందనీడ నమలిన చారిత్ర
వనటచేఁ దపియించి వగుచు దాని
బెనగొన్న మాపుడు మను వెంద్రుకలదాని
నేలమీఁదు నడవడి నెగడుదాని

....    ....    ....    ....

శారద వేళను నీరదావృత మైన
పూవ చందురురేకఁ బోలుదాని
క్రూరగ్రహావృత రోహిణి చాడ్పున
నసురాంగ నావృత యైన దాని
పూవులు లేనట్టి తీవఁ బోలినదాని    ....    ....    ....
శీల మహిమఁ గాపుచేసికొం చడలెడు దాని

సీతఁగనియె వానరుండు.

వావిలికొలను. సుందర 487

గొనగొని రాముఁ బేర్కొని ప్రలాపింపఁ
గనుగొని మతి సీతఁగ నిశ్చయించి
విన్నగు మోము నా కృశాంగంబు
నా విరిసిన వేణియా యున్న యునికి
యాదురవస్థయు నా విలాపంబ

రంగనాథ. సుందర 286 పుట

చతురత దక్కి భీషణ కుజగ్రహ పీడితయైన రోహిణీ
పతిక్రియఁ బొల్పుదక్కి యనిశం బెదఁ గుందుచు నేకవస్త్రయై
హితులను బంధువర్గముల నెప్పుడు గానక ఘోర రాక్షసా
ప్రతతులఁ జూచుచుం గలకఁబాఱుచుఁ బాల విచారమొందుచున్

గోపీనాథ. సుందర 382

ప్రియ జనముఁ బాసి రక్కసిపిండు వొదువ
వృకతతి క్రాంతయగు మృగివిధము తోప
నల్ల బిత్తరిచూపుల నెల్ల దెసలఁ
గాంచు నమ్మహాసాధ్వి గాంచె నతఁడు,

రామకథా. తాడేపల్లి. 1-174

అట నా వృక్షముక్రింద జాలిగ ననింద్యాకారయై హర్షమే
మఱు మాయంబయి పోవఁ బొల్పఱి, కురుల్ మాలిన్యముం జెంద ముం
దఱి పుణ్యంబు క్షయింప జాఱిపడు నా తారన్‌బలెన్ దీనయౌ
చటులాక్షిన్ జనకాత్మజన్ హనుమ శ్రీ సంపన్నుఁ డంతన్ గనెన్.

చర్ల గణపతిశాస్త్రి, సుందర

పావన శీలయై పతి దర్శనమె లేమి
నగలు వీడి పతి గుణాలె దాల్చి
యూథమున్ విడి సింగ మొడిఁబడ్డ కరిణి య
ట్లాప్తుల విడి, యొంచు నసుర వశము

శరదంబు దాకృతి శశికళ వోలెఁ దీగ
లేని వీణియ వోలె క్లేశ మొంది
పతి యంకమున హాయి వఱలిన దయినను
రాక్షసీ కారలో గ్రుమ్మచుండి.

చింత గ్రహమధ్య రోహిణివంటి దగుచు
ఆ యశోక వనాన శోకాబ్ధి మున్గి
విరులు లేక శూన్యమగు తీవియను బోలి
హడలి దీనయౌ జానకిన్ హనుమ గనియె.

చర్ల గణపతిశాస్త్రి, సుందర

కిం మా మసదృశం వాక్య మీదృశం శ్రోత్ర దారుణం
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతా మివ
న తథాస్మి మహాబాహో ! యథాత్వ మవ గచ్ఛసి
ప్రత్యయం గచ్ఛమే యేన చారిత్రేణైవమే శపే
పృథక్ స్త్రీణాం ప్రచారేణ జాతింతాం పరిశంకసే
పరిత్యజేమాం శంకాంతు యదితేఽహం పరీక్షితా.

యుద్ధ 122-6, 7, 8

లక్ష్మణ ! చూచితే యనఘు లక్షణ లక్షితమైన నన్ను దు
ర్లక్ష్య చరిత్రఁబోలె వికలస్థితగా భవ దగ్రజుండు దా
సూక్ష్మనిశాతమైన మతిఁజూడక ఘోరవచో మహాగదు
ల్పక్ష్మలితేక్ష ణాస్త్రములఁ బాల్పడఁజేయుచు నున్నవాఁడొగిన్.

భాస్కర యుద్ధ 2368

క్షుద్రుఁడు క్షుద్ర నాడుగతి శ్రోత్ర విదారణ రూక్ష వాక్యముల్
భద్రచరిత్ర ! పల్కఁదగవా ననుబోటిని, నీ వదేమిగా
భద్రము సంశయించితివి శీలమునం దటువంటిదానిగా
హృద్రస నెంచఁబోకు సుచరిత్రముపై శపథంబు చేసెదన్.

వావిలికొలను. యుద్ధ 2678

స్త్రీలను నీతిహీనలను చెన్నటి ఱాఁగల నాత్మనెంచి యో
షాళుల జాతి యంతయును నట్టిదిగాఁ దలపోయనేల మ
చ్ఛీలపరీక్ష నీమమును చేసియు యుండిన నిట్టి శంకలన్.

వావిలికొలను. 2679

అనరానట్టిది శ్రోత్రదారుణము నత్యంతోగ్రమున్ సన్నునే
మని యీనీచపు వాక్కు నీచపు జనుం డట్టుల్ వినంబల్కె దె
ట్లని సన్నెంచుచునుంటివో యతులు వీరా ! నేనుగా నింక నీ
వు నిదే నమ్ముమి యొట్టుపెట్టుకొనెదన్పో నాడు శీలంబులో.

ఎవరో దుష్టపుస్త్రీలఁబట్టి యిపు డీట్లే నీవు స్త్రీజాతినే
భువి శంకించెద విట్టి శంక విడు మిప్డున్ నన్ బరీక్షింపుమీ.

చ. గ. శాస్త్రి, యుద్ధ.

చితాం నోకురు సౌమిత్రే వ్యసనస్యాస్య భేషజం
మిథోపఘాతా నాహం జీవితు ముత్సహే

యుద్ధ 119-18

మీరింక నమ్మకున్నను
గారవమేపార ననుఁగరుణించి మహో
దారంబగు సొదఁబెట్టుఁడు
ధీరమతిం జొత్తువందుఁ దిధమగుకడకన్.

భాస్కర యుద్ధ 2168

అని దగ్గుత్తికతోడఁ బల్కుచును దుఃఖాక్రాంతయై దీనుడై
ఘన చింతాబ్ధి మునింగియున్న మఱిఁదిం గంజాక్షి వీక్షించి యా
పెను శోకంబున కౌషధంబగు చితంబేర్పంగదే లక్ష్మణా!
యనఘా! యిట్టి మహాభిశాపహతనై ప్రాణంబు నిల్పంజుమీ.

వావిలికొలను. యుద్ధ, 2188

ఓయి సుమిత్రకుమార ! యురుతరవ్య సనంబునకు
భేషజం బిదె నాకుఁ జూడ
మదిఁ దోఁచినది గాన మానక చితఁ గూర్పు
మెల్ల మిథ్యావవాద సహిత
గాఁగ జీవించుట కథలు గానంబులు
నట్లుండ నప్రీత సైతి.

రామకథా. యుద్ధ 1-271

ఇపుడె చితిపేర్చు సౌమిత్రి! యిట్టివ్యథను
అంతమొందించు నౌషధమగును నిదియె
మిథ్యగాఁగొట్టు దెబ్బల మిగుల గ్రుక్కి
యింకజీవింపఁగా నుత్సహింపలేను.

చ. గ. శాస్త్రి యుద్ధ 119

ఆత్మానం మానుషం మన్యే, రామం దశరథాత్మజం
యోహం యస్యయతశ్చాహం భగవాం స్త ద్బ్రవీతుమే. 120-11

మీరునన్ను పెక్కుభంగుల,
నారాయణుఁడనగ వలదు నరుఁడనుఁదగు నే
నారయ దశరథరాముఁడ,
నీరేరుహలోచనుండ నే తలపోయన్.

భాస్కర. యుద్ధ 240[1]

మనుజుఁడనని దశరథనృప,
తనయుఁడనని రాముఁడనని తలఁతును నన్నున్
వినిపింపుఁ డెవ్వఁడను నె
వ్వని వాడనొయేలనేను ప్రభవించితినో.

వావిలికొలను. యుద్ధ 2705

అవ్వసుధేశశేఖరున కాజికిఁ బుత్రుఁడ రామనాముఁడన్
ముప్పురకంటెఁ బెద్దను మనుష్యుఁడనంచుఁ దలంచుచుందు నే

నెవ్వఁడ నాకుఁ బూర్వతను వెయ్యది విష్ణుఁడ వంటిరిప్పుడే
నిప్పసుధన్ జనించుటకుఁ గారణమెయ్యది దెల్పుఁ డింతయున్.

గోపీనాథ, యుద్ధ 2980

నేను మానవమాత్రుఁడనే యుటంచు
దశరథాత్మజుఁడంచు నేదలంతుగాని
మీరు పలికిన భావము దీరెఱుంగ
ననుడుఁ బరమేష్ఠి రామునకనియె నిట్లు.

శ్రీకృష్ణ యుద్ధ 4-111

నన్ను మానవునిగ నాబుద్ధి నూహించు
దశరథాత్మజ ప్రథాప్రసక్తి
నెవడనెవని వాఁడనేల లోచిత భాగ
వంతుఁడజుఁడ తెలిసి పలుకుగాక.

రామకథా తాడేపల్లి యుద్ధ 1-219

నను మానవునిగ దశరథ
తనయుండగు రామునిగను తలఁతును మదిలో
కని నేనెవఁడ-నెవని వా
డనొ యెటువచ్చితినొ పూజ్యుఁడవు వాకొనుమీ.

చ. గ. శాస్త్రి యుద్ధ 120

మచ్చునకు కొన్ని పద్యములు మాత్రము చూపబడినవి.

# గాయత్రీ బీజాక్షర యుత

## రామాయణ సుధ

"ఓం తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్".
అన్నది గాయత్రీ మంత్రము.

ఓం
తప స్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరం
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవం.

బాల 1-1

ఓం
తపమున స్వాధ్యాయంబున
నెపుడు మునింగి వాక్కు తత్త్వ మెఱిగిన చతురున్
తపసి విశారదు నారదు
నపుడా వాల్మీకిమౌని యడిగెను నిటులన్.

సహత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేంద్రో విజయీపురా.

బాల 30-25

త్సరు సహిత ఖడ్గము శరాలు తనరు రాము
డపుడె యజ్ఞము పాడుచేయంగ వచ్చి
నట్టి రాక్షసుల వధింప నమరవిభుని
యటు- జయించు రాముని మెచ్చిరంత ఋషులు,

త్సరు=కత్తి పిడి.

విశ్వామిత్ర స్సధర్మాత్మా శ్రుత్వా జనక భాషితం
వత్స రామ ధనుఃపశ్య ఇతి రాఘవ మబ్రవీత్.

బాల 67-12

విజ్ఞుఁడు జనకుఁ డిటు లన వినియు ధర్మ
మూ ర్తి యయిన విశ్వామిత్ర మునివరుండు
నాయనా ! వత్స ! యో రామ ! యీ యపూర్వ
ధనువుఁ జూడు మటంచును వనియెఁ బ్రీతి.

తుష్టావాస్య తదావంశం ప్రవిశ్యస విశాంపతేః
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత.

అయోధ్య 15-20

తురగములు లాగ రథముపై నరపతి గృహ
(తుర్) మటు ప్రవేశించియు సుమంత్రుఁ డధిప కులము
మొదటినుండి స్తుతించి యా భూపు శయ్య
దరికి దరయుగ వేగసరిగి పొగడె.

వనవాసంహి సంఖ్యాయ వాసాం స్యాభరణానిచ
భర్తార మను గచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ.

అయోధ్య 40-17

వనవాస వత్సరంబులు
గణియించియె క్షౌమము లను ఘన భూషణముల్
తన భర్త ననుసరించెడి
జనకజకు నరపతి మామ సరగున నిచ్చెన్.

రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులం
రాజా మాతా పితాచైవ రాజా హితకరో నృణాం.

అయోధ్య 17-31

రేడే (=రాజే) సత్యము ధర్మము
రేడే (=రాజే) కులవంతులకును ఋతయుత (ప్రథితము) కులముల్
రేడే (=రాజే) తల్లియు తండ్రియు
రేడే (=రాజే) హితకరుడు సర్వపృథివిన్ ప్రజకున్. (ప్రజకున్ లోకున్)

నిరీక్ష్య సముహూర్తంతు దదర్శ భరతో గురుం
ఉటజే రామమాసీనం జటావల్కల ధారిణం.

అయోధ్య

నక్తి దర్భచాపవయిని నేలపయినె
సీత లక్ష్మణుండు చేరి యుండ
నా మహామహితుని రాము నగణ్య పు
ణ్యాగరి మూర్తుని భరతుఁ డరసె.

ఏవి బుద్ధిః కృతా ద్రష్టు మగ స్త్యం తం మహామునిం
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః

అరణ్య 11-44

మంజులం బొప్పగు వృక్ష రమ్య వనసీమన్ సీత హర్షించి క్రీ
(మ్మే)డల దేలంగల, దీవులక్ష్మణుఁడు గూడన్ హర్షముం గాంత్రు, పు
ష్కల వృక్షంబుల నాకసం బలరు నా కాలమందే కనన్
దలఁతేన్ వెళ్లుమి యూ యగస్త్యముని పూత స్వచ్ఛ రమ్యోర్వికిన్.

అరణ్య 11

భరత స్యార్య పుత్రస్య శ్వశ్రూణాంచ మమ ప్రభో
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి.

అరణ్య 42-17

భరతునికిని మీకు సంపమై మా యత్త
(భర్)        లకు నాకు నిది కేళులకు నెసంగు

జీవింపకయు అది చేఁజిక్కనా దాని
చర్మంబె రుచిరమై సౌరు మీరు.

గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలం
వయస్యం తం కురుక్షిప్రం, మితోగత్వాద్య రాఘవ.

అరణ్య

గోచరగతి కాలము దాటఁ గూడు నెటులు
సలుపు సుగ్రీవుతో మైత్రి జ్వలను నెదుట
వానితో నగ్నిసాక్షికమైన మైత్రి
సలుప ద్రోహంబు చేయుట వలనువడదు.

దేశ కాలౌ భజస్వాద్య క్షమమాణః ప్రియా ప్రియే
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవ వశగో భవ.

కిష్కింధ 22-20

దేశకాలాలు పొందఁ దత్ప్రియము నప్రి
యమును సైచుచు సుఖము దుఃఖమును గూడ
సైచి సుగ్రీవునియెడ నాశ్రయము పొంది
దేశ కాలానుసారము వాసి గనుము.

వంద్యాస్తేతు తపస్సిద్ధా స్తపసావీత కల్మషాః
ప్రష్టవ్యాచాపి సీతాయాః ప్రవృత్తి ర్వినయాన్వితైః.

కిష్కింధ

వంద్యులు సుమి వారలు. వారు వ్రతము తపము
చేసె పాపముల్ క్షాళన చేసికొన్న
వారు, వారిని జానకి వార్తలెల్ల
వినయ మొప్పారఁగాఁ దెల్పికొనుము వేగ.

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీం
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమః,

సుందర 4-1

సతమా రీతిగఁ గామరూప యయి రక్షాదక్షయౌ లంకిణిన్
అతి తేజుండయి వాయుజుండు భువి వీర్యంబొప్ప నోడించి స
న్మతితో ద్వారముగుండఁ గాక విలస త్ప్రాకారమ్మును దాటి శ
స్యతముండై రిపు నెత్తిపై నెడమ కాల్ చల్లంగ నుంచెన్ వడిన్.

ధన్యా దేవా సగంధర్వాః సిద్ధాః పరమర్షయః
మమ పశ్యంతియే నాథం రామం రాజీవలోచనం.

సుం ద, 26-41

ధీయుతుఁ బ్రియుగను దివ్యసిద్ధ ఋషిగం
ధర్వులు దేవతల్ ధన్యతములు
పోని పద్మాక్షుఁడు పుణ్యాత్ముఁడు పరాత్ముఁ
డగు రామునికిన్ నాదు ప్రాప్తియేల.

మంగళాభిముఖీ తస్య, సాతదాసీన్మహాకపేః
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనం.

సుందర, 53-27

మంగళమగు మారుతికిని గూర్పంగఁ గోరి
నిరుపమమగు పూని సీత యగ్నిని భజించె
అగ్నిదేవ! హనుమకు శైత్యంబుగూర్పు
మనుచు సీత ప్రార్థనచేయ నగ్ని వినియె.

హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీత కాలాయతి సంప్రతిక్షమం
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసంగ వాను త్తర మేతదబ్రవీత్.

హిత నిర్ధారణచేసి యు క్తముగ గావింపంగ నౌనంచుఁ బల్
స్తుతమౌ రీతిగ యుక్తి యు క్తముగ నెంతో గొప్ప యర్థంబు నీ
మతికెంతో తగియున్నదిప్పటికి నొంపై ముందునా నీ మఱి
ట్టితఱింగాని క్షమంబయైన గతినిట్లీ మంత్రులందట్టులన్.

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః
లంకైశ్వర్యం ధ్రువంశ్రీమా, నయంప్రాప్తో హ్యకంటకం
యుద్ధ, 41-67

ఏను ధర్మాత్ముఁడు గుణకం
ఘనుతుండు విభీషణుఁడు గనెను నాశరణున్
కని శ్రీమంతుఁడు ముళ్ళుం
డని లంకైశ్వర్యము ధ్రువమందెను జుమ్మీ.

యోవజ్రపాతా శనిపాతాన్న చుక్షుభే నచాపిచచాలరాజా
సరామ బాణాభిహతో భృశార్త శ్చచాలచాపంచమమో చవీరః
యుద్ధ, 59-139

యోధముఖ్యుఁ డేరావణు డుగ్రవజ్ర
పాతమున, నశనిహతిని స్వల్పమైన
క్షోభపడడొ చలింపడొ యాబలుండు
రామశర విద్ధుఁడగుచు విల్వదలె వణఁకె.

యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనంగతాః
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయం.
యుద్ధ, 72-10

యోద్ధయగు రాముఁడెంత మహాబలుండొ
అతని యస్త్రాలు నెంత మహత్తుగలవొ
ఎవని విక్రమమున దైత్యు లెల్లఁజచ్చి
రాయభయు రాముఁదలఁతు నారాయణునిగ.

సతే దదృశిరే రామం దహంత మరి వాహినీం
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా.

యుద్ధ 94-26

సమ్మోహనాస్త్రాన సమ్మూఢులైరి రిపుమ
సఃఖరు శూరుని రాముని స్గనరు పోర
వేల రాముల నరసి మరల నొక్క
రామునె గొంతురు రాక్షసాళి.

ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ
బద్ధాంజలిపుటాచేద మువాచాగ్ని సమీపతః.

యుద్ధ 119-23

ప్రథిత దేవ విప్రుల సీత ప్రణుతి చేసి
అగ్ని దరిఁ గేలు జోడించి యనియె నిటులు
నా మనసు రాముని విడి పరుం దళఁపదేని
లోకసాక్షియౌ నగ్ని నన్ బ్రోచుఁగాక.

చలనా త్పర్వత స్సైవ గణా దేవస్య కంపితాః
చచాల పార్వతీచాపి తదాఽఽశ్లిష్టా మహేశ్వరం.

ఉత్తర

చోటుఁ గని రావణుండు నా క్షోణిధరము
నిటులు నటులును వేగఁ గంపింపఁజేయ
దేవగణముల్ వడంకిరి దేవదేవు
గౌఁగలించుకొని యుమయుఁ గూడ వడఁకె.

దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాద భోజనం
సర్వమేఽ వావిభక్తం నౌ భవిష్యతి హరీశ్వర.

ఉత్తర, 44-41

దయిత లాత్మజుల్ సర్వవ త్తనము రాష్ట్ర
మఖిల భోగ మాచ్ఛాదనాహారములును
ఓయి కపిరాజ ! నీకును నుర్వి నాకు
నెల్లను నవిభాజ్యములుగ నెసఁగుఁ గాక.

యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలా ముపావిశత్
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారక ద్వయం.

ఉ త్తర

ప్రీతిని శత్రుఘ్నుండు ద
యాతత హృదుఁ డేనిశతఁ నా పర్ణకుటీన్
(త్) ఏతెంచెనో యా రాత్రియె
సీత యిరువురు కొమరులను చెచ్చెఱఁ గనియెన్.
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీ బీజ సంయుతమ్
త్రిఃసంధ్యం యఃపఠేన్నిత్యం, సర్వ పాపైః ప్రముచ్యతే.

ఈ యది రామాయణ మిటు
గాయత్రీ బీజ వర్ణ కలితము, సతమున్
ఏయెడఁ ద్రిసంధ్యలను శ్ర
ద్ధాయుతుఁడై చదువఁ బాప తమము నశించున్.

## గోవిందరాజీయ వ్యాఖ్య ప్రకారము గాయత్రీ బీజాక్షరయుత రామాయణము

* ఈ గుర్తుగలవి బీజాక్షరములు.

1. సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్, అని గాయత్రీ మంత్రము.

*

1. సతేన పరమా స్త్రేణ మానవేన సమాహతః
సంపూర్ణం యోజనశతం క్షిప్తస్సాగర సంప్లవే.

బాల. 30-19

*
2. విశ్వామిత్రో మహాతేజా భూయ స్తేపే మహాతపః
తతః కాలేన మహతా మేనకా పరమాప్సరాః

బాల. 63-3

*
3. చతురశ్వో రథశ్శ్రీమాన్ నిస్త్రింశో ధనురు త్తమమ్.
వాహనం నరసంయు క్తం ఛత్రంచ శశిసన్నిభం

అయోధ్య. 14-36

*
4. వ ర్తతే చో త్తమాం వృ త్తిం లక్ష్మణోఽస్మిన్ సదానఘః
దయావాన్ సర్వభూతేషు లాభ స్తస్య మహాత్మనః

అయోధ్య. 44-5

*
5. ద్వారేణ వై జయంతేన ప్రావిశ చ్ఛ్రాంత వాహనః
ద్వా స్థైస్ని రుత్థాయ 'విజయం' పృష్టస్తైస్సహితోయయౌ.

అయోధ్య. 71-33

*
6. ఉటజే రామమాసీనం జటామండలధారిణం
తంతు కృష్ణాజినధరం చీలవల్కలవాససం.

అయోధ్య. 99-22

*
7. తేవయం వనమత్యుగ్రం ప్రవిష్టాః పితృశాసనాత్
ద్రష్టుమిచ్ఛామహే సర్వేభగవంతం నివేద్యతాం.

అరణ్య. 12-14

*
8. మమభర్తా మహాతేజా వయసా పంచవింశకః
అష్టాదశ హివర్షాణి మమజన్మనిగణ్యతే.

అరణ్య. 47-10

*
9. తతః పరమ సంహృష్టో హనుమాన్ ప్లవగర్షభః
ప్రత్యువాచ తతోవాక్యం రామం వాక్యవిశారదః

కిష్కింధ. 4-3

10. సకామినం దీన మదీనస త్త్వం శోకాభిసన్నం సముదీర్ణకోపం
నరేంద్ర సూనుర్న్నర దేవః పుత్రం రామానుజం పూర్వజమిత్యువాచ
కిష్కింధ. 4-3

11. తతో రావణ నీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః
ఇయేష పదమన్వేష్టుం చికీర్షన్ కర్మ వానరః
సుందర. 1-1

12. తత స్తస్య నగస్యాగ్రే హ్యకాశస్థస్య దంతినః
భర్త్రా పరిగృహీతస్య జానకీ స్కంధమాశ్రితా.
సుందర. 27-16

13. నావమాన్యో భవద్భిశ్చహరిః ధీర పరాక్రమః
దృష్టాహి హరయః పూర్వంమయా విపులవిక్రమాః
సుందర. 46-9

14. శ్రుత్వా హనుమతో వాక్యం యథావ దభిభాషితం
రామః ప్రీతి సమాయు క్తో వాక్యము త్తరమబ్రవీత్.
యుద్ధ. 1-1

15. యస్తు సత్యమసౌ పక్షంరామ స్యా శ్రిత తిష్ఠతి
రక్షోగణ పరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః
యుద్ధ. 28-27

16. తేజోవీర్యం బలం చౌజ ఉత్సాహశ్చ మహాగుణః
ప్రదర్శనంచ బుద్ధిశ్చ స్మృతిశ్చ ద్విగుణంతయోః
యుద్ధ. 50-40

17. కుంభకర్ణం హతందృష్ట్వా రాఘవేణ మహాత్మనా
రాక్షసా రాఘవేంద్రాయ రావణాయ న్యవేదయన్.
యుద్ధ. 68-1

18. విజ్ఞాయతు మన స్తస్య రాఘవస్య మహాత్మనః
సన్నివృత్యా హతా త్తస్మాత్సం వివేశపరంతతః
యుద్ధ. 81-1

*

19. స్మరణాంతాని వైరాణి వి_స్తృతంనః ప్రయోజనం
క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథాతవ.

యుద్ధ. 112-26

20. ఏవమే తత్పురావృత్తమాఖ్యానం భద్రమస్తునః
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్తతాం.

యుద్ధ. 31-124

*

21. తతః ప్రచోదయన్సూత స్తానశ్వాన్ రుధిరప్రభాన్
ప్రయయౌ భీమసన్నాదో యత్రరక్షః పతిః స్థితః

ఉత్తర. 41-1

22. విసృజ్య మహాబాహుః ఋక్షవానర రాక్షసాన్
భ్రాతృభిస్సహితో రామః ప్రముమోద సుఖం సుఖీ.

ఉత్తర. 41-1

23. సుఖాహికథయంతి త్వామాగతం శూద్రమాగతః
బ్రాహ్మణస్య తుధర్మేణ త్వయాజీ వాపితస్సుతః

ఉత్తర. 76-27

*

24. ఏవమేతత్ పురావృత్త మాఖ్యానం భద్రమస్తునః
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్తతాం.

ఉత్తర. 111-28

## —: రాముని వనవాసకాలము :—

(గోవింద రాజీయమునను సరించి)

1వ రోజున చైత్రశుద్ధ దశమినాడు వనవాస ప్రయాణము- రాత్రి తమసాతీర వాసము.

2వ రోజున జాహ్నవీ తీరవాసము-గుహునిరాక.

3వ రోజున గంగాదక్షిణ తీరతరువు క్రిందనుండుట.

4వ రోజున ప్రయాగలోనుండుట-భరద్వాజ దర్శనము.

5వ రోజున యమునాతీర వాసము-చిత్రకూటప్రవేశము.

6వ రోజున సుమంత్రుడు అయోధ్యకు వచ్చుట-రాత్రి దశరథమృత్యువు

7వ రోజున కౌసల్యాదుల విలాపము-భరతునికై దూతలఁ బంపుట.

8వ రోజునుండి 12వ రోజువరకు భరతుని అయోధ్యా ప్రయాణము.

వ రోజువరకు పౌరలౌకికకర్మ.

నాలుగు దినములు వనమార్గము బాగుచేయుట.

20వ రోజువరకు భరతుని వనప్రయాణము.

22వ రోజునుండి రామునిదగ్గఱ భరతుడు మూడురోజులుండుట.

27వ రోజున తిరిగి అయోధ్య పాదుకలతో వచ్చుట. ఇంకను మధ్యమధ్య రోజులు లెక్కింపగా మరల పాదుకలకు పట్టాభిషేకమువరకు 45 రోజులయ్యెను.

శ్రీరాముడు చిత్రకూటమున పదిన్నర మాసములుండెను. మొదటి సంవత్సరము ఇట్లు గడచెను. పిదప చిత్రకూటమును విడచి దండకారణ్యమును ప్రవేశించి ఋషుల ఆశ్రమములను చూచుచు గడపినవి పదిసంవత్సరములు. పిదప పంచవటిలో ఒకటిన్నర సంవత్సరములు గడపెను. ఈ విధముగ ఒకటి, పది, ఒకటిన్నర కలిసి పన్నెండున్నర సంవత్సరములు.

పన్నెండున్నర సంవత్సరములయ్యెను. తరువాత పదుమూడవ యేడు కొంచెము మిగిలియున్నదనఁగా మాఘశుక్ల అష్టమినాఁడు "విందము" అను

పేరుగల ముహూర్తమున రావణుండు సీతను దొంగిలించికొని పోయెను. 12 సంవత్సరముల 4 నెలలు.

జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాడు వాలి వధ జరిగెను.

కార్తికశుక్ల పాడ్యమి వరకు సుగ్రీవుని పట్టాభిషేకాది కార్యములు.

నాలుగు మాసములు వర్షాకాలము గాన సీతాన్వేషణ జరగలేదు.

కార్తికము చివర- సుగ్రీవునిపై లక్ష్మణు డాగ్రహించుట.

కార్తికము చివరనుండి మార్గశీర్షము చివరవరకు సీతాన్వేషణము.

హనుమంతుడు మార్గశిర శుక్ల ఏకాదశిని లంకాప్రవేశము.

ఆ యర్థరాత్రి తుదకు సీతాదర్శనము.

ద్వాదశినాడు శింశుపా వృక్షము నుండి రావణ దర్శనము. సీతా సంభాషణము.

త్రయోదశినాడు అక్షాది వధ.

చతుర్దశినాడు బ్రహ్మాస్త్రముచే కట్టుబడుట. లంకా దహనము.

మరల మహేంద్రాద్రి యందున్న వానరులతో గలయికకు 5 రోజులు.

మార్గశిర కృష్ణ షష్ఠినాడు మధువన భంజనము.

అష్టమినాడు ఉత్తరఫల్గుని విజయాఖ్య ముహూర్తమున రామాదుల సేనాప్రస్థానము.

ఏడు రోజులలో పుష్య శుక్ల పాడ్యమి వరకు సముద్రతీరమున స్కంధావారము.

పుష్య శుక్ల చవితికి విభీషణుని రాక,

పంచమికి సముద్రము దాటుటకై ఆలోచన.

పిదప నాలుగు దినములు సముద్రుని రాముడు ప్రార్థించుట, ప్రాయోపవేశము.

దశమికి సేతువు బంధించుటకు మొదలుపెట్టుట.

త్రయోదశిని సేతు బంధము పూర్తి.

చదుర్దశికి రాముడు సువేలగిరి నెక్కుట.

పుష్య పౌర్ణమి నుండి బహుళ విదియ వరకు సైన్యము దాటుట.

తదియ నుండి దశమి వరకు సేనా నివేశనము.

ఏకాదశిని రావణుడు పంపగా శుకసారణులు వచ్చి రాము సేన చూచుట.

ద్వాదశికి వానరసేనా గణనము.

త్రయోదశి నుండి అమావాస్య వఱకు రాక్షస సేనా గణనము.

మాఘ శుద్ధ పాడ్యమిని అంగద రాయబారము.

సీతకు రాముని మాయ శిరస్సు చూపుట.

విదియ నుండి అష్టమి వరకు వానర రాక్షస యుద్ధము.

మాఘ శుద్ధ నవమి రాత్రి ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగాస్త్రముచే బంధించుట.

దశమిని గరుత్మంతుడు వచ్చుట, నాగపాశ విమోచనము.

ఏకాదశి, ద్వాదశులలో ధూమ్రాక్ష వధ.

త్రయోదశి అకంపన వధ.

చతుర్దశి నుండి మాఘ బహుళ పాడ్యమి వరకు యుద్ధము. నీలుడు ప్రహస్తుని జంపుట.

చతుర్దశి నుండి పాడ్యమి వరకు రామ రావణుల యుద్ధము, రావణ మకుట భంగము.

పంచమి నుండి చతుర్దశి వరకు కుంభకర్ణునితో యుద్ధము చేయుట.

మాఘ బహుళ అమావాస్య యుద్ధ విరామము.

ఫాల్గుణ శుక్ల పాడ్యమి నుండి చవితి వరకు నరాంతక వధ.

పంచమి నుండి సప్తమి వరకు అతికాయ వధ.

అష్టమి నుండి ద్వాదశి వరకు నికుంభ కుంభ యుద్ధము- వధ.

పిదప మూడు రోజులకు మకరాక్ష వధ.

ఫాల్గుణ శుద్ధ విదియ- ఇంద్రజిత్తు యుద్ధము.

తదియ నుండి సప్తమి వరకు ఓషధుల దెచ్చుటకు సంరంభము- యుద్ధ విరామము.

శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి హిందూదేశ చరిత్రననుసరించి

## —: అయోధ్యనుండి లంకకు రాముని ప్రయాణము :—

1. అయోధ్యనుండి ప్రయాగ-భరద్వాజాశ్రమము.

2. భరద్వాజాశ్రమములో ఒకరాత్రి రాముడుండెను.

3. భరద్వాజాశ్రమము నుండి చిత్రకూటము పది క్రోశములదూరము. క్రోశము అనగా పదిన్నర మైళ్లు.

4. చిత్రకూటము దగర మందాకిని నది యున్నది. అదినేడును గలదు. అక్కడనుండి యాగ్నేయముగా వెళ్ళెను.

5. అత్రి యాశ్రమము. ప్రస్తుత రీవా ప్రాంతమునుండి దక్షిణసీమ వరకు. ఇక్కడ అనసూయతో సీత మాటాడెను.

6. అత్రి యాశ్రమమునుండి దండకారణ్యము. దీనికు త్తరమున గంగ దక్షిణమున వింధ్య, పడమట ఉత్తరవింధ్య అత్ర్యాశ్రమము దక్షిణవింధ్య దక్షిణ కోసలము, విదర్భ, దక్షిణాపథిలో మలయాద్రి, దక్షిణమున ద్రవిడ; పాండ్యములు గలవు. తూర్పున ఉత్కళ కళింగములు, ఆంధ్ర చోళములు గలవు. (సిరగుజా ప్రాంతము)

7. కొంత దూరములో విరాధుడు కన్పడెను, బిలాసపూర్ కు ఈశాన్యముగా నున్నది. 15 మైళ్లు.

8. ఇట శరభంగాశ్రమము కలదు. ఇచ్చట శరభంగుడగ్నిలో జొచ్చెను. ఇచ్చటనే చంపబడిన మునుల యెముకల గుట్టలున్నవి. ఇచ్చటనే రాక్షసులఁ జంపెదనని రాముఁడు ప్రతిజ్ఞ చేసెను.

9. సుతీక్ష్ణాశ్రమములో రాత్రియుండెను. ఇక్కడే కొండలు, నదులు, అరణ్యములున్నవి. కొంతదూరములో పంచాప్సరస్సరస్సు గలదు. ధర్మభృతుఁడు దీనినిగూర్చిన కథలు చెప్పెను. ఇచట మాందకర్ణి తపస్సు చేసెను, బిలాసపూరు, రాయపూరు జిల్లాలకు మధ్యగానున్నది. ఇటనే రామగిర్యాశ్రమము గలదు.

10. సైయాశ్రమము నుండి దక్షిణముగా నాలుగు యోజనములలో (120) మైళ్ళలో అగస్త్యాశ్రమము గలదు. యోజనమనగా 30 మైళ్లు. ఇది రాయపూరునకు దక్షిణముగా బస్తరు సంస్థానమునకు ఉత్తరమున గలదు.

11. అగస్త్యభ్రాతయాశ్రమమునకు అగస్త్యునియాశ్రమముయోజనము.

12. అగస్త్యుని యాశ్రమమునకు రెండుయోజనములలో పంచవటి గలదు

13. గోదావరి యిక్కడనే గలదు. ఇక్కడనే పర్ణశాల నిర్మించుకొనిరి, భద్రాచల ప్రదేశము పర్ణశాలా ప్రదేశము. మహారాష్ట్రములో నాశిక పర్ణశాల ప్రాంతము గాదు.

14- పంచవటికే శూర్పణఖ వచ్చినది. ఇక్కడనే ఖరాదులు చంపఁబడిరి. ఈ ప్రాంతమే జనస్థానము. వాల్మీకి వర్ణించిన శంబరపురము సంబలపూరు.

15. సీతను రావణు డెత్తికొనిబోయిన తర్వాత రెండామడలలో నున్న భద్రాచలము దగ్గర గోదావరి దాటిరి. ఇక్కడనే జటాయు వుండెను. అక్కడ నుండి పడమరగా నైఋతి దిశగా కొంత దూరమువెళ్లిన మరల జనస్థానము పిదప మూడు క్రోశములలో నున్నది.

16. క్రౌంచారణ్యము నైజాము రాజ్యమునకు నైరుతిగా నున్నది. ఇట నుండి మూడు క్రోసులు వెళ్ళగా కబంధుడు కనిపించి చెప్పగా పడమరగా పంపా సరస్సు చేరిరి. పంప బళ్ళారి జిల్లాలో గలదు.

17. హంపీ- ఋశ్యమూకము, మాల్యవంతము. కిష్కింధ ఇవి యన్ని యును హంపీ విరూపాక్షాలయము దగ్గరనున్నవి ఆనెగొంది దగ్గర కొన్ని కొండలుగలవు.

18. ఆ కిష్కింధ నుండి పర్వతాలు దాటిన రామేశ్వరము గలదు. అక్కడే వంతెన గట్టిరి. అక్కడ సముద్రముదాటి లంకకు వెళ్ళిరి.

—: x :—

—: అయోధ్యనుండి లంకకు మార్గము :—



# గణపతి రామాయణ సుధ — బాలకాండ

## —: వి ష య సూ చి క :—

గ్రంథాదిలో :—

———

గణపతి

# రామాయణసుధ

## బాలకాండ

### దైవధర్మ ప్రార్థన

నిత్య మనంత మనాద్యము
పృత్యంత జ్ఞేయ మఖిల లోకాశ్రయమున్
సత్యస్వరూప మవ్యయ,
మత్యంతానందతత్త్వ మనయముం గొలుతున్.

తొలి నారాయణుం డాత్మ రూపమున నెందున్ క్షీరమట్లొప్పి లీ
లలకై ఆవయి పాలమీంగడయటుల్ వ్యక్తాకృతిన్ బొంది, ని
ర్మల మాకాశము, నందుగాలి, యనలంబాపై, నటన్నీరు, అం
దిల అన్నంబయి జీవియై, వెలుంగు ఆ యీశున్ సదా మ్రొక్కెదన్.

అమితాజ్ఞానముం బాపి దుర్భరజరావ్యాధుల్ స్వనామావశే
షము గావించుచుం జావుబుట్టుకల స్పర్శల్ సోకరానట్టులన్
విమలానందమునందు, తేల్చుచు మహానిర్వాణ మార్గంబు వి
శ్వములం గల్గెడు నెల్లప్రాణులకు నశ్రాంతంబు సిద్ధించుతన్.

ఏయది సర్వలోకముల కెల్లెడ నెందును మూల మైనదో
ఏయది నిల్పంగోరి తమదెల్ల మహాత్ములు ధారపోసిరో
ఏయది తన్నుం గొల్చునరు లేరికి బంధము సోకనీయదో
ఆయకలంక ధర్మపథ మాదృతి నెప్పుడు నాశ్రయించెదన్.

సకలప్రాణుల కెల్లకాలములలో సౌహార్ద మేపారు జీ
వికకుం బ్రావయి ప్రేమ భక్తి సమతా విజ్ఞాన వైరాగ్య ధా
ర్మిక మార్గాశ్రయమై సమస్త ఫర మర్షి స్వాంత సంసేవ్యమై
యకలంకం బగు అయహింసపథముల్ ప్రాప్తించుతన్ మాకిటన్.

## సరస్వతీస్తుతి

బ్రహ్మపదంబునం దమృతవాహినియై విశదంబు నొందు ఆ
బ్రహ్మ ఋషిప్రశాంత విమలాశ్రమవాటి మెలంగి సత్కవి
బ్రహ్మల మోముఁదమ్ముల సరస్సులలో రసకేళిఁ దేలు ఆ
బ్రాహ్మి మదార్యసూక్తి రసపావనియై విహరించు గావుతన్.

## —: జనక గురు నమస్కృతి :—

కవియై పండితుఁడై విమర్శకపదఖ్యాతాత్ముఁడై వక్తయై
వివిధగ్రంథకళావిధా కుశలుఁడై విజ్ఞానియై బోధక
ప్రవరుండై బహువాఙ్మయ గ్రహణుఁడై వ్యాకర్తయై సంస్క్రియా
ప్రవరుం డౌ జనకున్ గురున్ దలతు శాస్త్రాభిజ్ఞు' నారాయణున్.

శ్రీ నారాయణశాస్త్రిని
జ్ఞానధురీణుని ననేకశాస్త్రజ్ఞుఁ గవీ
శానుని మఱిమఱియు గొలిచి
జానుగ రామాయణసుధఁ జక్కఁగఁ గూర్తున్.

వ. అని యిష్టదైవత జనక గురులకు నమస్కరించి మరియు

తీయని కైతమావి నునుఁదిన్నని కొమ్మను గూరుచుండి క్రొం
దీయని గొంతుతోఁ జివురుతీయము లూరగ రామ! రామ! రా
మా! యని యక్షరామృతము లానుచు నయ్యమృతంబు లిచ్చురా
మాయణగాత వాల్మికి మహాకవి కోయిలఁ బ్రస్తుతించెదన్.

సతతము రాముని చరితా
మృతమును వీనుల పుటముల హృదిఁ గ్రోలుచునే
మతిఁ దృప్తిని పొందని యా
మతియుతు వాల్మీకి ననఘు మఱిమఱి తలతున్.

వైదిక సంహితాటవుల బాటలు దీఱిచి యజ్ఞశాలలన్
వేదిక లాశ్రమాలమృతవీథులు చక్కఁగ దిద్ది యందులో
పాదము లుంచలేనిజనపంక్తికి మేడలు పూవుఁదోఁట ల
ష్టాదశ రీతి నంతరులు సల్పిన శిల్పిని వ్యాసు మ్రొక్కెదన్.

నాల్గు వదనంబులు ధరింపనట్టి బ్రహ్మ
హస్తములు నాల్గు దాల్చని యపరహరిని
ఫాలమున లోచనము లేని శూలపాణి
నట్టి భగవానుఁ బాదరాయణుని దలఁతు.

మదిలో మాటలలోన నాచరణలో మార్పేమి లేకుండ స
త్పదవిం గాంచుచుఁ గాంచఁజేయుచు జగత్కల్యాణమే నిత్యమౌ
విధికృత్యం బని, తామెఱుంగకయె యీ విశ్వంబులన్ నిల్పుచున్
మది శాంతించు మహాత్ము లంఘ్రిరజమున్ భక్తిం దలన్ దాల్చెదన్.

ఏపాపంబు దలంపకుండ బలియై ప్రేమాత్మసత్యాగ్రహా
లాపం బేర్పడ గెల్చి యెమ్మకలశాశ్మన్, మెనిసిమ్మొంటు స్వే
చ్ఛాపాకంబునఁ ద్యాగపుం బురదతో స్వాతంత్ర్యసౌధంబునన్
సోపానంబులు దీర్చు సోదరులకున్ జోహారులర్పించెదన్.

శీలౌచిత్యములన్ త్యజింపక ప్రజాసేవన్ బొనర్పన్ గవి
త్వాలంబంబునఁ దత్త్వముం దెలిపి బ్రహ్మానందముంగూర్చు కా
వ్యాలాపంబుల సత్యజీవితపథం బందించుచున్ భావుకుల్
లాలింపన్ రససిద్ధులౌ కవులకెల్లన్ భక్తిఁ జేమోడ్చెదన్.

భావనాప్రతిభ నప్రతిమత గన భాస
కాళిదాసుల మహాకవుల మ్రొక్కి
రసవాహినీ పూర్ణరచన మ్రోళ్ళు చివురుఁ
గన జేయు భవభూతికవిత మెచ్చి
భక్తిముక్తులఁ బారవశ్యంబు గూర్చు లీ
లాశుక శంకరులను దలంచి
వివిధవర్ణనలలో విశ్వంబులను ముంచి
పైవంగ బాణుని వాణిఁ బొగడి

అమృత జీవితయాత్రఁ గావ్యంపు వంతె
నల రచింప బుద్ధాశ్వ ఘోషుల నుతించి
పైకిఁ గనరాక డంబ మావంతలేక
యణగియున్న కవిబ్రహ్మలను దలంతు.

## —: ఆంధ్రకవి నమస్కృతి :—

సకలాంధ్రోర్వికి రమ్యవాఙ్మయపు భిక్షం బెట్టు ధన్యాత్మునిన్
సుకవిన్ నన్నయఁ గొల్చి, యందములతో శోభిల్లు వాక్చాతురి
న్సకలంబున్ తనసొమ్ము చేసిగొని దానా లిచ్చు నాతిక్కయ
జ్వకు జోహరు లొనర్తుఁ దత్పదము లేశం బైన సిద్ధింపఁగన్

ఆచరణలోన రచనలో ననుభవమున
తన బ్రతుకు మహాభాగవతంబు గాగ
భాగవత మొండెఁ దనలోని బ్రతుకుగాఁగ
బ్రతికి బ్రతికించు పోతన పదవి నడతు.

త్యాగము చేసి స్వార్థము పరార్థమె స్వీయ శరీర మంచు నా
త్యాగము సర్వమున్ భగవదర్పణబుద్ధి నొనర్చి ధన్యులౌ
త్యాగయ పోతనాది కవితల్లజు లీభువి నేకొలందిగా
నో గనవత్తు రట్టి పురుషోత్తమ వృత్తమె నిల్పు లోకమున్.

## —: కవిగుణగ్రహణము :—

ఒక్కొకనివద్ద నొక్కొక యుచితగుణము
గర్భితం బయి యుండును గాన నేను
అఖిల కవి గుణ గ్రహణ పరాయణుండ
నయి జొహారువు లర్పించెద నందఱకును.

ఎవరు సుకవులో కుకవులో యెవరికెఱుక
ఎవరికిని వారె సుకవులై, రితరులెల్ల,
కుకవులవుదురు; కుకవుల సుకవులుగను
అందఱను జేసి మ్రొక్కుటే నాదుమతము.

## —: అనువాదకుని మనవి :—

వ. అని యిట్లు దేశసేవా సమర్పిత సర్వస్వు లగు సోదరులకును సంస్కృతాంధ్రకవులకును మ్రొక్కి యెదియే నుత్తమ కావ్యంబు రచిరివఁ దలపోయుచు ఉత్తమకళల మూలమున ఆనందమును విశ్వశ్రేయస్సును

కలిగించుటయె ఉత్తమకావ్యలక్ష్యంబని తలంచుచు "నా నృషిః కురుతేకావ్యం" ఋషి కానివాఁడు కావ్యంబు రచింపఁడు అనువాక్యము మనసము చేసికొనుచు సత్యమార్గముల నడచుచు ఋషియైనవాఁడె తాను ఆచరణలో చూపువాడు గాన ఇతరులకు బోధింప సమర్థుడైగావ్యమును రచించును. ఆతఁడు తన యనుభవములను గావ్యరూపమునదెలిపి జనులను సన్మార్గపరులను చేయుటయె తనవిధియని తలంచును గాన ఋషియె కావ్యము రచించును, రచింపవలెను. అని భావించి పరమఋషుల గుణంబులను కవియోగ్యతను సంపాదించి కావ్యంబు రచింపం బూనునర్హతకై సాధన చేయుచుండ-సర్వజి న్నామ సంవత్సర పుష్య బహుళ పంచమి శుక్రవారమునాడు సాయంసమయమున (క్రీ. శ. 20-1-1948 సాయం కాలము 7-30 గం॥లకు)

## గాంధీజీ నిర్యాణ ప్రశంస

ఆర్యుండై మతరాజకీయ చతురుండై ధర్మసంస్థాపనా
చార్యుండై స్థిర భారతీయ చిరదాస్యచ్ఛేదనోత్తీర్ణుఁడై
క్రౌర్య ద్వేష విమూఢ సోదరవధ స్వైరిణాపహారాది కా
నార్యోదగ్ర హలాహలగ్రహ హరుండౌ గాంధి మాబాపూజీ

ఎప్పటిలోలెఁ బ్రార్థనమహీతలికిం జనుదెంచుచుండ నే
చప్పుడు బాపువైపఁ డని సవ్వడిమాని ప్రజాసముద్ర మా
యప్పకు మ్రొక్కి మ్రొక్కుగొను నత్తఱి వచ్చి సహోదరుం డొకం
డప్పుడు గుండ్లు పేల్చెనట యంచు హఠాత్తుగ వీనులంబడెన్.

ఇది యేమీ యని గుండెకొట్టుకొన నప్డే రేడియో వైపుగాఁ
బదముల్ తొట్రిలఁ బర్వులెత్తి ప్రజ ప్రోవై యుంట నేమేమియై
నది యంచున్ గని యెల్లచేష్ట లుడుగన్ మా ప్రేమబాబయ్య గ
ద్గదికన్ నోటను మాటరాక యెటొ పల్కన్ వింటి నీరితిగన్.

"ఏమి చెప్పుదు 'బాపూజీ యింకలేఁడు
పిచ్చితమ్ముఁ డొక్కఁడు చేయు పిచ్చిపనికి
తన శరీరము బలి చేసి మనల వీడె
అనుజ ఘోరహింసాహలాహలము మాన్ప"

---

* 1 గాంధీజీని బాపూజీ అని ఆప్తులు అందురు. 2 ప్రార్థన మః బిర్లాభవనముఖయందున్న స్థలము. బాపు—తండ్రి: అప్ప—తండ్రి.

వ. అను నీమాటలు పలుకు నయ్యవసరంబున

క్షితియున్ వ్యోమము నొక్కపెట్ట విలపించెన్ జంగమస్థావరా
గతి స్తంభించె, విదేశముల్ వగచె భక్తశ్రేణి మూర్ఛిల్లెఁ ద
స్మృతి సాయుజ్యము శిష్యులొంద; ప్రజలం బిచ్చెక్కె లోధ్యాన ము
ద్రితులై జ్ఞానులు మౌనులైరి విని గాంధీదేవు నిర్యాణమున్.

వ. అప్పుడు నా మనస్సులో నిట్లని తలంచితిని.

క్షితి శ్రీరాముని కాలమం దుడుతనై . శ్రీకృష్ణుతో నాడు గొ
ల్లతనై పుట్టకపోతి, నేఁడయిన సర్వారాధ్యుఁడౌ గాంధితో
బ్రతుకం గాంచియు బాపుజీయుడుగుజాళ్ళం బట్టి దీనప్రజో
న్నతి సర్వైక్యము గూర్చుసేవలకుఁ బ్రాణం బీయు లేనైతినే.

వ. అని చింతించుచు "గాంధీజీ తన శరీరమును విడుచునపుడు 'హే రామా!' అని పలికె నని విని పోనీ ఆ గాంధీజీకి ఆరాధ్యదైవ మైన శ్రీరాముని చరిత్రను వ్రాసిధన్యుడగా దలంచి మున్ను వ్రాయుదలంచిన కావ్యంబిదే యగు గాకతలంచుచుండ చాలకాలమిట్లు గడవగానిప్పటికి వాల్మీకిమహాముని రచితమైన రామాయణ మహాకావ్యమును తెనుగులోనికి వ్రాయు దొరకొనియు ఈ రామాయణ మహాకావ్యము నిదివరకే చాలమంది తెనుగులోనికిఁ దీసికొని వచ్చిరి గదా అని భావించి మరి యిట్లు అనుకొంటిని.

## అనువాదకుని సాహసము

ఎంద ఱెందరో యిది మథియించి రనుచు
మనముమాత్రము నిపు డూరకొనుట యేల
అంత లంతలు యత్నము లాచరింపఁ
దుడకు నందఱ కమృతంబు దొరకెనొక్కొ.

వ. అని మనమునఁ దలపోసి

తీయని తేనెలాని రుచి తీయున సుంతయు బాలకుండనేఁ
దీనుని పూవుఁదేనియలు తెచ్చి యొసంగెడి తేఁటిపగిదినే
నీయెడ మౌని వాల్మికి కవీశుని నాగమృతంబు గ్రోలి యా
తీయని సుంతయున్ జడనితీరున నీయఁగ సాహసించితిన్.

పాయక యా కవిత్రయము వారిముఖంబునఁ బొచ్చిపంచమా
మ్నాయము భారతంబు బుధమాన్యుఁడు పోతనచేతఁ బోతగా
పోయఁగఁ బడ్డ భాగవతమున్ బళి! కమ్మని తీయనౌ రుచుల్
మాయురె! చిమ్మి హాయినిడు మైమరపించును లేవు తత్తులల్

బాగుగా భారతంబును భాగవతము
తెలుఁగులోనికి సరి వచ్చి వెలుఁగుఁ జూపె
భాస్కరాదులెందఱొ కాని వ్రాసినారు
అయిన సరిగ రాలేదు రామాయణంబు.

వ. అని పామరులు మొదలు సహృదయులవఱకు పలుకు వాక్యంబు లాలకించి ఇట్టిజనుల ప్రవాదమును తుడిచిపైవఁ దలఁచి మధుర రామాయణా మృత కలశమును వరమానందకరముగా జనుల కందియఁ దలపోసి వాల్మీకి చూపిన కవితామాధురియు, పవిత్రతయు ప్రామాణికతయు ఇసుమంతయు తగ్గకుండ నుండునట్లు బంగారమునకు పరిమళమును మార్దవమును సరిపడు నట్లు తీర్ప సాహసించితిని–

## –: రామాయణ ప్రశంస :–

అస లసార మైనది యేది యైనఁ గాని
సరసకవి నోటఁ బడినచో సరస మె యగు
అరస కవినోటఁ బడి సారమైనదయ్యు
విరస మరసము నయి యెంతొ పిప్పి యగును.

వ. మరియును

అసలే నీరస మైన దేని సరసుండౌ సత్కవిం బట్టి పల్
రసముల్ చిప్పిలఁజేయు లోకమున, నిట్లైనప్పు డింకన్ రసో
ల్లసితంబే యగుచో నికన్‌రస సముద్రం బందు నోలార్చదే
సిసలౌ మైమఱ పీయదే రసములో సిద్ధిన్ గనన్ జేయదే.

ఇక రామాయణమో సమస్తము రసంబే జాలువాఱంగ నె
న్నిక కన్నట్టిది, దీని నెట్టికవియేనిన్ చక్కఁగాఁ దీర్చినన్
ప్రకటంబై రసమొల్కఁజేయు ననుదానన్ శంకయే లేదు, పూ
నిక, ప్రాజ్ఞుల్ కవులెందఱో చిలికి దానిన్ బొంద రై; రేలొకో

వ. పై వాక్యంబులభావమునే మరియు నీరీతి నెంచితిని.

అస లీ రామాయణమే రసామృతము లింపారంగఁ జిందించు; స
ద్రసపారీణుఁడె యైన సత్కవిముఖాబ్జంబందు వెల్వడ్డచో
సిస లైనట్లుగ గాక యెట్లగును వాసిన్ రక్తి యాసక్తి యిం
దసలౌ ముక్తి రసంబులన్ జిలుకు నాధన్యుండు వాల్మీకియే.

పాయక యా కవిత్రయము పంచమవేదము భారతంబు భ
ద్రాయితమూర్తి పోతన బుధాదృత భాగవతంబు నా
ప్యాయితఁ దీర్చి తెన్గునకె యందము తెచ్చిరి యట్లె నేను రా
మాయణమున్ మలంచి తెనుగందము గూర్చగ సాహసించితిన్.

వ. ఇఁకఁ గావ్యస్వరూప మెట్టిదై యుండవలె ననిన—

## —: కావ్య స్వరూపము :—

అందముగను, వీనులకు విందు చిందుచుండి
ఇంద్రియమ్ముల హృదిని స్పందింపఁ జేసి
హాయి, మైమరపు సౌందర్య మలరఁ జేయు
కావ్యమే పావనం బయి కళలదేల్చు.

మల్లెల గుత్తులు మరువ మశోకము
మాలతి పొగడల మాలవోలె

మేలిబంగరు ముత్యాలు పచ్చలు గూర్చి
రత్నాల్ పొదిగిన హారంబువోలె

రసములు, చిల్కు పనసలు మామిడి ద్రాక్ష
చెఱకు తేనెల మిశ్రసీధు వటుల
సంగీత సాహిత్య సరసనాట్య ప్రయోగ
రమ్య మధుర ప్రదర్శనము భంగి

చిలుక కోయిల నెమిళుల చెలిమిపోలె
వన్నెవన్నెల యందాల వలువ వగిది
పద్మ కలహంస సరసుల పవన మటుల
హృద్యమై శ్రావ్యమౌ కావ్య మింపు నింపు

ఆశ్రమ భూమియం దానంద నోద్యాన
లీలలు దిద్దు వాల్మీకి వాణి
పట్టన సౌధాల, పావనాశ్రమ మంత్ర
భాసఁ జిల్కెడి కాళిదాససూక్తి
రాజఠీవియు, ప్రేమరాగ సౌందర్యంబు
జిలికించు భోజుని జిలుగుపలుకు
దేశభాషలలోనఁ దీయని రససిద్ధి
భక్తిఁ జిమ్ము తులసీ ప్రభృతి గతుల.

ఱాళ్ళ నేడ్పించు భవభూతి రమ్యరీతి
ఇంక నాయాసహృదయ కవీశపదవు
లాకళింపు చేసికొని హృద్యామృతంబు
సంతరింతు మధుప మటు సరసఫణితి

వ. అట్టి కావ్యరచనకు ముందు మా వంశమును గూర్చి సంగ్రహముగ తెలిపెదను.

—: అనువాదకుని వంశవర్ణన :—

భరత ఖండంబునం దాంధ్రధరణిలోన
ప్రథిత గోదావరీతీర పావనోర్విఁ
గళల కాకరమై గురుకులము లలరు
సరస కాకరపఱ్ఱు మా జన్మభూమి.

అందు నరుగులె వేదవేదాంగ విద్యాలయములు
అందు గృహములె ఛాత్రసంఘావాస మందిరములు
అందు మావితోటలె ప్రశాంతాశ్రమ పదతలములు
అందు వాకిండ్లె సకలకలారావ రంగభువులు.

ప్రథితమౌ నట్టి కాకరపఱ్ఱునందు
విదిత చర్ల వంశమునందు నొదవినాఁడ
వేంకట జనార్దనులనెడి విమలగుణులు
నా దగు పితామహులు వారు త్యాగమతులు.

నవమాసంబులు మోసి మాకిలను జన్మంబున్ ప్రసాదించు శ్రీ
లవతీరత్నము తల్లి వేంకమయు తాఁ బ్రాయంబునన్ మేను వా
య విలోకించి సమస్తపోషణ భరం బత్యంతమున్ దాల్చి యీ
యవనిన్ బెంచిన మా పితామహుల సౌహార్దం బదేపాటిదో.

నాదు జనయిత్రి వేంకమ సాధుచరిత
ఆమె యుత్తమ గృహలక్ష్మి యంచు మిగుల
నూరివారలు చెప్పఁగవింటి, నామె
వర పతివ్రత యాకొండి వంశజాత.

పిన ప్రాయంబున యుండె తల్లితనువున్ వీడన్ దదీయంపు వ
ర్తనలన్ గన్గొను భాగ్య మబ్బదయినన్ తద్భర్తృ సేవాపరా
యణతల్ దీనజనోపకార నిరత స్వాంతంబు శాంతంబు పా
వన సౌశీల్యము నేటికిన్ మసకగా భావస్మృతిన్ దోచెడిన్.

ఆలరుఁ దీయమామిడి గున్న నల్లుగొనిన
ప్రకృతిలత సహజమ్మృదుల పరిమళములు
తనర విడుపూలలోన రాలినవి రాల
వంత నిలిచె మూఁడె గుణత్రయంబు వగిది.

అందు మొదటిసంతతిని లచ్చమ్మ యండ్రు
అవల రెండవ దానిఁ గామన్న యండ్రు

ఏను మూఁడవవాఁడను నిందు నేనె
లౌకిక జ్ఞానుఁడను వా రలౌక్యమతులు.

వ. ఇంక మాతండ్రి

తనకుఁ బేరుప్రతిష్ఠలను గోరఁ, డైన శి
ష్యులకుఁ బేరును ప్రతిష్ఠలను గూర్చు
తాను నేరాజును దర్శింపఁ, డైన శి
ష్యవితతి నాస్థానకవులఁ జేయు
తన కెట్టియుద్యోగమును వాంఛ చేయఁడు
శిష్యు లుద్యోగముల్ సేయ మెచ్చు
తనయింటి వ్యవహారము నెఱుంగఁడు గాని
యఖిల దేశ వ్యవహార మెఱుఁగు

అంటరాని తనముఁ గూల్ప నంటుపడును
ఆర్తుల వెలిమాపఁగ గుడిసెఁగును వెలికి
కడఁగి దేశకష్టము బాపఁ గష్టపడును
సచ్చరితుఁడు నారాయణశాస్త్రి తండ్రి.

ఛాత్రులో వారు పుత్రులో సఖులొ యనుచు
నెల్లరు భ్రమింప బోధించె నెవరొకాని
యఖిల శిష్యులు కవిగురుప్రాజ్ఞు లైరి
చరమ శిష్యుఁ డైతిఁ బితృపాదులకు నేనె.

గర్వాంధ నృపతులఁ గనక దుర్మ్ముటయె మే
లని మహిషశతక మనువదించె
నన్నయాథర్వణాంధ్రవ్యాకరణమును
తెనుగున వ్రాసి ఖ్యాతిని గడించె
ప్రఖ్యాత మగు మహాభారత మీమాంస
తెనిఁగించి తెనుఁగుకు దీప్తిగూర్చె
వినుత భర్తృహరి నిర్వేద నాటకమును
తెనుఁగు కావ్యాదర్శమును రచించె.

నీలకంఠ విజయముఁ దెన్గించి మించె
ఘనత సూర్యరాయాంధ్ర నిఘంటురచన
ముఖ్యపదవిని వహియించి స్ఫూర్తి గాంచె
సచ్చరితుఁడు నారాయణ శాస్త్రితండ్రి.

జనకుఁడే సర్వవిధుల నాచార్యుఁడగుట
నేను జేసిన పుణ్యపుం దీరుగాదె
సరస సాహిత్య సంగీత శాస్త్రగతుల
నతఁడె గురువు నాదర్శ మన్నిటికిని.

—: ఆప్త ప్రశంస :—

తొలుతనుండి చేదోడు వాదోడు నగుచు
చాలవిధుల నాపత్ని సుశీల తీర్చ
అదన నరసింహమూర్తి మేనత్త కొడుకు
చూడ నా గ్రంథములు వెల్గుచూడగలిగె.

వివిధ కృతులఁ బత్ని సుశీల విమల కమల
చర్ల బుద్ధనారాయణశాస్త్రి. విదుల
మృదుల యను నాదుసుతు లాంధ్రతెలుఁగఁ దెనుఁగు
సలిపితిని చర్ల గణపతిశాస్త్రినేను.

ముద మిడి సద్గుణములచే
విధిగా కుడిభుజములవలెఁ బ్రియులగు తనయుల్
విదుల మృదుల కృతి రథసా
రథు లయి కనఁ దీర్చినాఁడ రామాయణమున్.

—: విఘ్నప్రార్థన :—

తెల్లని వస్త్రము దాలిచి
చల్లని చందురుద్యుతియు భుజంబులు నాల్గున్
మెల్ల ప్రసన్నముఖము గల
చల్లని హరిఁ దలఁతు విఘ్నశాంతికి నెపుడున్.

—: గణేశప్రార్థన :—

దేవేశుఁడు మొదలు సకల
మౌ విబుధులు నెల్లపనుల ప్రారంభములో
ఏ విభుఁ గొలిచి కృతార్థులు
గా వెలసిరొ యాగణేశుఁ గరముం గొలుతున్.

—: ఆంజనేయప్రార్థన :—

ఎందెందు రాము గుణములు
విందుగ వినఁబడుచు నుండు వీనులకెపుడున్
అందందె యశ్రు లూరెడు
కందోయిని గేలు మోడ్చు కపివరుఁ గొలుతున్.

వేదంబులఁ దెలియందగు
వేదవిదుఁడు దశరథునికి వేడ్క సుతుండై
ఈ ధరఁ బుట్టఁగ వేదమె
ప్రాదుర్భవమొందె మునికి రామాయణమై.

వ. అట్టి రామాయణ సుధకుఁ గథాక్రమమెట్టిదనిన—

:—కథాప్రారంభము :—

తపమున స్వాధ్యాయంబున
నెపుడు మునిగి వాక్యతత్త్వమెఱిగిన చతురున్
తపసివిశారదు నారదు
నపుడా వాల్మీకి మౌని యడిగెను నిటులన్ 1–1

ఇప్పుడీ జగతిలో ఋషివర ! నరులందు
నెవ్వఁడు గుణవంతుఁ, డెవడు వీరుఁ
డెవ్వఁడు ధర్మజ్ఞుఁ, డెవఁడు కృతజ్ఞుండు
సత్యవాక్యుఁడు వ్రతశాలి యెవఁడు

సచ్చరిత్రుడెవండు సకల హితుఁ డెవండు
ప్రాజ్ఞుఁడు సర్వసమర్థుఁ డెవఁడు
ఎపుడు ప్రియముగనె యెవని దర్శనముండు
నెవనిలో నాత్మ స్ఫురించుచుండు

క్రోధము జయించె నెవఁడు, సురూపి యెవఁడు
ఈర్ష్యలేనివాఁ డెవఁడు, కోపింప నాజి
నెవని కమరులున్ దలఁకుదు, రితని జెప్పు
మెఱుఁగ వేడ్కగల దెఱుఁగు దీవ యనగ 1-2

త్రిలోక సంగతులెల్లన్, దెల్సిన నారదుం డొగిన్
వాల్మీకి మునివాక్యంబుల్, విని విస్మని యిట్లనెన్ 1-3

ఎక్కడనైనను నే విటు
వక్కాణించిన సుదుర్లభంబగు గుణముల్
చిక్కనె, ఆలోచించియు
వక్కాణింతు నిపుడవ్వి వఱలిన నరునిన్ 1-4

వ, అని యిట్లు దేవముని కొండొకతడవు ధ్యానించి వాల్మీకి మునిపుంగవునికి
ఈ విధమునఁ జెప్పఁదొడంగె 1-5

## —: శ్రీరాముని గుణవర్ణన :—

కలఁడిక్ష్వాకులయింట రాముఁడని యాఖ్యన్గన్న వీరుండు ని
ర్మలుఁడాతండు, యతాత్ముఁడై ద్యుతిధృతుల్ రాజిల్లుధీశాలి చం
చలచిత్తంబును వంచియాత్మవశియౌ శాంతుండు ధీరుండు ను
జ్జ్వలుఁడెందున్ స్మితపూర్వభాషి నయవిద్యావేత్త శ్రీమంతుఁడున్ 1-6

దుష్పథిన్బోవు శత్రువుల దండించు మ
హాబాహుఁడగు విపులాంసుఁ డతఁడు
శంఖమూదుకబోవు చక్కని కంఠంబు
పెద్ద దవడలున్న వీరుఁడతఁడు

అతఁడు మహోరస్కుఁడయి మహేష్వాసుఁడౌ
ధృతగూఢజత్రుఁ డరిందముండు
ఆజానుబాహుపై యందమౌ శిరసు సు
ఫాలము విక్రమంబలరు వాఁడు

సముఁడు సమతఁదీరిచిన యంగములవాఁడు
నునుపు వర్ణము బలియు పెన్ రొమ్ము వాఁడు
లక్ష్మిగల మహాక్షుఁడు శుభలక్షణుండు
సత్యసంధుఁడు యశస్వి జ్ఞానయుతుఁడు 1–7

ప్రజకయి ప్రాణమైనవిడు వశ్యుఁడునై శుచియై సమాధితో
భుజములుగల్పి, జీవజగమున్ దనధర్మము లోకధర్మమున్
స్వజనము సెప్డు రక్షణము సల్పఁగ దీక్షితుఁడై ప్రజాపతిన్
గజిబిజిసేయుధారణము గల్గు విచక్షణుఁడైన సాధువున్ 1–8

ఆతడు వేదవేదాంగ తత్త్వజ్ఞుండు
వరధనుర్వేద పారగుండు
ఆతడు సర్వశాస్త్రార్థసారవిదుఁడు
స్మృతియుఁబ్రతిభయు భాసిల్లువాఁడు
ఆతఁడు దైన్యములేని యాత్మగల్గినవాడు
ఘనుఁడు సర్వలోకప్రియుండు
ఆతఁడు, నదములచే సంద్రమ్ము వోలికఁ
బుణ్యపురుషులచే పొందఁబడును

ఆర్యుఁడతఁ డెల్లర సమంబరయువాడు
అగపడును సెప్పుడైనఁ బ్రియుంబుగానె
అతఁడు సర్వగుణంబుల కాటపట్టు
తల్లి కౌసల్య కానంద దాయకుండు. 1–9

ఇతడు గాంభీర్యమునవార్ధి–హిమగిరి ధైర్యమందు
వీర్యమున మహావిష్ణువె–పృధివియె యోర్పునందు

క్రోధమందుఁ గాలాగ్ని, చంద్రుఁడు ప్రియదర్శనమున
త్యాగమున ధనదుఁ డపరధర్ముండు సత్యమందు 1–10

## –: నారదుడు చెప్పిన సంగ్రహ రామాయణము :–

వ. నీవు తెలిసికొనఁ గోరియడిగిన యా గుణములు గలవాఁడు రఘు కుల చంద్రుఁడగు శ్రీరాముండె ఇతని చరితము ఉత్తమము. దానిని సంగ్ర హంబుగఁ జెప్పెద నాలకింపుము. ఇటువంటి సర్వగుణాభిరాముఁడగు రాముడు సత్యపరాక్రముఁడు. ప్రకృతి హితంబు చేయువాఁడు' అని తలఁచి యతని తండ్రి దశరథుఁడు ప్రకృతి హితంబుచేయగోరి అతనిని యౌవరాజ్యంబునం దభిషేకింపఁ దలఁచెను. 1–11

ధర్మపత్నులు మువ్వ రాదశరథునికిఁ
గలరు కౌసల్యయు సుమిత్ర కైక యనఁగ
రాము నభిషేకవస్తువుల్ కైక చూచి
మును పిడిన వరములను గోరుకొనియె నామె 1–12

అడవికిని రాము బంపుట యం దొకండు
భంతు రాజ్యాభిషేకంబు మఱియొకండు
ధర్మపాశాన బద్ధుఁడై దశరథుండు
సత్యమును నిల్ప సుతు వనస్థలికిఁ బంపె 1–13

పితృవాక్పాలనఁ గైక యిష్టమును గావింపన్, గడున్ సత్యపున్
బ్రతినన్ బూర్తియొనర్ప వీరుఁడతఁడంతన్ గానకుం బోవఁగా
నతనిన్ దమ్ముఁడు లక్ష్మణుం డలసుమిత్రానంద సంధాయి సు
వ్రతియై వెంటజనెన్ వినమ్రతయు సౌభ్రాత్రంబు చూపించుచున్ 1–14

గుణముల్ భూషలుగా ధరించిన యనుంగుంబత్నియున్, సర్వల
క్షణ సంపన్నయు, దేవమాయయటులన్ జన్మించి కర్మవ్రతున్
జనకున్ దండ్రిగఁగొన్న ప్రాణహిత, శ్రేష్ఠంబైనయిల్లాలు, రో
హిణి చంద్రుంబలె, సీత భర్త ననువర్తించెన్ మహాసాధ్వియై 1–15

ప్రజల రంజించు శ్రీరాము వదలలేక
పురిని నడవిగ, నడవిని పురిగఁజేసి
తమ్ముఁ బౌరులనుసరింపఁ, తండ్రియైన
దశరథుఁడు కుంద, రాముండు తరలె వనికి 1—16

ఒడలెఱుఁగకుండఁ బడియుండ నడిమిరాత్రి
జనుల నందఱ కనుగప్పి సత్యదీక్ష
నతడు రథముతోలించి యా యడవిదారి
యెఱుగకుండనే ముందున కేగె వనికి 1—17

గంగయొడ్డున నేపారు శృంగిబేర
పురమునందు సూతు మరల్చి పురికిబంపి
బాల్యమిత్రు నిషాదాధిపతిని గుహుని
దరియబోయెను రాముడు ధార్మికుండు 1—18

గుహుడు లక్ష్మణుడును సీతకూడ రాగ
ఒక్కవనమునుండి యింకొక్కవనికి
నరిగె రాముడు; పిమ్మట నంబు పూర్ణ
నదులు దాటిరి దేవగంధర్వసములు 1—19

వారు చిత్రకూటాద్రిని జేరి యంత
వనముల విహరించుచు సుఖం బొనర ముువురు
నటు భరద్వాజమునియాజ్ఞ నందమైన
యొక కుటీరము నిర్మించి యుండిరందు 1—20

చిత్రకూటము రాముండు చేరినంత
తనయ శోకాతురుండయి దశరథుండు
స్వసుతుని దలంచి యేడ్చుచు స్వర్గమరిగె
నతడు మరణింప నట వసిష్ఠాదులంత 1—21

భరతు రప్పించి యా రాజ్యపాలనంబు
నొనరుపగ నియోగించిన నొప్పుకొనక

భరతుడు మహాబలుడు రాముపాదములను
పడి నను్గ్రహింపగజేయ వనికి జనియె 1–22

అంత సత్యవి్క్రమముని మహాత్ము రాము
నన్నఁగాళ్ళపై భ్రాతృమర్యాదమీర
బ్రాలి–"ధర్మజ్ఞ! యీ భూమి వలయమువకు
నీవ పతివి కొను" మని యాచించి వేడె 1–23

సుముఖుడు పరమోదారుడు విమలయశుడు
రాముడంత పితృాజ్ఞదలంచి రాజ్య
మునకు నొప్పుకొనక భరతు ననువయించి
న్యాసముగఁబాదుకల నిచ్చి యనిపె ప్రేమ 1–24

తనకోరిక దీరకె రా
ముని చరణాబ్జముల ్రాలి పొగులు భరతు డె
ట్లనొ చని నంది్గ్రామం
బున రాముని రాక గమచు భువి పాలించెవ్ 1–25

ప్రతి చిన్న విషయమైనను
పతి భక్తిని పాదుకలకు నపుడు నివేదిం
చి తదుపరి యేలుననఘ భ
రతుడు జడలు దాల్చి యన్నలాగువ ్రవతియై 1–26

పురికి వనినుండి భరతుండు మరలిపోవ
నింక సత్యసంధుండు జితేంద్రియుండు
నైవ శ్రీరాము డిట నున్నఁ బౌరులు నరుగుదెంతు
రనుచు తలపోసి దండకవనులఁ జొచ్చె 1–27

అంబుజాక్షుడు శ్రీరాము డడవిఁ జేరి
అచ్చట విరాధు దనుదైత్యు హతమొనర్చి
మునుల శరభంగుని నాసుతీక్ష్ణుని నగస్త్యు
నిక నగస్త్యు సోదరుని దర్శించె నెలమి 1–28

ఆయగస్త్యు వాక్యముచేత సైంద్రధనువు
ఖడ్గమును నంబులపొది నక్షయశరాలు
కైకొని మఱి రాముడు వన్యగణముగూడి
యందు వసియింప ఋషులెల్ల నటకువచ్చి 1-29

అసురగణదౌష్ట్యమును జెప్పి హతమొనర్ప
రాముఁగోరగ దండకారణ్యవాసు
లగ్ని కల్పులౌ ఋషులకు 'నసురగణము
పట్టి వధియింతు' నని గొప్ప ప్రతినచేసె 1-30

వార లిటులుండగా కామచారిణియును
ఆజనస్థాన వాసినియైన యసుర
శూర్పణఖ వచ్చి బాధింపఁజూచి విసిగి
ఆమె ముక్కుచెవులు కోసి యనిపె రంత 1-31

శూర్పణఖ పోయి చెప్పగ శూరులగుచు
ఖరుడు త్రిశిరుడు దూషణు డౌతసివడగ
వారలను వారియనుచరవ్రాతములగు
రాక్షసుల జంపె రాముడు రణమునందు 1-32

వ. ఇట్లు ఆ రామలక్ష్మణులు దండకారణ్య మందు నివసించుచు జనస్థానమునందు వాసంబుండి, ఋషులను సాధువులను నిత్యము బాధించు పదునాలుగువేల రాక్షసులను అంతమొనర్చిరి. 1-33

అంత,

కలనన్ రామ నరుండు జ్ఞాతివధమున్ కావించు టాలించి బి
ట్టలుకన్ మూర్ఛితుడౌచు రావణుడు సాహాయ్యంబుకై కోరగం
'బలవద్వైరముకూడ' దంచు బలుమార్ మారీచుడన్ దైత్యు డ
ర్మిలి వారించినగాని కాలమది ప్రేరేపింపగా మానకే 1-34

ఆ మారీచునితోడన్
రాముని యాశ్రమముచేరి రావణు డపుడే

ఆ మాయకానిద్వారా
రాము ననుజు మోసవుచ్చి రమణి హరించెన్ 1-35

సీతఁగావవచ్చు జటాయుఁజెనకి కూల్చి
రావణుడు లంక కేగెను, రాము డంత
పర్ణశాల సీతఁ గానక పథి జటాయు
హతుఁగని హరింపబడె సీత యనుచు వినియె 1-36

వినినంతన్ వికలేంద్రియుండయి మహావీరుండు రాముండు హె
చ్చిన దుఃఖంబున స్రుక్కిబిట్టు విలపించెన్ రాళ్ళు ద్రీలన్ తరుల్
నను బూగండ్ల మరందముల్ విడువ, మోడుల్ కూల, జంతుల్ వనం
బును వాతంబును చేష్ట దక్క ప్రకృతే మూర్ఛిల్లి మోడై చనన్ 1-37

అలసి రాముడెట్టిటో తేరి యాత్మబంధు
వగు జటాయువు త్యాగంబు నాత్మ మెచ్చి
దహనకర్మాదులొనరించి దయిత సీత
నడవి వెదకుచు కబంధు నసురఁ గనియె 1-38

వికృతాకారుని ఘోరదర్శనుని బృథ్వీభారు నాదైత్యు నం
తకు వీటిన్ వడిఁబుచ్చి, యంత్యక్రియలన్ జల్పెన్ మహాబాహువ
ష్ఠిక నారక్కసి దివ్యుడై దివముపై కేతెంచి "శ్రీరామ! ముం
దుకు నీ వేగియు ధర్మశీల శబరిన్ దూర్ణంబవీక్షిం" వనన్ 1-39

అరిదమనుడు మహాతేజుడపుడు శబరి
ధర్మచారిణి, భక్తిచేఁదనువు మఱచు
దాని, దరియనేగిన, నామె తన్ను జగము
మఱచి పూజించె శ్రీరాము చరణములను 1-40

శబరి వీడ్కొల్పి శ్రీరామచంద్రు డపుడె
యరిగి పంపానదీ తీరమందు దిరుగు
మాన్య భక్తిమంతుని హనుమంతు దరిసి
యతడు నుడువ సుగ్రీవు మైత్ర్యంబు చేసె 1-41

అటు సుగ్రీవునితో సమస్తము స్వవృత్తాంతంబు వాక్రుచ్చియుం
గట నారాఘవుడాదినుండి తుదిదాకన్ సీతవృత్తాంత మం
తటనింకన్ వివరించి తెల్పగ; సమస్తంబైన వృత్తాంత మ
చ్చటిదాలించి యొనర్చెయగ్ని యెదుటన్ సఖ్యంబు సుగ్రీవుడున్ 1–42

పిదప తనకును వాలితో పెరిగియున్న
ద్వేషమును దుఃఖితుండయి వినయ మొప్ప
రాఘవునికి నివేదింప రాఘవుడును
వాలిఁ జంపి సాయమొనర్పఁ బ్రతిన చేసె 1–43

ఆ వాలి బలమెఱుగు సు
గ్రీవుడు రాముబలమెఱుగకే రఘురాముం
డావాలి గెలుచునే యని
యావాలి బలంబు రాము డరయ వచించెన్ 1–44

వాలి బలమిట్టి దనుచు విశ్వాస మొదవ
రామునికి మహాపర్వత ప్రతిమమైన
దుందుభినిశాటు దేహమున్ తొందరగనె
తీసికొనిపోయి రాముడు తెలియజూపె 1–45

కని రాముండు బలుండు దుందుభి మహాకాయాస్థి శైలంబు నం
తన చిర్నవ్వులు మోమునందొలుక పాదాంగుష్ఠమున్ జాపి చి
మ్మెను కూలందశ యోజనంబు; లిటెనమ్మింపంగ, నొక్కండె య
మ్మున భేదించెను సప్తసాలము లగంబున్ గ్రింది పాతాళమున్ 1–46

అవల అదిచూచి మిక్కిలి యలరి నమ్మి
రాముతోడఁ గిష్కింధ పురంబు చేరి
హేమపింగళుఁడును వానరేశ్వరుండు
ఘనుఁడు సుగ్రీవుడటఁ జేసె గర్జనంబు 1–47

ఘన గర్జారావమాలకించి కడు నుగ్రాకారుడై వాలి తా
రన్నాపీడ్కొల్పి రణంబులో విపుల శౌర్యంబొప్ప సుగ్రీవుఁ జం
ప ననిం జేయగ, నొక్కటా శరముచే వాలిన్ ద్రుటిన్ దున్మి నే
ర్పున, రాముండభిషేకమున్ జలిపె వీరుల్ మెచ్చ సుగ్రీవునిన్

కపి వృషభుడు సుగ్రీవుడు
కపులన్ రావించి యెల్ల కడలన్ సీతన్
అపుడే వెదకింప బనిచె
స్వపరాక్రమమును ప్రతిజ్ఞ ప్రకట పడంగన్

మరల సంపాతి యను గ్రద్దమాటఁ బట్టి
నూఱు యోజనంబు లటు విస్తారమైన
లవణ జలనిధిని దాటియు రావణుండు
రక్షణముచేయు లంకాపురంబు చేరి

అందశోకవనంబునఁ గుందుచుండి
రామునిపై ధ్యానమొనరించు రమణి సీతఁ
జూచి హనుమంతు డానవాల్ చూపి యిచ్చి
ఆమె వార్త యెఱిగి మిగుల నోదార్చి సతిని

అటు మర్దించియు తోరణం, బవల సేనాధ్యక్షులైదుండ్ర నె
క్కటికయ్యంబునఁ జంపి, మంత్రి సుతులన్ గర్వాంధులౌ నేడ్గురన్
త్రుటిలోఁ బిండిగఁజేసి యక్షయసుతున్ శూరున్ వడిన్ గొంచియుం
తట సందేశము రావణాసురుని కందంజేయఁ బట్టుంబడెన్

బ్రహ్మవరముసఁ దన్ను నస్త్రమున నుండి
విడివడిన వానిగాఁ దెల్పి వీరుడతడు
యంత్రములు గల్గు నసురుల నట క్షమించి
ధరణిజ వని విడిచి లంకఁదగుల బెట్టె

రామునికి ప్రియము వచింప లంకనుండి
వచ్చి హనుమంతుడిక "చూచి వచ్చినాను
సీత" నని మహాత్ముడౌ రాముచెంతకేగి
యతనికిఁ బ్రదక్షిణముచేసి యనియె నెలమి 1.54

వడి సుగ్రీవునిగూడి వార్ధితట మేపారన్ సమీపించి యొ
క్కెడి వింటిన్, రవిసారమౌ శరములెన్నోన్ వేయ నెంతో సము
ద్రుడు క్షోభించి తనుంగనం బఱిచి వాక్రువ్వంగ తద్వాక్కుచే
కడలందున్ సలుచేత శైలములచేఁ గట్టించె బెన్సేతువున్ 1-55

ఇంక నా సేతువెక్కి యా లంక కేగి
ఘోర రణమున రావణుఁ గూల్చి రాము
డపుడు సాధ్వి జానకిఁ గాంచి యసురు లింట
నున్న సతి గొనన్ సంకోచమొంది మదిని 1-56

విమల స్వాంతుడు లోకరంజకుడు పృథ్వీశుండు లోకాపవా
దముకై జంకి జనుల్ వినన్ పరుషవార్తన్ బల్కెని, "ట్లన్యగే
హము నందుండి స్వశీలరక్షణము చేయన్ శక్యమే నీ చరి
త్రము శంకాస్పదమిచ్చ వచ్చినటు సీతా! నీవు పోవచ్చు" నాన్ 1-57

"ఎపుడా రామునిజూతు నెప్పుడు ప్రియున్ బ్రేమంబుతో జేరి కా
ళ్ళపయిన్ వ్రాలుదు" నంచునెంచుచుగలల్ దాఁగాంచునా సీత యి
ట్టి పరీవాదపు బల్కుముల్కు హృదిగాడిన్‌చేయ నిశ్చేష్టయై
యపుడా మాటలు సైచలేక జ్వలనంబందిట్టి చొచ్చెన్ వడిన్ 1-58

అపుడు తల్లి భూదేవి బిట్టులుకఁ బోలె
మిగులఁ గంపింప దొడగెను జగములన్ని
మదిని నాందోళనము పొందె మాన్యులెల్ల
కుమిలి, రారాముహృది కొట్టుకొన దొడంగె 1-59

పిదపనగ్ని దేవుడు చెక్కుచెదరకున్న
సీత సాధ్వి నెత్తుకవచ్చిచెప్ప, నగ్ని
మాటవలన 'జనకజ కల్మష విహీన'
యంచు దలచి రాముడు స్వీకరించె సతిని. 1-60

అట్టి లోకోత్తరమగు కార్యంబువలన
దేవతలు ఋషులు మహాత్ములై వెలుంగు
రాము మెచ్చగ నపుడు శ్రీరాము డాత్మ
నలరె, సర్వదేవులు పూజ సలిపి రతని 1-61

లంకలోన విభీషణు రాక్షసేంద్రు
నప్పుడె యభిషేకించి యే యార్తి లేక
రాముడు కృతకృత్యు డయి హర్షంబు నొందె
సురల వరములుపొంది వానరుల నిలిపి 1-62

పుష్పకముమీద సఖులతో మోదమార
పురి యయోధ్యకు వెడలి రాముండు పిదప
ఆభరద్వాజు నాశ్రమం బరిగి భరతు
వలను హనుమంతుఁ దనరాకఁ దెలుప ననిపె 1-63

ఇంక సుగ్రీవుడాదిగ హితులురాగ
మునుపటి కథను జెప్పుచు పుష్పకంబు
నెక్కి, యనిన గడు వతిక్రమింపకుండ
ననుజుఁ గలియ నందిగ్రామమందు వ్రాలె 1-64

నందిగ్రామమునన్ జటల్ విడచి పుణ్యాత్ముండు రాముం డనుం
గుందమ్ముల్ వడిరా నయోధ్యజని, యెంతో వెంగతో స్రుక్కిక
న్నుం దమ్ముల్ గడుగాయ కాయగని తన్నున్ రూపమున్ ప్రేమగ
న్నుందొప్పన్ దమిదావుపౌరుల భువిన్ దోడ్తోగొనెన్ సీతతో 1-65

హర్షమున నుల్లసిలి లోకమంత యపుడు
తుష్టి పుష్టిని గని ధర్మనిష్ఠగలిగి
ఆధి వ్యాధి లేకయుఁ గఱవైన లేక
యుట సుభిక్షముగా నెల్ల హాయిగనిరి 1-66

ఎవరు నెటఁ బుత్రమరణ మీక్షింపబోరు
సతులు పతియుక్తలయి ప్రతివ్రతులె యౌదు
రగ్నిగండము జలగండ మచటలేవు
వాతభయము జ్వరభయ మెవ్వరును గనరు 1-67

ఆకలిభయంబు దొంగభయంబు గాని
లేక రాష్ట్రముల్ పురముల్ సమృద్ధమైన
ధాన్యధనములఁ దులతూగి దనర ప్రజలు
అట సుఖింతురు కృతయుగ మందుఁబోలె 1-68

అశ్వమేధయాగములు నూ ర్లాచరించి
స్వర్ణదక్షిణ లిచ్చి విద్వాంసులకును
కోట్లు లక్షలు గోవులు కొలవరాని
ధనము లిడె విప్రులకు రాము డనఘయశుడు 1-69

శతగుణంబుగ రాజవంశముల నిలిపి
స్వస్వధర్మంబులోఁ జతుర్వర్ణములను
నడపి *దశవర్ష సాహస్రములు నిక దశ
వర్ష శత ముపాసించి విశ్వమును ప్రేమ 1-70

---

* దశవర్ష సాహస్రములు దశవర్ష శతములు అనగా తృతీయం శత మిత్యాహుః, చతుర్ధంతు సహస్రకం. శతమనగా మూడు, సహస్రమనగా నాలుగు అని సంఖ్యాశాస్త్ర పరిభాష. దశవర్ష సాహస్రమనగా 40 ఏండ్లు. దశ వర్ష శతమనగా 30 ఏండ్లు. 40, 30 కలిపిన 70 పరిపాలన. పట్టాభిషేకమునకు పూర్వము 34 ఏండ్లు గడచెను. మొత్తము 108 ఏండ్లు శ్రీరాముని జీవితము. (ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము 1467 వ పుట)

శ్రీరాముండు నిరంతరము ప్ర
జారంజకముగ జగముల జను లిట మెచ్చం
గా "రామరాజ్యమిది" యన
నారాధించుచు బ్రహ్మలోక మందెడుఁ బిదపన్ 1-71

శ్రీరామాయణ మిందు బ్రాహ్మణులు సంప్రీతిన్ బఠింపంగ వా
క్స్వారాజ్యంబును గాంత్రు, క్షత్రియులు నేపారన్ బఠింపంగ క్షో
ణీరాజ్యంబునుగాంత్రు, వైశ్యులునుసెన్నేన్ లాభముల్ గాంతు రిం
పారన్ దీనిబఠింపశూద్రులు మహత్త్వం బెంతయున్ గాంత్రుగా. 1-72

ఇది

వాల్మీకి మహామునిచే రచింపబడి వెంకమాంబా పుత్రుడును
నారాయణశాస్త్రి జనక గురువరప్రాప్త విద్యుడగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపబడిన
రామాయణ సుధ యందు
రామాయణ సంగ్రహము.

రామాయణావతారిక

ఇట్లు వాక్య విశారదుండగు నారదుండు వాల్మీకి యడిగిన ప్రశ్నల కుత్తరంబుగ పావనంబగు రఘురాముని చరితమును సంగ్రహముగ దెలుప విని ధర్మాత్ముడైన వాల్మీకి శిష్యులతోడ గూడి నారదుని బూజించి వీడ్కొలుప దేవర్షియగు నారదుడు వాల్మీకిని వీడ్కొని, వాల్మీకి యనుమతితో నాకాశ గమనంబున వెడలిపోయెను. 1

అమరముని దేవలోకము
నిమునములోఁ బోవ, గంగ నికటస్థము నా
తమసా తీరముఁ జని పా
ర్శ్వమునంగల శిష్యుతోడ వాల్మీకి యనెన్. 2

విమలం బీ తమసా తీ
ర్థ, మిదె భరద్వాజ! నీవు దర్శింపు. మెటుల్
రమణీయమయి ప్రసన్న జ
లమయి యగపడెడినో సుజనుల మనంబు వలెన్ 3

కలశం బటు లుంచుము వ
ల్కల మిటు తెమ్ముత్తమ మయి కనుపడు తమసా
జలమున మునుగుదు నన వ
ల్కలమిడె గురు నియతుడగు భరద్వాజు డటన్ 4

ఆ మహాత్ముడౌ వాల్మీకి యపుడు శిష్యు
హస్తమునుండి వల్కల మందికొనుచు
నధిక విస్తార్థమై యొప్పు నా వనంబు
నన్నికడల దృష్టి నిగిడ్చి యరసె మిగుల 5

వనిలో చెంతనె చీకుచింతయును రవ్వంతేని లేకుండి సు
స్వనముల్ చేసెడి క్రౌంచపక్షుల కవన్ వంద్యుండు వాల్మీకి క
న్గొనె, నిట్టుల్ గనుచుండ నొక్కడు బహుక్రూరుండు వ్యాధుండు హె
చ్చిన ప్రేమందగు జంటనుండి మగపక్షిన్ గూల్చెపాపాత్ముడై 6

అపుడు రక్తమున తడిసి యవని దొర్లి జచ్చి
యచట! పడియున్న ప్రియుజూచి యాడు పక్షి
ఎఱువు శరమున్న ప్రియతము నిట్టె పాసి
దీనముగ నేడ్చె వినువారు దిగులుచెంద 7

అపుడటులన్ నిషాదు పగకాహుతియై పడుపక్షిగాంచి ధ
ర్మవరుడు మౌనిచంద్రుడు మది గ్రక్కున జాలి జనించ, జాలిగా
స్వపతినిజూచి యేడ్చు నలపక్షిని నెంచి, యధర్మమంచుఁ బై
కపు డిటుక్రౌంచిగూరిచి దయావరు డమ్మునిపల్కె నిట్టులన్ 8

* క్రౌంచ మిథునంబునుండి, కామినొక్కని జంపుటన్
మహా ప్రతిష్ఠ బొందుమా నిషాద! శాశ్వతంబుగన్ 9

---

* ఇతరార్థములు :-

(1) క్రౌంచ మిథునమునుండి: రావణ కుంభకర్ణుల జంటనుండి లేక మండోదరీ రావణుల జంటనుండి, కామిన్: పరస్త్రీ కాముకుని రావణుని, మానిషాద లక్ష్మీపతీ (2) నిషాద (నితరాం లోకాన్ సాదయతి పీడయతీతి నిషాదః) రావణా! సీతారాముల జంటనుండి, క్రౌంచద్వంద్వమునుండి: (క్రుంచేః వచాద్యచ్ వనవాసాది దుఃఖిత) సీతారామ ద్వంద్వమునుండి, చంపుటన్: సీతా హరణముచే అధికపీడ కలిగించుట ద్వారా రాముని జంపుటచే, (చచ్చిన వానినిగా జేయుటచే) మహా అప్రతిష్ఠను బొందుమా. ఇది కావ్యార్థ సూచనము.

వ. ఇట్లు క్రౌంచ పక్షిని గుఱించి పలికి తన హృదయములో మరల దానిని భావించి ఈ శకుని విచారంబుచే శోకార్తుడైన నేనిది (ఈ వ్యాధ శాప రూప తపో నాశక వాక్యము) యేమిట్లు పలికితిని అని యమ్మహా ప్రాజ్ఞుడును బుద్ధిమంతుడునగు వాల్మీకి ముని పుంగవుడు ఆలోచించుచు శిష్యునితో నిట్లనియె. 10

ఇది పాదములన్ దీర్చిన
యది, యుచితాక్షర సమమయి యలరును వీణా
మృదులయ యుత, మిది శోకిత
హృది వెడలిన శ్లోక మన్యమెది కాదరయన్. 11

ముని యతడిటులనుచుండన్
విని శిష్యుండా యనర్ఘవృత్తము మదిలో
ననువుగ గ్రహించె, దానికి
మనమున గురువును ప్రమోద మహితుండయ్యెన్. 12

అవల నా వాల్మీకి మహాముని యథావిధిగ నా తమసా తీర్థంబున అభిషేక మాచరించి యా వృత్తమునె మదిలోఁ జింతించుచు ఆశ్రమమునకు మరలుటయు నతని శిష్యుండగు భరద్వాజుండును తద్వార్తా శ్రవణ కుతూహలుండయి వినీతుండయి పూర్ణ కలశంబును దీసికొని గురుని ననుసరించె. 13

ధర్మవిదుడైన వాల్మీకి తనదు శిష్యు
డనుసరింప నాశ్రమము నపుడు సొచ్చి
కూరుచుండి యేయవొ చెప్పుకొనుచునుండి
యాత్మయందు విలీనుడై ధ్యానముండె. 14

అంత నా ధ్యానములో 15

జగముల్ సర్వము పూర్ణమైన యటులన్ సంకల్పమాత్రన్ సృజిం
చి గడున్దీర్చు స్వయం ప్రభుండు జతురాస్యేందుండు తేజస్వియై
తగు నా బ్రహ్మ తనంత వాల్మీకి మునిన్ దర్శింప నేతేరఁ జూ
చి గభాల్మన్ ముని లేచి దోయిలిడి నిల్చెన్ విస్మయానమ్రుడై. 16

అట్లు నిల్చి నమస్కరించి అర్ఘ్య పాద్యంబు లొసంగి యుత్తమాస
నంబు ముందుంచుటయు నందు గూర్చుండి వాల్మీకి మహర్షిని కూడ ఆసనం
బున గూర్చుండుమని ఆనతి యిచ్చెను. బ్రహ్మ యానతి ప్రకారమున వాల్మీకి
ముని యాసనంబున గూర్చుండి యుండె. అంతట సాక్షాత్తుగా లోక పితా
మహుండైన బ్రహ్మ గూర్చుండుటంగని బ్రహ్మ భావ గతంబగు మనస్సుతో
వాల్మీకి ధ్యానంబునం దుండియె పాపాత్ముడు వైర బుద్ధియు నగు నా వ్యాధు
నిచే నకారణంబుగ–చారు నిస్వనములు చేయుచు హాయిగనుండిన క్రౌంచ
మును జంపిన సంఘటనను జూచి శోకించుచుసె యా లలితపదమైన శ్లోకమునె
శోకపరాయణుండైన మౌని యంతర్లీన మానసుండయి గానంబు చేసె. 11
7

అవలన్ బ్రహ్మ, మొగంబునన్ నగవు తొల్కాడంగ నమ్మౌని పుం
గవుతో నిట్లనె "నోయి బ్రహ్మ! యిది శ్లోకం, బిందు శంకేలగాం
దువు, నా యిచ్చనె యీ సరస్వతి యిటుల్ నీలోఁ బ్రవర్తిల్లె, మౌ
నివరా! రాము చరిత్ర వ్రాయుమిపుడే నీవిట్టి పద్యంబులన్. 18

ధర్మాతుఁడు గుణవంతుఁడు
నిర్మల మతి వీర రాము విశాల చరిత్రం
బర్మిలి నారదు చెప్పిన
పేర్మిన్ రచియింపుమయ్య విబుధులు మెచ్చన్ 19

మహిని జానకీ రామలక్ష్మణుల మధ్య
రాక్షసులమధ్య నెది యేది ప్రకటముగను
మఱి రహస్యముగ జరగె నెఱుగఁ గలవు
ఎల్లకావ్యాన నీమాట పొల్లుగాదు, 20

హృదయంబున్ ద్రవియింపఁజేసి మది రంజిల్లన్ మనోహారియై
మృదులంబై మధురంబునై యనఘమై యేపారు రామాయణం
బిది చక్కంగ సువృత్త వృత్తములతో నీవిప్పుడే తీర్చు, పద్
హృదయుల్ భావుకులున్ మేయిన్మఱచి మేల్మేలంచు గీర్తింపఁగన్. 2

ఎందనుక శైలములు నదు లీధరిత్రి
నిల్చియుండునో యందాక నిఖిల జగతి
నెమ్మి నీకూర్పు రామాయణమ్ము నిల్చి
ఇలను, పయి బ్రహ్మలోకాన నిలుతువీవు. 22

ధ్యానంబందిటు పల్కి బ్రహ్మ, త్రుటి నంతర్ధానముం జెందగా
మౌనీశుండిక ధ్యానమున్ విడి యిదేమాయంచు నాశ్చర్యమున్
ఆనందమ్మును బొందె నంత ముని శిష్యశ్రేణి యాలించి య
ద్దానిన్ గాన మొనర్చి వాకొని రమందాశ్చర్య సంప్రీతులై 23

సమమైన యక్షరంబుల
నమరిన నాల్గు చరణముల నామునిి యెది గా
నము చేసెనో యాయది శో
కము శ్లోకంబయ్యె మరలఁ గలిపె వచింపన్ 24

భావించిన యాత్మ గలుగు
నా వాల్మీకికిటు బుద్ధి యంత జనించెన్
'కావించెద రామాయణ
మీవిధి పద్యములచేత నేనిఁక' ననుచున్. 25

శ్రేయు, ముదారవృత్తమగు హృద్యపదార్థములేర్పడన్ సమా
మ్నాయ సమాక్షరాలుగల మానితపద్య శతాలతోడ రా
మాయణ కావ్యమున్ మలచె స్వచ్ఛ యశోయుత రాముగాథ, లా
ప్యాయయశస్వి వాల్మీకి మహాకవి శిల్పియుదార చిత్తుడై. 26

మృదుమధుర వాక్య బద్ధము
తదుపగత సమాస సంహితా యోగం బౌ
ప్రథిత రఘురామ చరితం
బు దశాస్యవధ, ముని తీర్చె పూర్తిగ వినుడీ. 27

## రామాయణ కథాసంగ్రహము

వ. ధర్మాత్ముఁడైన యా వాల్మీకిమహాముని ధీమంతు డయిన యా రఘురాముని ధర్మ సంహితమైన చరితమునంతను స్ఫుటముగ నన్వేషించు వాడయి జలము నాచమించి కృతాంజలియై యుండి దర్భలను ప్రాచీనాగ్ర ములుగ నుంచి ధర్మముగా ఆ రాముని గతిని మనంబున ధ్యానింపఁ దొడం గెను.

సీతారామ లక్ష్మణులును భార్యలతోఁగూడిన దశరథ మహారాజును రాజ్య మున నుండి సరిగా ఏమిచేసిరో ఎట్లు నవ్విరో ఏ భాషలు భాషించిరో, ఎట్లు నడచిరో, ఏమి ఆచరించిరో సర్వ ధర్మములందు వీరులైన వారెట్లు తలఁచిరో అదియంతయు ఆ ధ్యానములో ముని గనఁ గలిగెను. స్త్రీ తృతీయుఁడైన రాముఁడు సత్య సంధుఁడయి వనములో ఎట్లు ఏమి అనుభవించెనో అదియుఁ జూడఁగలిగెను.

ధర్మాత్ముఁడైన వాల్మీకి మహాముని యోగంబునఁగూర్చుండి పూర్వము జరిగిన దంతయు చేతిలోని ఉసిరిక కాయవలెఁ గాంచగలిగెను.

మహాద్యుతియును భగవంతుడును నగు వాల్మీకి మహర్షి అదియు చక్కఁగాదెలిసికొని సర్వగుణాభిరాముడైన రాముని చరిత్రమునంతను రచింపఁ బూని, పూర్వము నారద మహర్షిచే చెప్పబడినదియు, ధర్మార్థ కామములతోఁ గూడి విస్తరమైనదియు, సముద్రము వలె సర్వగుణ రత్నములతో యుక్తమై నదియు అందఱకు వీనులకు విందు కలిగించునదియునగు రఘువంశ చరిత మును రచించెను.

అందు 1. రాముని పుట్టుక 2. అతని మహాపరాక్రమము 3. సర్వాను కూలతయు 4. లోక ప్రియత్వము 5. ఓర్పు 6. సౌమ్యత్వము 7. సత్య శీలత 8 విశ్వామిత్ర సమాగమమున నానా విధములైన చిత్ర విచిత్రకథలు 9. శివ ధనుస్సును విఱచుటయు 10. జానకీ వివాహము 11. రామపరశురామ వివాదమును 12. దశరథరాముని గుణమును 13. రాముని యభిషేక యత్న ములు 14. కైకేయి దుష్టత 15 అభిషేకవిఘాతము 16 రాముని నడవికిఁ బం

పుట 17 దశరథుని శోకము విలాపమును 18 దశరథుడు పరలోకము పొందు టయు 19 ప్రకృతి జనుల విషాదము 20 పౌరులను కనుమఱగి అడవికిపోవుట 21 నిషాదాధిపుడైన గుహునితో సంభాషణము 22 సూతుని వెనుకకు అయో ధ్యకు బంపుట 23 గంగనుదాటి భరద్వాజుని దర్శనము 24 భరద్వాజుని యనుజ్ఞచే చిత్రకూటము దర్శించుట 25 పర్ణశాల నిర్మించుకొని యుండుటయు భరతుని రాకయు 26 రాముని ననుగ్రహింపఁజేయుట 27 తండ్రికి నీళ్ళు వద లుట 28 పాదుకలను అభిషేకించుట 29 భరతుని నందిగ్రామ నివాసము 30 రాముని దండకారణ్య గమనము 31 విరాధుని వధయు 32 శరభంగ మహా ముని దర్శనము 33 సుతీక్ష్ణునితో సమాగమము 34 అనసూయ సీతకు అంగ రాగమర్పించుట 35 అగస్త్యుని దర్శనము 36 జటాయువుతో సమాగమము 37 పంచవటికి వచ్చుట 38 శూర్పణఖను చూచుట సంవాదము ముక్కుచెవులు కోయుట 39 ఖరత్రిశిరస్సులవధ 40 రావణుడు వెడలుట 41 మారీచువధ 42 సీతాప హరణము 43 రాముని విలాపము 44 గృధ్రరాజు మరణము 45 కబంధుని చూచుట 46 సంపాతి దర్శనము 47 శబరీదర్శనము 48 హనుమంతుని దర్శ నము 49 పంపాసరస్సుదగ్గర రాముని విలాపము 50 ఋష్యమూకపర్వతగమ నము 51 సుగ్రీవునితో సమాగమము 52 సుగ్రీవునికి నమ్మకము కలిగించుట 53 సుగ్రీవమైత్రి 53 వాలిసుగ్రీవ యుద్ధము 54 వాలివధ 55 సుగ్రీవుని ప్రతి పాదనము 56 తారావిలాపము 57 సమయము (ప్రతిజ్ఞ) వర్షరాత్రి నివాసము 58 రాముని క్రోధము 59 బలముల సమీకరించుట 60 సీతాన్వేషణకై వానరు లను పంపుట 61 ద్వీపాది నివేదనము 62 సీతకిమ్మని రాముడు అంగుళీయ కమిచ్చుట 63 ఋక్షుని బిలదర్శనము 64 కపుల ప్రాయోపవేశము 65 సంపాతి దర్శనము 66 పర్వతారోహణము 67 హనుమంతుడు సాగరము లంఘించుట 68 సముద్రుని మాటవలన మైనాక పర్వత దర్శనము 69 సింహికానిధనము 70 లంకామలయ దర్శనము 71 రాత్రి లంక ప్రవేశించుట 72 ఒంటిగా ఆలో చించుట 73 ఆపానభూమి గమనము 74 రావణాంతఃపుర దర్శనము 75 రావ ణుని జూచుట 76 పుష్పక విమానమును జూచుట 77 సీతను రాక్షసస్త్రీలు భయ పెట్టుట 78 త్రిజట స్వప్నము చూచుట 79 రాముడు సీతకుఅభిజ్ఞానముఇచ్చుట 80 సీతకు మణినిచ్చుట 81 లంకావనమును విఱుగగొట్టుట 82 రాక్షస స్త్రీల

యుపద్రవము 83 కింకరులచంపుట 84 హనుమంతుడుపట్టుబడుట 85 లంకాదహనము 86 ప్రతిప్లవనము 87 మధువుల హరించుట 88 రాముని ఓదార్చుట 89 సీత ఇచ్చిన మణిని రామునికి ఇచ్చుట 90 విభీషణుని సమాగమము 91 రావణునివధకు ఉపాయముచెప్పుట 92 సముద్రునితో సంగమము 93 నలుడు సేతువును బంధించుట 94 సముద్రమును దాటుట 95 రాత్రి లంకను ఎదుర్కొనుట 96 కుంభకర్ణుని జంపుట 97 మేఘనాథుని జంపుట 98 రావణవధ 99 శత్రునగరమునందు సీతను పొందుట 100 విభీషణుని యభిషేకము 101 పుష్పక దర్శనము 102 అయోధ్యకు వచ్చుట 103 భరద్వాజునితో సమాగమము 104 భరతునిదగ్గరకు హనుమంతుని బంపుట 105 రామాభిషేక మహోత్సవము 106 సర్వ సైన్యములను పంపివేయుట 107 స్వరాష్ట్రప్రజారంజనము అను విషయములను ఉత్తర రామాయణ కావ్యములో 108 సీతను అడవిలో విడచుట 109 వసుధలో రాముని భావి కార్యము" అను విషయములు భగవంతుడైన వాల్మీకి మహర్షి రచించెను. 28

—: ఇది కథాసంగ్రహము :—

వ. ఆత్మవంతుడును భగవంతుడునైన యావాల్మీకిమహాఋషి రాజ్యము పొందిన రాముని విచిత్ర పద భూషితమైన చరిత్రమునంతను రచించెను. 29

ఆ మహర్షి ఇరువదినాలుగువేల శ్లోకములను అయిదు వందల సర్గము లను, ఆరు కాండలను ఉత్తరకాండను భవిష్యోత్తర కాండను రచించి 30

అనువుగ దీనిని గానం
బొనరించి జగతినెవరు ప్రయోగింతురొకో
అని తలంచు తఱిఁ గుశలవు లు
మునివేషులు వచ్చి కాళ్ళకు మ్రొక్కిరి భక్తిన్ 31

కుశలవులు ధర్మవిదులు రాకొమరు లనుజు
లాశ్రమ నివాసులు యశస్వులైనవారు
హాయిగొలుపు మధురమౌ లయయు స్వరంబు
గలుగువారని మదిలోనఁ దలఁచి మౌని 32

మేధావులు వినయ యుతుల్
వేద పరాయణ నిపుణులు వీరని గని యా
*వేదోప బృంహణము నా
పాదింప గ్రహింపజేసె వారల దీనిన్ 33

ఈ రామాయణ కావ్యం
బారని జ్యోతియగు సీత యనఘ చరిత్రం
బా రావణవధ' అనియెడు
పేరనె వాల్మీకి రచించె విమల వ్రతుడై 34

చదివిన గాన మొనర్చిన
మృదు మధురంబగుఁ బ్రమాణ త్రితయయుతంబై
విదితంబు సప్త జాతుల
నిడి తంత్రీలయగతి యయి శ్రుతులకు విందౌ 35

అమల శృంగార కరుణ హాస్యాద్భుతములు
ప్రకట వీర భయానక రౌద్ర ప్రముఖ
రసము లెసగు రామాయణ రమ్య కావ్య
గాన మొనరించిరి కుశలవానుజు లట 36

తమతోన గాంధర్వ తత్త్వంబు నేర్చిన
స్వర మూర్ఛనాస్థాన సరసమతులు
అనుజులై సుస్వర వినుతులై రూపంబు
నొందిన గంధర్వయుగ్మకంబు
రూప లక్షణముల నేపారు మూర్తులు
మధుర స్వరంబులం బాడు వారు

---

1 * వేదోప బృంహణము = వేదార్థమున కాయా యర్థములలో తాత్పర్య గ్రహణము. ఇతిహాస పురాణాభ్యాం వేదార్థముపబృంహయేత్.

2 ప్రమాణ త్రితయయుతము = ద్రుతమధ్యమవిలంబిత ప్రమాణయుతము
3 సప్తజాతులు = సప్తస్వరముల జాతులు

బింబంబు వెల్వడు బింబంబులంబోలె
రాము మేన్ వెల్వడు రమ్యగుణులు

రాజసుతులు *కుశీలవులై తనర్చు
కుశలవులు ధర్మయుక్తమై కొమరుమిగులు
ఉత్తమాఖ్యాన మయ్యది యుత్తమముగ
పూర్తిగా వాక్కుకు విధేయముగ నొనర్చి: 37

కలిసి రామాయణ కావ్యంబు వినుపింతు
రొక్కమాఱు ఋషులు కూర్చున్నచోట
ఆడి రామాయణ మాలపింత్రొకసారి
కలిసి ద్విజుల సమాగమములందు
తనరి రామాయణ తత్త్వంబు నెఱిఁగింతు
రొకమాటు సాధుల నికటమందు
విసరి రామాయణ రస మొలికింత్రొక
పరి, భావితాత్ముల స్వాంత వీథి

వాల్మికి గురూపదేశంబు వదవి విడక
తత్త్వ విదులు మహాత్ములు ధ్యానయుతులు
సర్వ లక్షణ లక్షితుల్ నరసమతులు
కవలు కుశలవుల్ సహృదయుల్ గానరతులు. 38

ప్రణుతింపన్ విని దానిఁ జిత్తము ద్రవింపన్ బాష్ప పర్యాకులే
క్షణులై మౌనులు బాగుబాగని మహాశ్చర్యంబు నానందమున్
గని యోహో ! భళి ! గీత మాధురియు శ్లోకప్రాభవం బెట్టిదో
యని శ్లాఘించిరి ధర్మవత్సలత నెయ్యం బొప్ప నా బాలురన్. 39

ఎపుడో యెక్కడో యెట్టులో జరుగు నా వృత్తంబు ప్రత్యక్షమై
యిపుడే యిక్కడె యిట్టులే జరిగినట్లే కండ్లకుం గట్టి న

* కుశీలవులు=మంగళపాఠకులు

ట్లు ప్రదక్షిణపగఁ జూచిపించును మునుల్ మోదాన శ్లాఘించి యె
న్నో పొగడ్తల్ కురిపింపఁ బాడిరి మరెంతో హాయిమీఱన్ గపల్. 40

ఒకమౌని ప్రీతితో నొక కలశ మొసంగె
శ్లాఘించి యొకఁడు వల్కలము నిచ్చె
ఒకఁడు కృష్ణాజినం బొకఁడు యజ్ఞోపవీ
తము, నొకఁడు కమండలమునిచ్చె
మౌంజి సమర్పించె మౌనివరుఁ డొకరుఁ
డొకఁడు కుఠారంబు నొకఁడు వలువ
లొకఁడు కాషాయంబు నొగి సమర్పించెను
నొకఁడు చీరంబు లొసఁగె మెచ్చి

ఒకఁడు జడలముడి కుశలు నొకఁడొసంగె
ఒకఁడు యజ్ఞభాండము. కట్టిలొకఁ డొసంగె
ఒక్కఁ డౌదుంబర బ్రుసిని ఒకఁడు మెచ్చె
ఒక్కఁడాశీస్సు లాయుష్య మొకఁడు పలికె. 41

వాల్మీకి మునిచేతఁ బరికీర్తితంబైన
యాఖ్యానమిది పరమాద్భుతంబు
కావ్యముల్ రచియించు కవుల కియ్యది సమ
స్తము నేర్పెడి పరమాదర్శసీను
ఎటు లుపక్రమించి యెటు లుపసంహార
మొనరింపవలెనో తెల్పిన రసోక్తి
సర్వగీతములందు సరసంబుగా గాన
మొనరింపఁబడు గీత సూక్తి సరము

ఆయువిడునది పుష్టిని చేయునదియు
అందఱకుఁ గూడ శ్రుతి మనోహరకరంబు
ధర్మబోధకము సత్యదాయకంబు
హర్ష మోక్షదాయకము రామాయణమ్ము. 42

ఏయది పాడమన్న నదె యింపుగఁ బాడుచు నెల్లవారి కా
ప్యాయతఁ గల్గఁజేఁయుచును బాటలలోఁ బ్రజ మూగి మెచ్చ రా
మాయణ కావ్యగానమును నాచరియించుచునుండు చిన్నలేఁ
బ్రాయము వారిఁ బ్రేమగని రాఘవుఁడున్ బిలిపించి యిట్లనెన్. 43

లాలింపఁదగిన యనుజుల
లాలించి తన కతి దగ్గర నునుచుక జు
ల్పాలం దువ్వుచుఁ బ్రీతిన్
బాలురఁ గడు గారవించెఁ బార్థివుఁడంతన్. 44

కనకమయ దివ్య సింహా
సనమునఁ గూర్చుండి నృపుఁడు సహజు లమాత్యుల్
తన దరిఁ గూర్చుండ నరసి
యనియె నిటులఁ గవలఁ జూపి యనుజుల తోడన్. 45

వినుఁడు విచిత్ర పదము కథ
యనుజన్ములు దైవతేజులగు వీరెటులన్
మనసు కరగఁ బాడుదురో,
యని రాముఁడు వారిఁ బాడమని ప్రేరేచెన్. 46

మృదువై యనురక్తంబయి
మధురంబయి హృద్యనాద మహితంబగుచున్
ముదమిడి తంత్రీలయవలె,
ప్రథితార్థమగునది వారు పాడిరి హాయిన్. 47

అది సర్వగాత్రములు మది
హృదయములు ద్రవింపఁజేసి యెంతయు సభలో
ముదమును బ్రహ్మానందము
నొదవన్ వీనులకు విందు లొనరించె నహో! 48

మునివేషుల్ నృపలక్షణాన్వితులు సమ్మోదాశ్రునేత్రుల్ తపో
ఘనులై మీ కుశలవుల్ వినుచు నా కావ్యంబు భూతిప్రదం
బనుచై యెంతొ మహానుభావకరమై పొల్చున్ వినుండయ్య మీ
కునెగా దీతటి భూతి, మైమఖపు నాకుంగూడఁ గల్గించెడున్. 49

పిదపన్ రాముఁడు ప్రోత్సహింపఁ గవలున్ వేమారు సంతుష్టులై
*మృదుపౌమార్గ విధాన సంపదలచే నింపారఁగాఁ బాడి, రం
త ధరానాథుఁడు ప్రీతితోడఁ బరిషత్తం దుండి యాలించి నె
మ్మది వాసక్తిని మెచ్చి లోకముఁ దమన్ మైమర్చి శాంతింగనెన్. 50

ఇది

వాల్మీకి మహామునిచే రచింపఁబడి చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
రామాయణ కథా గానము.

—:o:—

* మార్గము దేశి అని గానము రెండు విధములు. సంస్కృతసంప్రదాయమునకు సంబంధించినది మార్గము అనియు ప్రాకృతాది దేశములకు సంబంధించినదిదేశి అనఁబడును.

## కథా ప్రారంభము – పురవర్ణన

ఈవసుంధరయెల్ల నీప్రజాపతి మొద
లొ్కని జయంబు గొను నేజనపతులదొ
పుత్రు లరువదివేవురచే జలధిగ త్ర
వ్వించినట్టి సగరుఁ డెవరివాఁడొ
స్వర్గమున రథమార్గము గల్గిభువి
విధి యుక్తముగ వ్రేల్చువిభువు లెవరొ
సంతతికై గృహస్థాశ్రమమును గొని
చిననాఁడె చదు వభ్యసింతు రెవరొ

వయసుతఱి వీరులై జరన్ వనుల నిలచి
కడకు యోగాన మెయి వీడు జ్ఞాను లెవరొ
ఈమహాత్ము లిక్ష్వాకులయింటివారి
గాథ రామాయణము నింపుగా రచింతు. 51

ఘనమై యిక్ష్వాకుకులం
బునఁ దగి ధర్మార్థకామమూలము రామా
యణ మాది నుండి సకలము
వినిచెద విందుగ వసూయ విడచి వినుండీ. 52

## అయోధ్యాపుర వర్ణనము

తుష్టియు నపార ధనధాన్యపుష్టి గలిగి
కోసలం బనునొక గొప్పదేశ ముండె
అది సరయువునదీ తీరమందు వెలుగు
అమలజల మందపవనముల్ హాయి గొలుప. 53

* ఇవి కాళిదాసు భావములు.

మను వనుమనుజేంద్రునిచే
తను నేవట్టణంబు నిర్మితంబయి యలరా
రెనొ, అది యయోధ్య యనఁగా
ఘనముగ లోకంబులందు ఖ్యాతం బయ్యేన్. 54

అది పన్నెండగుయోజనాల పొడపై వ్యాపించి శ్రీమంతమై
చదునై మూఁడగుయోజనాల్ వెడలుపై చక్కంగ నేర్పర్చు పెన్
పదవుల్ గల్గియుఁ జక్కఁదీఱిచిన పొల్పౌరాజమార్గాన నొ
ప్పిదమై వీడినపూలఁ జిత్రమయి యొప్పెన్ నీళ్లు చల్లన్ సదా. 55

ఆపురి వసించి దశరథ
భూపతి యాగొప్పరాష్ట్రమునకున్ వృద్ధిన్
ప్రాపింపఁ జేయుచుండెను
నేపుగ స్వర్గమ్మును నమరేంద్రుఁడుపోలెన్. 56

వ. ఆనృపసత్తమునికి హ్రీశ్రీ కీర్తులంబోలిన భార్యలు కౌసల్య,సుమిత్ర, కైకేయి యనువారు గలరు. అతనిచేఁ బాలితం బయినయాపుర మెట్లున్న దనిన. 57

వెలుపలఁ గోటతల్పులు తోరణములు, లోఁ
జక్క నేర్పఱచు బజార్లు గలిగి
రక్షకౌ సర్వయంత్రాయుధా, లందాలు
సంతరించెడు శిల్పిజనము లొప్పి,
చూడ సమ్మర్దమౌ సూతమాగధ పంక్తి
శుభమైన, తులలేని శోభ లెసఁగి
ఎత్తుకోట బురుజు లెత్తిన జండాలు
శతశతఘ్నుల బార్ల తతుల వెలసి

వెలయు స్త్రీనాటక సమాజకళల నలరి
పెనుచు పూవుఁదోటలు నామ్రవనులు వఱలి
క్రాలు ప్రాకారపున్ మొలమాలు మించ
మీఱు నప్పురి దుర్గ గంభీరపరిఖ. 58

పరు లేరున్ జొరరానిదుర్గ మగుచున్ వాజిద్విప శ్రేణి ని
ర్భరమై, గోవులు నొంటెలున్ ఖరములున్ రాజిల్ల సామంత భూ

వర సంఘాతము లావరింపఁ బలుదై వారాధనల్ పర్వఁగా
బరదేశాగత వర్తక ప్రముఖులన్ భాసిల్లు నాప్రోలిలన్. 5

ప్రాసాదంబుల రత్నవి
భాసిత క్రీడార్థ కృతక పర్వతముల నా
వాసిత కూటాగార ని
వాసల నిండు మఘువునమరావతివోలెన్. 6

ఆపురి ఎనిమిది పథముల
రూపు గలిగి చిత్ర మయి, సురూపపతులకున్
ప్రాపయి సకల మణిగణ
వ్యాపకమై ధనికసౌధ పరిశోభితమౌ. 6

గృహముల నిండి ఛిద్రములులేక సమంబయి యిక్షు సద్రసా
వహ మయి శాలితండులపు పాతుల నిండి, మృదంగదుందుభుల్
మహితములై నవీణలస్వరంబులమాధురి విందిడన్సుఖా
వహపణవధ్వనుల్ దిశలఁబర్వఁగ నప్పురమొప్పునెప్పుడున్. 6

తపసున దివమునఁ, గాంచిన
సుపదులుసిద్ధులవిమానశోభలనాప్రో
లెపుడున్ జక్కఁగఁదీర్చిన
యపురూపగృహాల నరవరాళుల నలరున్. 6

ఘనమగు నిట్టిపురి కుబే
రునికిని, యమునికయినను వరుణునికి, దేవేం
ద్రునికింగాని, స్వయంభువ
యిన బ్రహ్మకుఁగాని లేద యేయందములన్. 64

అసహాయున్ హితబంధుహీను ధ్వనివేద్యాకారుఁ బరె త్తు వా
ని, సుతేజస్వులు హస్తలాఘవ. మనిన్ నేర్పొప్పువీరుల్ వధిం
ప శరాల్‌వేయరు; కానఁ గ్రొవ్వి భయదంబౌ గర్జనల్ చేయ నా
రసి శార్దూలవరాహ సింహములఁ గేల న్నమ్ములన్ గూల్తురిగా. 65

అటువంటి, వేలకొలఁదిగ
భటులు మహారథులచేతఁ బరిపూర్ణంబై
నటువంటి మహాపురమున
ఘటికుండు దశరథుఁడుండె క్ష్మముఁడౌపతియై. 65

నిరతంబగ్ని నిర్వేల్చు వేదనిధులున్ వేదాంగపారంగతుల్
వరశీలాదిగుణోత్తముల్ ద్విజులుమీఱన్ వేల్సమర్పించు స
త్యరతుల్ గొప్ప మహర్షికల్పులు మహాత్మశ్రేణి యందుండు రా
త్మరతుల్ కేవలమౌఋషుల్ నిలుతు రందాలొల్కనవ్వీటిలో. 66

## —: రాజప్రజాది వర్ణన :—

సకలవేదవిదుండు సర్వసంగ్రహకర్త
దీర్ఘదర్శి సుమహాతేజువాఁడు
పౌరులకును జానపదులకును ప్రియుండు
నైక్ష్వాకవకులాన కతిరథుండు
యాగాదికము శ్రద్ధనాచరించెడువాఁడు
ధృతి ధర్మపరుఁడు జితేంద్రియుండు
ముల్లోకముల ఖ్యాతిపొందినవాఁడు మ
హర్షికల్పుఁడు రాజర్షి, బలుఁడు

మిత్రవంతుఁ, డమిత్రుల మించువాఁడు
ధనముల నితరసామగ్రి ధనద, శక్ర
సముఁడు లోకపాలుఁడగు నోజస్వి, మనువు
వలె దశరథుఁడు జగమేలె నిలచి పురిని. 67

అమలమనస్కులై జనము లప్పురిహృష్టులు ధర్మనిష్ఠులై
తమతమయా స్తిఁదృప్తిపడి, తాము బహుశ్రుతులై యలోభులై

క్షములయి, సత్యకాములయి, సంచరియించుచునుందు రం దన
ల్పమగు సదర్థసంచయములందనివాఁ డొకడేని లేఁడుగా. 68

కోరిక నెఱవేఱని సం
సారులు ధనధాన్యములును హయములుగోవుల్
భూరిగ నుండని వా రె
వ్వారును లే రాయయోధ్యపట్నములోన్. 69

ఆనగరంబున నీచుఁడు
గానీ క్రూరుండుగాని కామియుఁగానీ
గానఁగరాఁ, డప్రాజ్ఞునిఁ
గానీ నాస్తికునిగాని కానమయోధ్యన్. 70

పురుషులును స్త్రీలు పురి నె
ల్లరుగూడను ధర్మశీలురయి సునిశ్చితి నుం
దురు, శీలవృత్తములచే
నరయఁబడుదు, రమలులగు మహర్షులువోలెన్. 71

లేఁడు కుండలములులేనినరుఁడు, లేఁడు
మకుటముతాల్పని మానవుండు,
లేఁడు మాలలులేనివాఁడు, లేఁ డపరిశు
ద్ధాత్ముఁడౌవాఁడు, లేఁ డల్పభోగి
లేఁడు గంధపుఁబూతలేని నరుఁడు,లేఁడు
మేనన త్తరుపూసికోని నరుఁడు
లేఁడు మృష్టాన్నములేని నరుఁడు, లేఁ.డ
దాత, యనిష్కాంగదధారి లేఁడు

లేఁడు చేతికిఁగడియంబు లేనివాడు
లేఁ,డనాత్ముఁడు లేఁడగ్నిప్రేల్చనతఁడు

లేఁడయజ్వ, దొంగయెలేఁడు లేఁడుహీనుఁ
డాయయోధ్యలేఁడని మర్లుసట్టివాడు. 72

సతతమ్ము స్వస్వకర్మని
రతులయి విజితేంద్రియులయి బ్రాహ్మణులు సుసం
గతి దానాధ్యయన సుశీ
లతఁదగి, యిడినఁదొరపడరు గ్రహియించుటకై 73

నాస్తికుండునుగాని యనృతవాక్యుఁడుగాని
యబహుశ్రుతుఁడుగాని యచటలేఁడు
ఈర్ష్యగలుగు నరుండేని యశక్తుఁడే
నమనీషియునేని యచటలేఁడు
ఆషడంగాలయం తరయనతఁడె లేఁడు
వ్రతముల పూననియతఁడె లేఁడు
వేనవేలీయని మానవుండును లేఁడు
దీనుఁడున్ చలచిత్తుఁడైన లేఁడు

వ్యథలుగలవాఁడు నొక్కఁడే నరయరాఁడు
స్త్రీపురుషులందు బరికింప శ్రీలురూపు
సద్గుణంబులు లేకుండు జనులె లేరు
రాజభక్తి శూన్యుఁడుఁ జూడరాఁడు పురిని. 74

నరులందఱు దీర్ఘాయులు,
నిరతము ధర్మమున సత్యనిష్ఠమెలగుచుం
దురు, పుత్రులఁ బౌత్రులనె
య్యురఁగాంతలఁ గలసిమెలసియుందురు పురిలో. 75

క్షాత్రమునకు బ్రహ్మ ముఖము
క్షాత్రమనుసరించి వైశ్యజనము చరించున్
ఈత్రయము నుపచరింతురు
పాత్రతశూద్రులు స్వధర్మపరులై పురిలో. 76

మనుజేంద్రుఁడు ధీమంతుం
డనఘుమనువు పూర్వమెట్టులుపురము పరిర
క్షణమును బొనరించెనొ నేఁ
డు నటులె యిక్ష్వాకువరిన్పృడుఁడు రక్షించెన్. 77

* నలువర్ణంబులు తమ క
ర్మల వర్జించి పరకర్మల గ్రహియించినచో
నిలచినిలుపుఁ దత్కర్మల
వెలియిడి శిక్షించు నృపతి విప్రులపై నన్. 78

జ్వలితానల కల్పులు పే
శలులు సువర్చసులు విద్యసాంతమెఱుఁగు యో
ధులచే నాపురి నిండె ద
రులలోనఁ బరున్న కేసరులచేఁబోలెన్. 79

ఆకాంభోజమునను బా
హ్లికమున వనాయుదేశ పృథివి *నదములన్
శ్రీకరమయి పుట్టు హయా
నీకం బుచ్చైశ్రవ హయ నిభమొప్పుఁ బురిన్. 80

హిమవద్వింధ్య మతంగ పర్వతములం దేపారజన్మించి భూ
రిమదోన్మత్తములైన, బల్సిన, మహాద్రింబోని యేనుంగులన్
ప్రమదైరావత వామనాంజనమహాపద్మాదిదిక్కుంభి వం
శములన్‌బుట్టిన యేన్గులన్ దగి పురాస్థానంబు నిండారెడున్. 81

** మృగమును మంద్రము భద్రము
మృగమంద్రము మంద్రభద్ర మృగ భద్రంబుల్
మృగ మంద్ర భద్రమనగాఁ
దగు గిరి నిభ మదగజములఁ దత్పురి నిండెన్. 82

---

* నదములన్=సింధు నదములందు. సింధు నదములందు గుఱ్ఱములు పుట్టునని ప్రసిద్ధి కనుకనే సైంధవములని వానికి పేరు కలిగినది.

** భద్రా మంద్రా మృగాశ్చేతి, విజ్ఞేయా స్త్రివిధా గజాః, క్రమేణ హిమవింధ్య సహ్యజాః. హిమాద్రి యందు పుట్టు గజములు భద్రములని, వింధ్య పర్వతములందు పుట్టువానిని మంద్రములని, సహ్య పర్వతములందు పుట్టువానిని మృగములని పిలుతురు. మృగ మంద్రాదులు సంకీర్ణ జాతులు.

ఆపురి రెండు యోజనములై మనుజేంద్రుని మూలదుర్గ సం
వ్యాపృతమౌచు శత్రుభట పంక్తికి యుద్ధము చేరానిదై
యేపున సత్యనామ మగు, నిందు వసించి జగంబు నేలు నౌ
రా! పటుతేజుఁడౌ దశరథాఖ్యుఁడు చుక్కలఁ జంద్రు పోలికన్. 83

సార్థ కాఖ్యయై దృఢ తోరణార్గళ మయి
చిత్రగృహ రాజభాసియై శివకరమయి
నర సహస్ర సంకుల మగు నా యయోధ్య
నృపుఁడు దేవేంద్రసముఁడు శాసించుచుండె. 84

—: అమాత్యాదుల వర్ణన :—

అట్టి మహాత్ముఁడును ఇక్ష్వాకువంశస్థుఁడునైన యా దశరథునికి గుణవంతులును. మంత్రజ్ఞులును, ఇంగితజ్ఞులును, నిత్యము ప్రియముగానుండు రాజహితమునం దాసక్తిగలవారునైన *యమాత్యులు ఎనమండుగురు గలరు. ఆ వీరుఁడైన దశరథుని యమాత్యులు యశస్వులు, శుచులు, ఎల్లపుడు రాజకృత్యములందు అనురక్తులునై యుందురు. వారు ధృష్టి, జయంతుఁడు, విజయుఁడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడు అను పేర్లు గలవారు. 85

వసిష్ఠుడు వామదేవుఁడు అను ఋషిశ్రేష్ఠులు అతనికి ఋత్విక్కులు. వీరు ఋత్విజులే గాక **మంత్రులునుగూడనై యుండిరి. ఇట్లే వీరు గాక యితరులైనవారును మంత్రులుగా నుండిరి. వారు సుయజ్ఞుఁడు, జాబాలి, కాశ్యపుఁడు, గౌతముఁడు, మార్కండేయుఁడు, దీర్ఘాయువు, ద్విజుఁడైన కాత్యాయనుడు అను మహర్షులు. ఈ మహర్షులతో నెవుడును ఋత్విక్కులు గూడి యుందురు. వీరందఱు వంశ పరంపరగా వచ్చినవారే. ఆ యమాత్యులును మంత్రి ఋత్విజులును. 86

* అమాత్యులు=దేశాధికార్య నిర్వాహకులు.
** మంత్రులు=వ్యవహార ద్రష్టలు.

విద్యావినీతులై విజితేంద్రియులయి త
ప్పొనరించుటకు సిగ్గు పొందువారు
చతురులై మతిఁ బరస్పర మనురక్తులై
బహువిద్యులై నీతిఁ బరఁగువారు
శ్రీమంతులై వీరులై మహాత్ములయి ప్రా
ప్రజ్ఞులై కీర్తితోఁ దనరువారు
రాజ్య కార్యంబుల శ్రద్ధతో మెలఁగుచుఁ
జెప్పినరీతిగాఁ జేయువారు

తేజ మోర్పును గలిగి వర్తించువారు
పల్కుటకు ముందు స్మితమొల్కఁ బలుకువారు
కామమునఁ గాని క్రోధంపుఁగతనఁ గాని
అనృత మెన్నండు వారు మాటాడఁబోరు. 87

స్వీయులయెడ రిపులయెడన్
చేయఁబడుచు నున్నదియును జేయఁబడినదిన్
చేయఁగ చారులు కోరిన
దాయెది తెలియనిది లేద యమాత్యులకున్. 88

వ్యవహారంబులఁ గుశలులు
ఎవి సౌహృదములొ నృపతి పరీక్షించినవా
రవసరము గల్గినపుడు
నవిరతమును శిక్షచేతు రాత్మజునైనన్. 89

ధనకోశ సంగ్రహణలో
ఘనరక్షక సైన్యబలము గ్రహియించుటలో
మనసుంతురు, నేరము చే
యనిచో హింసింపఁదలఁప రహితునిగానీ. 90

ప్రకటోత్సాహులు రాజనీతిపరులున్ రాష్ట్రము శుద్ధాత్మర
క్షకులన్ బ్రాహ్మణకర్మ క్షాత్రమును హింసం జేయుకే నిల్పు పో
షకులన్, వీరులు కోశవర్ధకులునై సర్వైకమత్యంబుతో
సకలంబారసి శిక్ష సల్పుదురు దోషాదోష నిర్ణేతలై. 91

పురమున రాష్ట్రమున నయిన
నరుఁడు మృషావాది యెట గనంబడఁ డొకఁడున్
పరదార రతుఁడుఁ గానీ
దురాత్ముఁడును గాని మనకు దొరకఁడొకండున్, 92

పురవరమది, రాష్ట్రంబును
నిరతంబు ప్రశాంతమగుచు నెగడును, ఆనా
గరికులు సువస్త్రము మనో
హర వేషము గని సుశీలులయి యుందురటన్. 93

నీతినేత్రాల మేల్కొను నృపతి హితము
కోరి, గురువైన పార్థివు గుణములెంచి
విక్రములయి నిశ్చయబుద్ధి వెలసియెల్ల
కడలఁ గనుట విదేశాల ఖ్యాతి గాంత్రు. 94

సంధి విగ్రహ తత్త్వంబు సరిగనెఱిగి
ప్రకృతి సంపద గల్గి మంత్రము దాచ
శక్తులై సూక్ష్మబుద్ధులై సతము ప్రియము
పలుకువారయి ఘననీతిఁ దెలిసియుంద్రు. 95

ఇటువంటి గుణములుండిన
పటుతరమంత్రులను గూడి పావనుఁడు నృపుం
డిట చారచక్షుయి ప్రజ
నటు రంజించుచు ధర్మమారసి యేలెన్ 96

సుంత యధర్మమేని మనసుం జొరనీక జగాల ఖ్యాతుఁడై.
యెంతొ వదాన్యుఁడై సముఁడు నెక్కుడు నొరిపుఁ జెంత బోక సా
మంతుల వంచుచున్. జదిపి మార్గపు ముండ్లను సత్యయుద్ధుఁడై
యెంతయు మిత్రులం గలిసి యేలె మహేంద్రుడు స్వర్గముంబలెన్. 97

అనురక్తులు కుశలులు క్షము
లును మంత్రహితులగు మంత్రులు గలుగ సతతం
బును పురుష వ్యాఘ్రుఁడు దీ
ప్తిని గనె దేజములచే నుదిత సూర్యుడటుల్ 98

—: దశరథుఁడు అశ్వమేధము చేయసంకల్పించుట :—

వ. ఇట్టి ప్రభావము గల వాఁడును ధర్మజ్ఞుడును మహాత్ముఁడును నగు దశరథుఁడు వ్రతాదితపము లాచరించినను వంశకరుం డైనసుతుండు కలుగక పోవుటవలన తనకు సంతానమెట్లు కలుగునా యని చింతించుచు అశ్వమేధ యాగము చేసినచో సుతుండు కలుగు నేమో యని ఆ యాగము ఎందుకు చేయరాదు? ఆ యజ్ఞము చేయవలసినదే యని నిశ్చయించి కృతాత్ములగు మంత్రులతో నాలోచించెను. అట్లు ఆలోచించి ధర్మాత్ముఁడు మహాతేజుఁడు నగు నారాజు సుమంత్రుని జూచి "ఓ మంత్రిసత్తమా నా గురువులను పురోహితులను సత్వరమె తీసికొని రమ్ము" అని పలికెను. అంతట సుమంత్రుడు త్వరితగతితో పోయి వేదపారగులైన వారందఱను రప్పించెను. పిదప దశరథుడు సుయజ్ఞుని, వామదేవుని, జాబాలిని, పురోహితుడైన వసిష్ఠుని ఇంక ద్విజోత్తములను పూజించి యీ విధముగా ధర్మార్థ సహితమును, మధురము నైన వాక్యము పలికెను. "వంశకరుండైన సుతునికయి తపించుచున్న నాకు సుఖ మన్నది లేదు. అందుకై యశ్వమేధయాగము చేయవలయునని నాకు బుద్ధి కలిగినది. అందుచే శాస్త్రోక్త మగు విధిచే యజ్ఞము చేయఁ గోరుచున్నాను. నేను నా కోరికను ఎట్లు పొందగలనో ఆలోచింపుడు" అని. 99

పిదప వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులు (బ్రహ్మవేత్తలు) బాగుబాగు అని రాజు ముఖమునుండి వెలువడిన వాక్యములను మెచ్చుకొని మిగుల ప్రీతిం జెంది "ఓ రాజా! ఆ యజ్ఞమునకై సామగ్రి సమకూర్చుము. అశ్వము గూడ వదలుము. సరయూనది కుత్తర తీరమున యజ్ఞభూమి ఏర్పఱచుము నీకిష్టమైన కుమారులు గలుగుదురు. పుత్రులకై నీకీ ధర్మబుద్ధి కలిగినది. మంచిది" అని పలికిరి. 100

అపుడు పార్థివుడు ఆద్విజుల మాటను విని సంతోషించి వెంటనే అమాత్యులను రావించి సంతానము కలుగు నను సంతోషముచేఁ గలిగిన యానంద భాష్పములచే పర్యాకుల మైన కన్నులతో నాగురుల యాజ్ఞననుసరించి మీరు యజ్ఞసామగ్రి కూర్చుఁడు. సమర్థులైన భటులును, ముఖ్యులైన ఋత్విజులును కూడ అనుసరింప అశ్వము వదలబడుఁగాక. సరయూనదికి ఉత్తర తీరమున యజ్ఞభూమిని ఏర్పాటు చేయుడు. కల్పశాస్త్రోక్త ప్రకారముగా యథావిధిగ శాంతులు వర్ధిలుఁగాక. అట్టి యజ్ఞమును మహీపతు లందఱును చేయఁగలరా! ఈ శ్రేష్ఠమైన యజ్ఞములో కష్టమైన యే యపరాధమైన జరిగినచో దానికై బ్రహ్మరాక్షసులు అవకాశము చూచుచుందురు. యథావిధిగా యజ్ఞము చేయని యజమానుఁడు నశించును. కాన నాయజ్ఞము యథావిధిగా సమాప్తి పొందు నట్లు సాధనములతో సమర్థులను నియోగించి చక్కగా తద్విధానమును జేయుడు అని చెప్ప అట్లేయని మంత్రులు పార్థివేంద్రుని వాక్యములను మన్నించి పలికిరి. ధర్మజ్ఞులైన యాద్విజులును రాజసత్తముని ఆశీస్సులతో వర్ధిల్లఁజేసిరి, ఆ మంత్రులు రాజువద్ద సెలవు గైకొని వచ్చినట్లు తమ తమ గృహంబుల కరిగిరి. 101

అంత రాజు విప్రులను సాగనంపి ఋత్విజులు సందేశించిన ప్రకారము క్రతువును చేయుదముగాక అని పలికి వచ్చిన సచివులను గూడ వారి గృహముల కనిపె. పిదప స్వమందిరమున కరిగి మహామతి యయిన యాసురేంద్రుఁడు హృదయంగమలగు తన పత్నులను జూచి మీరు ఇంతటినుండి దీక్ష పూనుడు. సుతులకై నేను యజ్ఞ మొనరించెదను" అని పలికెను. 102

అంత అతిమనోహర మైన యారాజు మాటలువిని సువర్చస లయిన యాతని కాంతల ముఖ పద్మములు మంచుకాలము గడచిన పిదప పద్మములవలె వికసించెను. 103

—: రోమపాదుని కథను సుమంత్రుడు దశరథునికిఁ జెప్పుట :—

విని సర్వంబు రహస్యమందు నృపుతో విజ్ఞాని సూతుం డనెన్
"ఘనులౌ ఋత్విజు లిట్లు చెప్పినది యుక్తంబౌ నిదే నేను విం
టిని పూర్వంబు, సనత్కుమారుఁ డనఘుండీగాథ మౌనుల్ వినన్
వినిచెన్, సంతతి నీ కెటుల్ గలుగునో పృథ్వీశ యాలింపుమీ. 104

అనఘుం డుండె విభండకుం డనుసుతుం డాకాశ్యపబ్రహ్మ. కా
తనికిం బుట్టును. ఋశ్యశృంగుఁ డనుపుత్రశ్రేష్ఠుఁ డాతం డిఁకన్
వనమం దెప్పుడు నుండుచున్ వనచరుండై మౌనియై యుండి దే
నిని కొంచెం బెఱుఁగండు తండ్రివెనుకే నిత్యంబు వర్తించుటన్. 105

గురుకులమందు గేహమునఁ గూడ యథావిధి బ్రహ్మచర్యమున్
జరపును నామహాత్ముఁ, డిదిసర్వజగాలఁ బ్రసిద్ధమౌ, మహీ
సుర లది యాత్మమెచ్చెదరు, చోద్యముగానిటులుండి యగ్నికిన్
వరయశ మొందుతండ్రికిని బాగుగ సేవలు చేయు నెప్పుడున్. 106

ఇదియిట్లు లుండనిఁక నీ
యదన ఘనుఁడు రోమపాదుఁ డనురాజు జగ
ద్విదితయశుఁ డంగదేశము
లఁ దనరును, బ్రతాపుఁడు చతురంగ బలుండున్. 107

కష్టము లెంతమాత్రమును గల్గని యట్లతఁ డాధరన్ బ్రజా
భీష్టత నేలుచుండ నట నెట్టియధర్మమొ యౌటచే ననా

వృష్టి సుదారుణం బగుచు నేర్పడుఁ బ్రాణి భయమ్ముంబు గా ననా
వృష్టియు సంభవించుటయుఁ జింతిలి పార్థివుండికన్. 108

శాస్త్రవృద్ధులౌ బ్రాహ్మణసత్తములను
నపుడు రావించి వారితో నృపుఁడు పలుకు
"తమరు శాస్త్రధర్మలు లోకధర్మవిదులు
దీని కిపుడు ప్రాయశ్చిత్త మానతిండు. 109

అనఁగ వేదపారగులు బ్రాహ్మణులు నిట్లు
ప్రభునితోడఁ బల్కిరి "రావిభండక కుమారు
ఋశ్యశృంగు రావించి పూజించి విధిగ
శాంత మగుస్వాంతమున సుతన్ శాంత నిమ్ము". 110

అని యావిప్రులు చెప్ప రాజు విని, "యేదర్థం బుపాయంబు పూ
జ్యుని రావించుట. కంచు మంత్రితతితో యోచించి యామౌనిఁ బి
ల్వ నమాత్యాళిఁ బురోహితున్ బనుచుడున్ వారున్‌జనన్‌లేక భూ
పునిఁ బ్రార్థించి యుపాయమున్ వినుతు రాపుజ్యాత్ము రావింపఁగన్. 111

గణికలచే రావింపఁగ
నను వగునాపూజ్యుని. నిటులగునెడ శాపం
బును గలుగ దనుచువారు వి
భు నాజ్ఞ రప్పింతురు పూజ్యుఁ బురగణికలచే. 112

* అంతట ఋశ్యశృంగు శుచి యైన పవిత్రము నౌ నమాయిక
స్వాంతముచే సచేతనమె యయ్యును నాప్రకృతిస్వభావమే
వింతగ మాఱు వర్షములు విశ్వము నంతను గప్పఁ, బ్రాకృత
స్వాంతమె పుల్కరించుఁ బతి హర్షిలి శాంతను మౌని కిచ్చెడున్. 113

---

* శాంత దశరథునికి కౌసల్యయందు పుట్టెను. పిదప ఈమెను దశరథుఁ డొక రాజుకు ఈయఁబోఁగా పరశురాముడు వచ్చి రాకొమరున కిచ్చినచో నిన్ను చంపెదను. నీవు ఈమెను మునికుమారుని కిమ్మని చెప్పి పోయెను. అపుడు ఆమెను రోమపాదుఁ డడుగఁగా అతనికి దత్తకుమారినిగా ఇచ్చెను.

అటువంటి ఋశ్యశృంగుం
డిటు జామాత యగునాతఁ డీగతి నీకున్
ఇటసుతులఁ బ్రసాదించెడు
నటంచు సనత్కుమారుఁ డనె వింటె ప్రభూ ! 114

అనుచు సుమంత్రుఁడు చెప్పన్
విని దశరథుఁ డంత దాని వివరంబుగనే
వినిపింపు మని యడుగుటయు
వినిపించె సుమంత్రుఁ డపుడు విస్తరరీతిన్. 115

## —: ఋశ్యశృంగుని కథ :—

వ. అని రాజిట్లు అడుగ సుమంత్రుఁడు రాజుతో నిట్లనియె. "రాజా ! ఆ ఋశ్యశృంగుఁ డెట్లు రావింపఁబడెనో విస్తరముగఁ జెప్పెదను. నీవును, మంత్రులును వినుఁడు. 116

ఇక నమాత్యులతోఁ బురోహితుఁడు కూడి
రోమపాదునితోడ వాక్రుచ్చె నిట్లు
దేవ ! మేమందఱము చింతించినట్టి
యాయుపాయము నిరపాయ మెటులుఁ గనిన. 117

శమచిత్తుం డగుఋశ్యశృంగుడు తపస్స్వాధ్యాయ నిష్ఠుండు ని
త్య మరణ్యాల భ్రమించువాఁ డతివలన్ దానెప్పుడున్ గన్న పా
పమువం బోయిన వాఁడు కాఁడు, విషయవ్రాతాల్ సుఖం బెంతమా
త్ర మెఱుంగండు, ప్రపంచ పద్ధతులగంధం బేన్ గనండెన్నఁ డేన్. 118

మనుజస్వాంతము క్షోభపెట్టెడి ప్రియం బౌనింద్రియార్థాల నా
సను గల్గించి ప్రలోభ పెట్టి పురికిన్ నమ్మాన్యు రప్పింత మిం

కను నాలస్యము కూడ, దంక మగుసింగారించుకొన్నట్టి యా
గణికల్ సత్కృత లేగి తెత్తురి ముని పైకంబౌ నుపాయంబులన్. 119

వ, అని వచింప విని రాజు "అట్లె" అని పురోహితునితోఁ జెప్పఁగా పురోహితుడు మంత్రులకును ఈ సంగతి వినిపింప వారును అపుడే అట్లే చేసిరి. ప్రముఖులగు గణికలు దాని నాకర్ణించి ఆ మహావనమును ప్రవేశించిరి. వారు అతని యాశ్రమమునకు దూరము కాని ప్రదేశములో నుండి ఋషి పుత్రుఁడును ధీరుఁడును నిత్యము ఆశ్రమమందు నివసించువాఁడు నగు నా ఋశ్యశృంగుని దర్శింప అనేక యత్నములు చేయసాగిరి. 120

తండ్రి లాలింప తుష్టుఁడై తపసి నిత్య
మాశ్రమమునుండి యడు గైననరుగఁ డెటకు
పుట్టినది మొదల్ స్త్రీఁగాని పురుషునేని
పురిని రాష్ట్రాన నున్న వేన్ మున్నుఁ గనఁడు. 121

ఒకమా రాముని ఋశ్యశృంగుఁడు హతా త్తున్నట్టుగా నుండి యెం
దుకొ వారున్నెడ కేగుదెంచి యచటన్ పూఁబోండ్ల వీక్షించెఁ ద
న్నికటంబందు విచిత్రవేష లయి క్రొందీయుపై యొప్పుగాం
తుకతోఁ బాడుచుఁ జేరి యా ప్రమదలున్ పూజ్యాత్ముఁ బ్రశ్నిం
త్రిటుల్. 122

ఎవ్వఁడ వీవు బ్రాహ్మణుఁడ యేమి యొనర్చుచు నుంటి ఘోరమౌ
నివ్వని, నిర్జనం బయిన యిచ్చట నొంటిఁ జరింతు వేల, మే
మివ్విషయం బెఱుంగ మది నిచ్ఛజనించె తగన్ వచింపుమం
చవ్వనితల్ మునిం గని ప్రియంబున మెల్లనఁ బ్రశ్న చేయఁగన్. 123

అది వఱ కెన్నఁడున్ గనని యాకృతితో మధురంపు రూపుతో
సుదతులు కాన నుండుటయుఁ జూచి విభండక సూనుఁ డంతటన్
హృదయమునందు స్నేహము జనించుటచేఁ దనతండ్రిసంగతిన్
విదితము చేయఁ గోరిక జనింప వచించెను వారితో నిటుల్. 124

"మాతం్డి విభండకుం డను
నాతఁడు, నేనాతనికిని నౌరససుతుఁడన్
భూతలిని ఋశ్యశృంగా
ఖ్యాతుఁడ నేఁ జేయు కర్మ యది విదితంబే. 125

మాయాశ్రమపదమును శుభ
దాయక మిందె గలదు * శుభదర్శనులారా!
మీయందఱ కిటఁ బూజలఁ
జేయుదును యథావిధిగను జేకొన రండీ. 126

అను ఋషిపుత్రు వాక్కు విని యందఱ కంతఁ దదాశ్రమస్థలిన్
గనుఁగొను బుద్ధి పుట్టుటయుఁ గ్రక్కున వారలు వానితోడుతన్
జని, రిఁక వారి కాతఁడు వినమ్రతఁ బూజలు సల్పి యిట్లనెన్
గొనుఁ డిదె పాద్య మర్ఘ్య మిదిగో ఫల మియ్యది కందమూలముల్.
127

అని యర్పింప గ్రహించి ప్రీతి నఖిలం బాతండు గావించు న
ర్చన కత్యుత్సుకలై విభండకునివల్లన్ భీతలై శీఘ్రమే
వనమందుండి చనం దలంచి మునితో వాక్రుచ్చి రీరీతి బ్రా
హ్మణ! మా శ్రేష్ఠఫలంబులున్ గొను శుభంబౌఁ గాత, భక్షింపుమీ. 128

అని వారెల్లరు నంత వానిని దృఢంబౌ కౌఁగిటం గ్రుచ్చి యిం
కను నానందము నొంది వానికి ననేకంబై న యుండ్రాళ్ళు భ
క్ష్యనికాయంబును నీయఁ బుచ్చుకొని యాస్వాదించి తేజస్వి యా
వనవాసుల్ మును పెప్డుఁ జూడని వెవో పండ్లంచు నెంచెన్ మదిన్. 129

* ఋశ్యశృంగునికి స్త్రీపురుషభేదము తెలియదు కనుక శుభదర్శను
లారా! అని పుంలింగప్రయోగము చేసెను.

* అట్టలుగాఁ గట్టి బిట్టుగా బిరు సెక్కి
చిక్కెక్కిన తనజటల్ నొక్కి చూచి
నునుఁబట్టు కుచ్చులన్ బోని మెత్తనివారి
కేశపాశము మెల్లఁ గేల దువ్వి
ఎండకు వానకు బెండయి బీటలు
వాఱిన తనయొడల్ తీరు చూచి
బంగారు సౌరులు పరిమళంబులు చిమ్ము
వారల మేని యొయ్యార మరసి

కొసగ తలమొల్చు నొకతనకొమ్ము పట్టి
యొడఁదపయి వారిరెండు పాలిండ్లు నిమురు
స్త్రీపురుష భేద మెఱుఁగని యాపవిత్రుఁ
డిది సతుల తపోమహిమగ మదిఁ దలంచె. 130

వ. అంత కొంత తడవునకు. 131

ఆముని జనకు వలన భయంబు మొంది
తపసువేళ మించెఁ బోయెదమ యటంచు
వంక యిడి విప్రుసెలవంది వనిత లెల్ల
వెడలిపోవ, విభండకు కొడుకు పిదప 132

వనితల్ పోయిన దాది బెంగగొని యస్వస్థాత్ముఁడై సెమ్మనం
బునఁ జింతన్ దిరుగాడుచున్ వెదకుచున్ మున్ముందె మర్నా డటన్
వనితల్ నిల్చినచోటి కేగి మివులన్ సౌందర్య శృంగార రూ
పిణులౌ నాగణికాగణంబు గనె సుప్రీతాంతరంగంబుతో. 133

వ. అటు వచ్చిన యావిప్రుని ఋశ్యశృంగుని నమాయకునిం జూచి యావనిత లందరు హర్షంబు బొందు మానసంబులతో వానిని సమీపించి యిట్లనిరి. 134

---

* ఇది అనువాదకుని వర్ణన.

మా యాశ్రమమునకున్ ర
మ్మో యీ! సౌమ్య! ఎన్నో యున్నవి చిత్రం
బై యుండు పండ్లు దుంపలు
ఆయెడను నిటులె యగుఁ గడు ధ్యాస తపస్సుల్. 135

హృదయంగమ మ్మయిన యా
సుదతుల పలు కాలకించి శుచి యగు ముని యా
మదవతులతోడఁ జనుటకు
హృదిఁ దలచెను, గైగొని చని రితనిని వారున్. 136

స్త్రీ పురుష భేద మెరుఁగని
యా పుణ్యాత్ముఁ డటు వచ్చినంతనె జడమౌ
నా ప్రకృతి కరఁగిపోయియె
యేపారఁ గురిసె ప్రపంచ హృదయము పొంగన్. 137

వ. వర్షముతోపాటు తమ దేశమునకు విచ్చేసిన తపోధనుఁ డైన యా విప్రుని కెదురేగి యారోమపాద నరేంద్రుడు వినయ వినమ్రుఁ డయి శిరసు భూమిని సోక నమస్కరించి యతనికి యథావిధిగా నర్ఘ్య మిడి ధ్యాససహితుడై తాను గణికలచే రప్పించి కావించిన యీ మహాపరాధమును మన్నింప వేడి విప్రునకు ఆగ్రహము గలుగకుండుఁగాక యని అతని ననుగ్రహింపఁ జేసి కొని అతనిని అంతః పురమునఁ బ్రవేశపెట్టి యథావిధిగ తన తనయను శాంతను ఒసంగి శాంత మైన మనస్సుతో తాను ప్రహర్షమును పొందె. అంత నామహా తేజుఁ డయిన ఋశ్యశృంగుఁడు సర్వ కామములచేఁ జక్కఁగఁ బూజితుం డయి భార్య శాంతతో అటు నివసించి యుండెను. 138

## సనత్కుమారుఁడు చెప్పిన వాక్కులు సుమంత్రుఁడు దశరథునికిఁ జెప్పుట.

వ. ఓ రాజేంద్రా! ఆ దేవప్రవరుం డైన సనత్కుమారుఁ డింకను ఏమి చెప్పెనో అది నీకు హితమైనయదియు. దానిని విను మని సూతుఁడిటు చెప్పందొడఁగె. 139

శ్రీమంతుఁడు సత్యవ్రతుఁ
డౌ మహితుఁడు ధార్మికుండు నగు దశరథుఁ డన్
నామము గలరాజు సకల
భూమండలి నేలుచుండు భూత హితుండై. 140

ఆ విభున కంగదేశపు
భూవిభుతో మిగుల మైత్రి పొడమును, మఱియా
క్ష్మావిభున కెంతయు నను
భావముగల శాంతయనెడు వర సుతకలుగున్. 141

అంగ దేశంబు పాలించు నవనిపతికి
రోమపాదుఁ డనియెడు పుత్రుండు కలుగు
అతని దగ్గఱకును మహాయశుడైయైన
నృపతి దశరథుం డేగి యీరీతిఁ బలుకు. 142

ఓయి ధర్మాత్ముఁడ! యనపత్యుఁడను నేను
నీవు పనుప శాంతాపతి ఋశ్యశృంగుఁ
డరుగుదెంచి నాకును సుత ప్రాప్తికొఱకు
కులము నిలుపంగ యజ్ఞంబు సలుపుఁ గాక. 143

అనెడు రాజుమాటలు విని మనసులోన
నుంత చింతించి యాపుత్రవంతు డైన
శాంత పతి ఆత్మవంతుఁ డౌక్ష్మాపుఁడనుప
తనపురికిఁ దీసికొని పోవు దశరథుండు. 144

భూపతి యామహీసురుఁ బ్రమోదముతోడఁ బ్రతిగ్రహించి సం
తాపము వీడి యజ్ఞము నొనర్పుఁ గృతాంజలియై మహాయశః
ప్రాపక మొంది ధార్మికుఁడు యాగముకై ప్రజకై దివంబుకై
యేపున ఋశ్యశృంగు వరియించును ఋత్విజుఁగా ద్విజోత్తమున్. 145

క్ష్మాపతికి నాద్విజుని యనుగ్రహమువలన
అమిత విక్రము లగునల్వు రాత్మజులును
గలుగుదురు, వంశమును నిల్పఁ గలరువారు
సకలలోక విశ్రుతులై యెసఁగగలరు. 146

అనుచు మున్ను దేవయుగంబునందుఁ జెప్పె.
దేవముఖ్యుడు భగవానుఁడై వెలుంగు
నాసనత్కుమారుఁడు: కాన నరసి నీవె
పురుషవర్య! మహారాజ! త్వరితగతిని. 147

ఘన మౌవాహనముల్ బలమ్ము గొలువంగాఁ బోయి యాఋశ్యశృం
గుని రావింపు మటంచుఁ బూర్వకథ వాక్రువ్వన్ సుమంత్రుండు వా
నిని నాలించి. వసిష్ఠుతో నపుడు దానిన్ జెప్ప యంతఃపురం
బును మంత్రుల్ చనుదేఱ నాద్విజుఁగనన్ బోయెన్ బ్రమోదంబుతో. 148

వ. మార్గమునఁ గలుగు వనములను, నదులను, మెల్లమెల్లగా క్రమ
మున దాటి యా మునిపుంగవుడు వసించు దేశంబు చేరి రోమపాదుని సమీప
మునఁ బావకునిబోలెఁ బ్రకాశించు నాద్విజ శ్రేషుని గాంచి దశరథమహారాజు
యథావిధిగ సకల విధ పూజలం గావించె. అంత, 149

ఆ రోమపాదుఁ డంతట
నారాజు తన సఖుఁ డగుట, నమ్ముని సుతుతోఁ
గూరిమితోఁ జెప్పి తనకు
నా రాజునకుఁ గల బాంధవాదులఁ దెలిపెన్. 150

వ. మరియు నారోమపాదుండు తన్నుఁ బూజింపగా సత్కారములు
వడసి యట ఏడెనిమిది దినము లుండి యొక్కనాఁడు దశరథుం డారోమపా
దునితో నిట్లనియె. 151

ఓ రాజ ! విశాంపతి ! నీ
గారాబుకుమార్తె శాంత ఘనుఁ డగుపత్రితో
నారమ్యపురికి వచ్చుత
ఆ రాజ్యమునందు గొప్ప దగుపని కలిగెన్. 152

వ. అనుటయు 153

అటులే యంచును రాజు మౌని గమసం బత్యాదృతిన్ మెచ్చి తా
నిటు నీవిప్పుడే భార్యతో నరుగుమీ పృథ్వీశు ప్రో లంచుఁ జె
ప్పుటయున్ మౌని యతండు నట్లె యనుచున్ భూనాథుతో నంత పో
వుటకున్ వెంటనె బైలుదేరె విభు నామోదంబుతో ప్రీతితో. 154

ఒండొరు దోయిలించి మది నొప్పెడి మైత్రిని తొమ్ము తొమ్ముతో
మెండుగఁ గ్రుచ్చి కౌగిలిడి మిత్రులు నిర్వురు వారు రోమపా
దుండును తారుఁదాదశరథుండుఁ బ్రమోదముపొంది రాసఖుల్
రెండియు వీడుకొల్ప రఘువీరుఁడు ప్రోలికి బైలుదేఱుచున్. 155

నగరిన్ వేగ యలంకరింపుఁడు పథిన్ బన్నీరు చిల్కుండు తి
న్నగ మార్గంబులు శుభ్రపర్చి మిపులన్ సాంబ్రాణిగంధంపుఁ బొ
ళ్ళగురున్ వత్తుల ధూప మేయుఁ డిఁక బార్లైతీరి జెండాలు చ
క్కఁగ సుస్వాగతతోరణవ్రజములన్ గట్టుండి యంచున్ వడిన్. 156

పౌరులకు విభుఁడు త్వరగాఁ
జెరెడు దూతలకు నెల్ల చెప్పియు ననుపన్
వా రనినదే తడవుగ
పౌరులు నెఱవేర్చిరి పతి పనిచిన నెల్లన్. 157

దశరథుఁడున్ వసిష్ఠుఁడును తత్పురి వారల కేది పన్చిరో
విశదముగా సమస్త మది ప్రీతిఁ బొనర్చియు వేగ దూతలన్
దశరథుపాలి కంపి యటుదాని నివేదనచేయఁగాఁ బ్రజల్
దశరథు డాయలంకృతపురంబును జొచ్చె ద్విజేంద్రుతోడుతన్. 158

శంఖ దుందుభి తూర్య ఘోషములతోడ
ఘనముగా ద్విజవరు ముందు నునిచి కొనుచు
పురిఁ బ్రవేశించు నింద్రాభు భూమివిభునిఁ
గని మహానంద మొందిరి జనము లెల్ల. 159

ద్విజుని సంతిపురంబు ప్రవేశపెట్టి
శాస్త్రదృష్టమౌ రీతిఁ బూజలను జరిపి
మునిని రావించి నందుకు మోద మొంది
తన్ను ధన్యుఁగఁ దలపోసె ధరణివిభుఁడు. 160

సువిదితుఁడు భర్తతో వ
చ్చు విశాలాక్షి సతి శాంతఁ జూచి మిపులఁ బౌ
ర విశాలాక్షులు కనుఁగవ
తొవమాలలు వైచుచుఁ దులతూగిరి ప్రీతిన్. 161

వనితలు పూజలు సల్పఁగ
ఘనుఁడౌ భూపతి విశేష గౌరవముంతో
మునివరు ఋత్విజుఁ దన్నును
గన; సుఖముగ శాంత కొంత కాలం బుండెన్. 162

## —: అశ్వమేధయజ్ఞ ప్రయత్నము :—

అంతఁ గొంత గతింపఁ గాలము హాయి గూర్చు వసంతమే
సంతసాన నలంకరించుక సర్వలోకుల స్వాంతముల్
సంతతంబు వెలార్పఁ జేయుచు రాఁగ, రాజు నెడందలో
సంతరించెను యజ్ఞభావన సర్వులున్ ముద మొందఁగన్. 163

పిదప దేవఋషి యయిన యా విప్రవరుని
శిరసు వంచి నమస్కరించియుఁ బ్రసన్నుఁ
జలిపికొని వంశము నిల్వ సంతతికయి
యిష్టి యాచరింప వరించె ఋత్విజుఁగను. 164

వ. పిదప ఆరాజుచేఁ జక్కఁగ సత్కృతుండయి యా ఋశ్యశృంగుఁడు అట్లే యని రాజుతోఁ బలికి మరియు "సామగ్రి సమకూర్చుము. నీయశ్వమును వదలుము. అందమైన ప్రదేశమున యజ్ఞభూమిని ఏర్పఱచుమనెను. 165

అంత మంత్రిసత్తముఁడైన సుమంత్రునితో రాజిట్లనియె. "ఓసుమంత్రా వెంటనే ఋత్విజులును, బ్రహ్మవాదులైన సుయజ్ఞుని, వామదేవుని, జాబాలిని కాస్యపుని, పురోహితుడయిన వసిష్ఠుని, ఇంకను మిగిలిన ద్విజ సత్తములను బిలువుము" అనుటయు అత్యంత విక్రముఁ డయిన ఆ సుమంత్రుఁడు త్వరగా పోయి వేదపారగులైన యా సమస్తవిప్రులను రావించెను. 166

అపుడు ధర్మాతుఁ డయిన దశరథ మహారాజు వారిని పూజించి ధర్మార్థ సహితమును మృదు మధురము లైన వాక్యము నిటు పలికెను." పుత్రులకై మిగుల ఆవేదన పడుచున్న నాకు సుఖమన్నది లేదు. అందుకై అశ్వమేధ యాగము చేయవలయునని బుద్ధి కలిగినది. కనుక శాస్త్రమునందుఁ జెప్ప బడిన కర్మప్రకారము యజింపఁ గోరుచున్నాను. ఈఋషి పుత్రుని ప్రభావము చేత నా కోరికలను పొందుదునుగాక అని. 167

ఇది విని బాగు బాగు అని వసిష్ఠుడు మొదలైన బ్రహ్మవేత్తలు పార్థివుని నోటినుండి వెలువడిన యా వాక్యముల నభినందించిరి. అవల ఋశ్యశృంగుఁడు మొదలగువారు రాజుతో నిట్లనిరి. "ఓ రాజా! సామగ్రి సమకూర్చుము నీ గుఱ్ఱమును వదులుము. సరయువునకు ఉత్తరమున యజ్ఞభూమి నేర్పఱుచుము. అన్నివిధముల అమిత విక్రము లయిన నలువురు పుత్రులను పొందెదవు. పుత్రులకై యిటువంటి ధర్మబుద్ధి పుట్టినది మంచిది అని వచించిరి. తరువాత రాజు ఆ ద్విజుల మాటల నాలకించి సంతోషముతో శుభాక్షరములు గల యావాక్యమును అమాత్యులతోఁ బలికెను. 168

"గురువుల వచనములను నాకయి శీఘ్రముగా సామగ్రి సమకూర్పుడు. సమర్థు లయిన భటులు అనుసరింప ఉపాధ్యాయునితో పురోహితునితోఁగూడ అశ్వమును వదులుఁడు. సరయువునకు ఉత్తర ప్రాంతమున యజ్ఞభూమి ఏర్పాటు చేయుఁడు. కల్పోక్త ప్రకారముగ యథావిధిగా శాంతులు వర్ధిల్లుఁగాక. భూపతులందరు ఇట్టియజ్ఞము చేయజాలరు. ఇందు ప్రమాదము కలుగ రాదు. ఈయజ్ఞశ్రేష్ఠములో ఏదైన ప్రమాదము సంభవించినచో మిగులకష్టము కలుగును. విద్వాంసు లైన బ్రహ్మరాక్షసులు ఏదొయొక ఛిద్రమును వెదకు చుందురు. యజ్ఞము పాడైనచో ఆ యజ్ఞకర్త వెంటనే నశించును. కనుక యథావిధిగ ఈ యజ్ఞము పూర్తియగునట్లు చక్కని విధానముగ చేయుడు. ఇందు పనులలో సమర్థులైనవారిని నియోగింపుఁడు. 169

అని రాజు పలుకుటయు ఆ మంత్రు లందఱు పార్థివేంద్రుని యాజ్ఞను పూజించి దానిని తగు నట్లాచరింప అవల రాజుచే అనుమతింపబడిన వారయి యాద్విజులు రాజవృషభుని యాజ్ఞను పొంది. వచ్చినయట్లు మరల ఎవరి యిండ్లకు వారుపెళ్ళిరి.

ఇంక రాజు ఆ బ్రాహ్మణోత్తములు గృహముల కరుగ మంత్రులను వీడ్కొల్పి మహాద్యుతి గలవాఁడయి స్వమందిరమున కరిగెను. 170

## —: దశరథుఁడు అశ్వమేధ దీక్షను పూనుట :—

తిరిగి వసంతము తిన్నఁగ రాఁగన్
కరముగ వత్సర కాలము నిండెన్
గురుతర శౌర్యము కూడిన రాజున్
వరతురగేష్టికి బాగుగఁ బూనెన్. 17

గురువు వసిష్ఠునికి నమ
స్కరించి తగినటు పూజ సలిపి వినయమునన్
మరియాద ముప్పిరి గొన ద
శరథుఁడు సంతతిని గోరి సరగునఁ బలికెన్. 172

ఓ భగవానుఁడ ! న్యాయం
బౌ భాతిని నాదునిష్టి పచరింపుమయా !
వైభవ మగు యజ్ఞాంగపు
శోభల లోపమ్ము నుంతచారరాదు సుఁడీ. 173

నీవు సఖుఁడవు సుహృత్తువు
నీ వుత్తముఁడ వయినమహనీయు గురుఁడవున్
నీవే భరింపనర్హుఁడ
వీవ వహింపఁదగునిట్టి యిష్టిభరంబున్. 174

వ. అని రాజు పలుక- 175

ఎది నీవెటు చెప్పితివో
యది యటులె యొనర్తు నంచు నాద్విజవర్యుం
డధిపునితోడఁ బలికి చే
యఁదగుపనులు చక్కఁజేయు నధిక శ్రద్ధన్. 176

యజ్ఞకర్మల నిష్ణాతు లైనద్విజుల
పరమధర్మాత్ములౌచు స్థాపత్యవిధుల
నిష్ఠితు లయినపెద్దల నేర్పు గలుగు
శిల్పకరుల వడ్రంగులఁ జేర్చి మఱియు. 177

ఖనకుల నట నర్తకులను గణకవరుల
శుచులు శాస్త్రవిదులు బహుశ్రుతులు నైన
పురుషవర్యులఁ బెద్దలఁ ద్వరగ నపుడు
ఆవసిష్ఠుఁడు రావించి యనియె నిట్లు. 178

వ. "మీ రందఱు రాజశాసనప్రకారము యజ్ఞకార్యమును గూర్తురు గాక. త్వరగా వేలకొలది యిటుకలు తీసికొనిరండు. బహుగుణములతోఁ గూడిన గుడారములు రాజులకు వేయవలయును. బ్రాహ్మణులకు వందల కొలఁది శుభములైన గృహములు రచింపవలయును. అవి బహువిధములైన భక్ష్యములతోడను అన్నపానములతోడను గూడి యుండఁదగును. అటులే పౌరజనులకును చాల విస్తారమైన పలు కక్ష్యలు గల సర్వసదుపాయములతోఁ గూడిన నివాసములు చేయవలయును. ఆవిధముగనే జనపదముల నుండు జనులకు బహుశోభనమైన యన్నము పెట్టవలయునే గాని యెదో లీలగా నిర్లక్ష్యముగాఁ బెట్టరాదు. వర్ణములవా రందఱు సత్కరింపబడి యెట్లు పూజను పొందగలరో యిట్లు చేయవలయును. కామ క్రోధములచే నైనను తిరస్కారము ఏమాత్రము ప్రయోగింపఁదగదు. యజ్ఞకర్మలందు ఏపురుషులైతే శిల్పులుగా నిమగ్నులై యుందురో వారిని గూడ విశేషముగా క్రమము ననుసరించి గౌరవింప వలయును. వారందఱు ధనములతోడను. భోజనముల తోడను నిండి యుండు నట్లు చేయవలయును. అంతయు చక్కఁగ విహిత మగు నట్లును ఏమాత్రము లోటు రాకుండు నట్లును చేయవలయును. వీరందఱు ప్రీతితో స్నిగ్ధమైన మనస్సుతోఁ జేయుదురు గాక." అని వసిష్ఠుడు చెప్పుటయు వారందఱు దరి కరుదెంచి "మీరు చెప్పిన దంతయుఁ జక్కఁగా చేయఁబడినదే యని తలఁచుఁడు. ఏమాత్రము లోటు చేయబడదు. మీరు చెప్పిన ప్రకారము చేయుదుము. ఏ కొంచెమైన లోటు రానీయము." అని వారు పలికిరి. 179

పిదప వసిష్ఠుడు సుమంత్రుని రావించి యిట్లు పలికెను. "ఓ మంత్రివర్యా పృథివిలో ధార్మికు లయిన నృపతులను పిలిపింపుము. అన్ని ప్రదేశములందుఁ గల బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్యులను శూద్రులనుగూడ వేలకొలదిగ సత్కరించి రప్పింపుము. శూరుఁడును, సత్య విక్రముఁడును, సర్వశాస్త్రములందు నిష్ఠ గలవాఁడును, వేదములందు నిష్ఠితుఁడును, మహాభాగుఁడును మిథిల కధిపతియు నయిన మిథిలాధిపతిని స్వయముగానే సత్కరించి రావింపుము. అతఁడు పూర్వమునుండియు మనకు సంబంధించిన వాఁడు గాన ముందు తెలిసికొని ముందుగా నీకుఁ జెప్పుచున్నాను.

స్నిగ్ధహృదయుఁడును, ఎల్లప్పుడు ప్రియముగాఁ బలుకుచు నుండు వాఁడును, మన రాజసింహునికి మిత్రుఁడును అయిన కాశీపతిని స్వయము గానే నీవు వెళ్లి రప్పింపుము. వృద్ధుడు. పరమ ధర్మాత్ముఁడును మన రాజేంద్రుని మామగారు నగు కేకయరాజును సపుత్రకముగా ఇక్కడకుఁ దీసికొని రమ్ము.

మహానుభావుఁడును, అంగ దేశాధిపతియు. రాజసింహునికి బాల్య మిత్రుఁడు, యశస్వియు నయిన రోమపాదుని బాగుగా సత్కరించి తీసుకొని రమ్ము.

ఇంకను పృథివిలోఁ గల స్నిగ్ధహృదయముగల రాజులను బంధు మిత్ర పరివార సమేతముగా శీఘ్రముగా నిటకు రప్పింపుము." అని ఇట్లు వసిష్ఠుడు పలుకఁగా విని మహాత్ముఁ డయిన సుమంత్రుడు త్వరితగతితో బాటు రాజులను రప్పించుటకయి తగు పురుషులను పంపి. ముని శాసనమును బట్టి తాను స్వయముగా వెళ్ళెను. 180

ఇంక నాయాకర్మలలో నిపుణు లైన వారందఱు యజ్ఞములో ఏది చేయఁబడినదో అది యంతయు వచ్చి ధీమంతుఁ డయిన వసిష్ఠునికి నివేదించిరి, అపు డది విని ప్రీతిపొందినవాఁడై వసిష్ఠుఁ డిట్లు పలికెను. 181

వేనికిని దిరస్కృతితోఁ
గానీ, నిర్లక్ష్యమునఁ గానీ యెపుడున్
దానము చేయఁగ రా, దటు
దానము చేసిన యెడ నది దాతనె చంపున్. 182

వ, అని వచించెను. 183

అంతఁ గొన్ని రోజులలోనె యవని పతులు
చాల రత్నాలు కానుకగా క్ష్మాతహేంద్రుఁ

డైన దశరథునికిఁ దెచ్చి యప్పగించి
యజ్ఞమును జూడ నుండిరి హర్ష మొదవ. 184

వ. అనంతరము వసిష్ఠుఁడు సుప్రీతుఁడై రాజుతో నిట్లు పలికెను. 185

పురుషవ్యాఘ్ర ! త్వదాజ్ఞను
నరపతు లరుదెంచిరి, తగునటు వారలకున్
మరియాదలు చేసితి, మిఁక
నరులును యజ్ఞంపుఁ బను లొనర్చిరి శ్రద్ధన్; 186

మనసుచేత నిర్మింపఁ బడినదివోలె
సర్వకామాలతోడను సర్వదిశల
నిండి యుండిన యాయజ్ఞ నిలయ మరసి
యింక బయలుదేఱు నృపేంద్ర యిష్టి సలుప. 187

వ. అపుడు వసిష్ఠుఁడును ఋశ్యశృంగుఁడును వచింప జగత్పతి యైన దశరథుఁడు శుభమైన దివసమున శుభనక్షత్రమున బయలుదేఱి వెళ్ళెను. పిదప వసిష్ఠప్రముఖు లైనద్విజశ్రేష్ఠులు ఋశ్యశృంగుని ముందుంచుకొని యజ్ఞ వాటికయందు యథావిధిగ యజ్ఞకర్మను ప్రారంభించిరి. 188

## —: దశరథుడు పుత్రకామేష్టి చేయుఁట :—

మరి యేడాదియు నిండఁగఁ
దురగం బెల్లెడలఁ దిరిగితొరగా రాఁగా
సరయువు నుత్తరతీరపు
దరి యజ్ఞము నొనర్చె ధరణిపుఁ డంతన్. 189

మునిని ఋశ్యశృంగుఁ దముముం దునిచికొనుచు
వేదపారగుల్ యాజకుల్ ప్రవరులు
ఆమహాత్ముఁడౌ నృపచంద్రు నశ్వమేధ
యజ్ఞమున శాస్త్రవిధిఁ గర్మ లాచరింత్రు. 190

వ. అందు మఱియు ద్విజులు త్వరగా నుపకరించు ప్రవర్గ్య మను కర్మను ఉపసద మనునిష్టిని యథాశాస్త్రముగా నాచరించి, యథావిధిగ నితర కర్మ లధికముగా నొనర్చిరి. మునిపుంగవులు సంతుష్టులై ఆయాదేవతలను పూజించి ప్రాతఃసవనము మొదలగు కర్మల నాచరించిరి. 191

ఇంద్ర దేవతాక మైన హవిర్భాగము ఇవ్వఁబడినది. అనఘుఁ డైన రాజు అభిషుతు డయ్యెను. క్రమముగా మాధ్యందిన సవనము ప్రవర్తిల్లెను. శాస్త్రప్రకారము చూచి బ్రాహ్మణపుంగవులు ఈమహాత్ము డైన యారాజునకు సాయంసవనమును ఆచరించిరి. 192

అట నింద్రాదిక దైవతోత్తముల శిక్షాభ్యస్త మంత్రాక్షత
స్ఫటికంబుల్ గొని ఋశ్యశృంగముఖు లాహ్వానించి పూజించి రం
తటహోతల్ వడి సామగాన యుతమంత్రాహ్వానముల్ మాధురీ
స్ఫుటకంఠంబులఁ బాడి వారికి హవిస్సుల్ గూర్చి రత్యాదృతిన్. 193

మరియొక గతి హోమంబులు
జరగవు మరియెవ్వి యయిన జన్నములోనన్
పొరపాట్లు గాని దొరలవు
జరపిరి యజ్ఞంబు బ్రహ్మసమముగ సర్వుల్. 194

ఆనాఁడులలో శ్రమచేఁ
గాని క్షుధవలనను గాని గాసిలువారల్
గానఁ బడరు, లేఁడు బుధుఁడు
కాని ద్విజుఁడు, శతసహచరి కాని బుధుండున్. 195

భుజియింత్రు ద్విజులు నిత్యము
భుజియింతురు శూద్రు లెపుడు ముదమున నరులున్
భుజియింతురు తాపసులును
భుజియింత్రు శ్రమణులుగూడ పూర్తిగ నెలమిన్. 196

భుజియింత్రు స్త్రీలు వృద్ధులు
భుజియింతురు రోగులేని పొట్టలు నిండన్
భుజియింతు రనిశము వారు భుజియింతురు గా
ని జనింపదు మదికి తృప్తి; నిచ్చలు రుచులన్. 197

పెట్టుఁడి; అన్నము పెట్టుఁడి
కట్టుకొనఁగనియుఁ డిండు ఘనమగు వలువల్
ఇట్టులు ప్రేరేపించుచు
నట్టులె వడ్డించినార లచటి జనంబుల్. 198

అన్నపు రాసులు పెక్కులు
కన్నులకు కొండ లంత కనఁబడఁ దొడఁగెన్
అన్నము, పానములను గొని
గ్రన్నవఁ దృప్తి గనియె ప్రతిదేశ్యుండున్. 199

వంటకపు రుచుల క్రొత్తల్
మంటికి మింటికిని సాగ శ్లాఘింత్రు ద్విజుల్
తింటి మిట "నహో తృప్తిం
గంటిమి నీకు శుభ" మనుట క్ష్మాపతి వినియెన్. 200

ఎంతయును జక్కఁగ నలంకరించుకొన్న
పూరుషులు బ్రాహ్మణులకును భుక్తివేళ
వడ్డనలు చేసి రటుపైని వారిసేవ
సలిపిరి మణికుండలముఁలు గలుగువారు. 201

కర్మకును గర్మకును మధ్య కలసి తాము
విప్రులును హేతువాదముల్ పెక్కు చేసి.
రొకరి నొకరి జయించెడి యుక్తి మీఱ
ధీరులు సువక్త లంత వాదించుకొనిరి. 202

ప్రతిదినంబును నాయజ్ఞవాటియందు
కౌశలము గల్గు ద్విజవరుల్ కలసి మెలసి
శాస్త్రవిధి మీఱకయె కర్మసముదయంబు
వృద్ధ చోదితులౌచుఁ గావించినారు. 203

అఖిల వేదాంగముల యంత మరయునతఁడు
వ్రతము పూన నతఁడు బహుశ్రుతుఁడు గాని
వాఁడు, వాదనైపుణి వడయు నతఁడు
నృప సదస్సులలో ద్విజుఁ డెవఁడు లేఁడు. 204

వ. అట్టి చోట

యూప ముత్థాపించుచుండు ప్రేషపు వేళ
మారేడు యూపంబు లాఱు పాతి
చంద్రకట్టవి యాఱు సరిగ మారెడువాని
దరి మోదుగువి యాఱు మరల పాతి
విరిగి కట్టది యొండు, మఱి దేవదారువి
రెండు, బారెడు దూర మొండె పాతి
యొగి నిర్వదొక్కటియును పాతి యజ్ఞకో
విదులు శాస్త్రజ్ఞులు పదిలపఱచి

యజ్ఞ శోభకు బంగారు మలఁది వానిఁ
జక్కఁగా నిట్లు చేయించి రక్కజముగ
అవ్వి యిర్వది నాలుగే నంగుళముల
నలరి యున్ని వల్వలుఁ గప్పి నందగించె. 206

నేర్పు గల శిల్పి అష్టాని నిలువ సరిగ
ఎనిమి దగు కోణమ్ముల నెసఁగి నునుపు
గలిగి చక్కఁగాఁ జేయఁగా గట్టి వగుచు
నుండి కన్నులకును విందు నొదవఁ జేసె. 207

చిక్కని వల్వలు చుట్టఁగఁ
జక్కని పుష్పములచేతఁ జందనములచేఁ
మిక్కిలి పూజింపఁగ నవి
యెక్కువ వెలిఁగె దివి సప్తఋషులన్ బోలెన్. 208

అటఁ గొలతల కనుగుణ మగు
నిటుకలచే నగ్నికుండ పేర్పడి వెలిసెన్
అటు శిల్పకర్మములలో
పలువులు బ్రాహ్మణులు వ్రేల్చ వహ్ని వెలింగెన్. 209

వ. ఆ రాజసింహుఁ డగుదశరథుఁడు చయనము జరపఁదగిన యగ్ని కుండ, భూమి గరుడాకారముగను స్వర్ణేష్టికా పక్షములు గలదిగను ఆటు చితులు త్రిగుణములై పదు నెనిమిది రూపములుగలదిగను కుశలు లగుద్విజులచేఁ జేయఁబడియె, అందు ఆయాదేవతల నుద్దేశించి యథాశాస్త్రముగ పశువులు సర్పములు పక్షులు హయములు జలచరములు మారణ విశసనాదికర్మలందు ఋత్విజులచే నుంచబడినవి. ఆ దశరథమహరాజుచేయు యజ్ఞమందు గల యూపస్తంభము లందు మూఁడు వందల పశువులు ఉత్తమ మైనయశ్వ రత్నమును బంధింపఁ బడెను. 210

అంత వాజికిఁ గౌసల్య యగ్ని యెడలఁ
జలిపి పరిచర్య, మిగుల హర్షంబుతోడ
మూఁడు కత్తులు తనహస్తమున గ్రహించి
వయముగ హయంబు విశసనం బొనర్చె, 211

పదిల పఱచిన మదిని నావాజితోడ
ధర్మ మగునిచ్ఛఁ గౌసల్య తాను రాత్రి
గడిపె; హోత యధర్వు వుద్గాత మహిషి
నింకొకతె నాహ యముపరి సేర్పఱచిరి. 212

వ. అంత నియతేంద్రియుఁ డైన ఋత్విక్కు శాస్త్ర ప్రయోగ సంప న్నుఁడయి ఆ యశ్వముయొక్క వపను తీసి నిప్పుపైని కాచెను. ఆ రాజు వపాగంధమును యథాశాస్త్రముగా కాలము ననుసరించి ఆఘ్రాణించి తన పాప మును పోఁగొట్టుకొనెను. బ్రాహ్మణులైన ఋత్విక్కులు పదునాఱుగురు ఆ యశ్వముయొక్క యంగము లన్నిటిని యథావిధిగా అగ్నిలో వ్రేల్చిరి. అశ్వమేధేతర యజ్ఞముల పశుసంబంధిహవిస్సు ప్లక్షశాఖలందు ఉంచబడినది. అశ్వమేధ మందలి ప్రధాన పశువైన యశ్వముయొక్క హవిస్సు ప్రబ్బలిచాప మీద నుంచబడెను. అశ్వమేధము నాలుగు సవనములుగా చేయవలయునని బ్రాహ్మణులు కల్పశాస్త్రమునుబట్టి కల్పించిరి. అందు మొదటిది అగ్నిష్టోమము రెండవది ఉక్థ్యము అతిరాత్రము మూడవది. శాస్త్రమునుబట్టి జ్యోతిష్టోమము ఆయుష్టోమము రెండు అతిరాత్రములు, అభిజిద్యాగము ఆప్తోర్యామము అను చాల మహాక్రతువులును ఇంకను జేయబడెను. 213

కులమున్ వర్ధిలఁ జేయఁగా దశరథక్షోణీంద్రు డాజ్ఞామహా
బలుఁడై హోతకుఁ దూర్పు పశ్చిమదిశాభాగంబునధ్వర్యుకున్
అల ఋత్విక్కుకు దక్షిణంబును నుదగ్భాగ ముద్గాత క
వ్వల దక్షిణ లిచ్చె బ్రహ్మ విదితంబౌ నశ్వమేధేష్టిలో. 214

క్రతువును న్యాయముగ ధరా
పతియు ముగించి క్రతుఫలము వర్ధిలఁ జేయన్
గతకిల్బిషుం డయి పురో
హితు లగుఋత్విజుల కిచ్చె నెల్లధరిత్రిన్. 215

అవలన్ ఋత్విజు లిట్లు వాకొనిరి "రాజా! యీధరన్ నీవొకం
డవ సర్వంబును బ్రోవ నర్హుడవు, నేలన్ దీని పాలింప నే
మివిధిన్ జాలుదు, మీసమస్తధరతో మేమేమి కావింతుమో
నృవరా! నిత్యము మేము కోరెడి ధనం బీయొక్కస్వాధ్యాయమే. 216

ఋణ విముక్తిని బొంద వాంఛింతు వేని
ఏదియో మూల్యముగఁ గొంత నృవర! యిమ్ము
మణులొ రత్నాలొ పసిఁడొ గోగణమొ యేదొ
కొంచె మిడు, మేమి పని మాకు క్షోణితోడ. 217

ఇటు వేదాబ్ధి మథించు బ్రాహ్మణు లనన్ పృథ్వీశుఁ డవ్వారి క
చ్చట గోవుల్ పదిలక్ష కోట్లుపదియున్ స్వర్ణంబు, నల్ రెట్లి యీ
నటు వెండిన్ గురిపింప, ఋత్విజులు తామద్దానిసర్వంబుచెం
గట నర్పించిరి యవ్వసిష్ఠునికి నింకన్ ఋశ్యశృం గర్షికిన్. 218

ఋశ్యశృంగ వసిష్ఠ లాయెల్ల ద్విజుల
కనువుగా నాధనంబు భాగములు చేసి
యీయ వారలు సుప్రీత హృదయు లగుచు
నెంతయును వారలన్ బ్రశంసించినారు. 219

క్రతువు దర్శింప వచ్చిన బ్రాహ్మణులకు
శ్రద్ధతోఁ గోట్లకొలదిగ స్వర్ణమిచ్చి
మఱియు నిడ నేమి లేమి క్షమాధవుండు
నడుగ నిడె బీద, కున్నచే కడియ మొకటె. 220

గణనీయుల్ ద్విజు లెంతొ సంతసపడంగన్ హర్ష బాష్పాకులే
క్షణుడై యాద్విజవత్సలుండు నృపుడాబ్రహ్మదేవులన్ మ్రొక్క బ్రా
హ్మణు! లష్టాంగము లుర్విసోక, బ్రణతుండౌ రాజు నీక్షించి తత్
క్షణమే దీవెన లిచ్చి మెచ్చిరి మహోదారున్ ధరిత్రీవరున్. 221

వ. ఇట్లు ప్రీతి గల మనస్సుతో దశరథ మహారాజు అనుత్తమంబును పాప నాశకంబును, స్వర్గమును, పొందించునదియు, పార్థివేంద్రులకుగూడ దుస్తరంబును నగు నాయజ్ఞమును యథావిధిగా నాచరించి ఓయి సువ్రతా! మా వంశమును వృద్ధి పొందునట్లు చేయు నీవ యర్హుండవు. అని రాజు పలుక 'అట్లు యగుగాక' అని ఆ ద్విజసత్తముడు "ఓ రాజా! నీ కులము నుద్ధరింప నల్వురు కుమారులు గలుగుదురు" అని వచించెను. అపుడా ఋశ్యశృంగుని వాక్యము ఆలకించి ప్రయతుండయి, అతనికి ప్రణమిల్లి ఆ మహాత్ముఁ డయిన దశరథుండు పరమానందమును పొందెను. మరల నాఋశ్యశృంగుడు పుత్రులు కలుగ నిటు ప్రోత్సహించుచు బలికెను, 222

## —: పుత్రకామేష్టి :—

ధీయుతుఁడు వేదవిదుఁ డతఁ
డేయది తరువాయి యాచరింపఁగ వలెనో
ఆయది ధ్యానించి తెలిపె
యాయధిపతి కనె సమాధి యంతమునందున్. 223

ఆత్మజన్ములఁ గల్గించునదియు యగుటఁ
బుత్రకామేష్టి యనుపేరఁ బొగడఁ బడిన
యిష్టి నీచేతఁ జేయింతు నిదె యథర్వ
శిరసులోఁ జెప్పు మంత్రాలచేత విధిగ. 224

వ. అని తేజస్వి యయిన ఋశ్యశృంగుఁడు పలికి యాపుత్రకామేష్టిని ఉపక్రమించి మంత్రములందు దృష్ట మైన కర్మ ననుసరించి యగ్నియందు ఆహుతులను వ్రేల్చెను. 225

## దశరథుని యాగమునకువచ్చి దేవతలు రావణువలనఁ కలుగు బాధలు విష్ణువునకుఁ జెప్పుట

అంత దేవతలు గంధర్వులు సిద్ధులు పరమర్షులు యథావిధిగా తమ తమ యజ్ఞ భాగములను గై కొన నచటి కరుదెంచిరి. అట్లు చనుదెంచిన దేవతలు

తగురీతిని కుశల ప్రశ్నానంతరము ఆ సదస్సులో లోకకర్తయయిన బ్రహ్మతో తమ కష్టసుఖములు చెప్పుకొనుచు నిట్లనిరి. 226

భగవంతుండ! భవత్ప్రసాదమున గర్వం బంది బల్మిన్ మమున్
తెగ బాధించును రావణుం డనెడు దైతే యుండు, తచ్ఛిక్షచే
యఁగ లేమైతిమి, నీవు వానికి వరంబట్లిచ్చినా వద్ది యొ
ప్పుగ మన్నింపవలెన్‌గదా గనుక మేమున్ సైతుమవ్వానిన్. 227

వ. ఆ దుర్మతి యుత్తమము లైన మూడు లోకములను బాధించును త్రిదశాధిపుఁ డైనయింద్రుని ఎదుర్కొనగ జూచును. 228

పరమును గొని మోహితుఁ డయి
కరము ఋషుల, యక్షుల మరి గంధర్వుల భూ
సురులను రాహుప్రముఖా
సురుల నెపు డతిక్రమించుఁ జూడఁగ రాకన్. 229

తపనుఁడు తపింపఁడాతని,
నెపుడున్ వీచండు వాయు వీక్రూరుదరిన్
ఎపుడు మెదలఁ డురుకుతరం
గపు మాలలు గల జలధియుఁ గన్గొని వీనిన్. 230

ఘోరదర్శనుఁ డగునారాక్షసునినుండి
ఎంతొ భయము మాకు నెపుడు గలుగు
కాన వానివధకుఁ గరుణించి యేదైన
నొక్క యుక్తిఁ జెప్పుమోయి దేవ. 231

వ. అని యిటు దేవతలు విన్నవింప నపు డాబ్రహ్మ యాలోచించి యిట్లనియె. 233

బళి! యౌ నా నిఁక నాదురాత్ముని వధోపాయమిదే తట్టె వా
డల గంధర్వులచేత దానవులచే నాయక్ష రక్షోగణం

బులచే వధ్యుఁడుగాని యటుల వరంబున్ గోర నే నంత న
ట్టులె యంటిన్ నరు లేమి లెక్క యని వాఁడున్‌జెప్పఁ డామర్త్యులన్. 233

కాన వాని మర్త్యేతరు లైనవారు
చంపఁ జాలరు మర్త్యులే చంపఁగలరు
అనుచు బ్రహ్మ చెప్పిన ప్రియ మయినమాట
విని మహర్షులు దేవతల్ గనిరి ముదము. 234

ఇంతలో వచ్చె వలుద్యుతు లెసఁగుచుండ
శంఖ చక్రాలు గదయు హస్తముల వెలుఁగ
మురువుఁ బీతాంబరము మీఱ ముజ్జగంబు
లేలు విష్ణువే బ్రహ్మ యున్నెడకుమెల్ల. 235

వ. అపు డట్లు బ్రహ్మకడకు వచ్చి సమా హితుఁడై యున్న విష్ణువును జూచి దరిఁ జేరి అంత వినతులయి స్తుతు లొనర్చి యా సుర లందఱు ఇట్లు విన్నవించిరి. "ఓ మహావిష్ణూ! లోకములకు హితంబు చేయు కోరికతో ని న్నొక పనికై నియోగింతుము. అయోధ్యకు అధిపతియును ప్రభువును ధర్మంబు తెలిసిన వాఁడును వదాన్యుఁడును మహర్షులతో సమం బయిన తేజస్సు గల వాఁడు నగు దశరథు డను నొక రాజు గలఁడు. అతనికి హ్రీశ్రీ కీర్తు లను బోలిన ముగ్గురు భార్యలు గలరు. వారియందు నీవు నిన్ను నాలుగు రకములుగ విభజించికొని పుత్త్రుఁడవు కావలయును. 236

అందు మనుజుఁడ వయి, వృద్ధి పొంది యున్న
లోకకంటకు, దేవతల్ గూల్చ లేని
రావణునిఁ జంపు: వాడు వీర్యాంధుఁ డగుచు
బాధ లిడుఁ గిన్నరుల మునీశ్వరుల సురల. 237

నందనవనంబునందు నానంద మొంద
స్వైరముగ విహరించు నచ్చరల మునుల

సిద్ధ గంధర్వ జనుల హింసించు చుండె
సతతము మదించు మూర్ఖ రాక్షసుఁడు మిగిలి. 238

కనుక సిద్ధ గంధర్వ యక్షాదు లెల్ల
నిన్ను శరణుఁ జొచ్చిరి దేవ ! నీవె యిపుడు
మాకు నందఱకును పరమంపు గతివి
శత్రు వధకయి భువి మానసంబు నిలుపు. 239

వ. అని ఇటు లాదేవతలు విన్నవింప నాలకించి దేవేశుండును విబుధ పుంగవుఁడును సర్వలోక సమస్కృతుండు నగు విష్ణువు మోమునఁ జిఱునవ్వు వెన్నెలలు పుష్పపూవులు పూయఁ అక్కడఁ గూడియున్న ధర్మసహితు లైన యా పితామహప్రముఖు లైన సర్వత్రిదశులఁ గనుఁగొని "ఓ సురలారా ! యింక భయంబు వీడుడు, మీకు భద్రంబు గలుగుగాక. మీ హితమునకై యుద్ధములో క్రూరుఁడును, దుష్టుఁడును. దేవర్షులను బాధించువాడు నగు రావణుని పుత్ర పౌత్ర మిత్త్రి జ్ఞాతి బాంధవామాత్య సహితముగ వధించి పది వేలేండ్లును పదినూర్ల యేండ్లును భూమిని పరిపాలించుచు మానవ లోకమున వసింతును" అని దేవతల కిటు వరంబొసఁగి యాత్మవంతుఁ డగు హరిదేవుఁడు మానవ లోకమున తానుగూడ జన్మించుటకై యాలోచింపదొడగె. 240

అంతఁ దామరసదళాక్షుఁ డాత్మ నిందు
నాలుగుగ విభజించి నృపాలుఁ డైన
దశరథునిఁ దండ్రిగాఁ గొని ధరణియందు
బుట్టఁ గోరెను సురలను బ్రోవఁ దలచి. 241

అవల గంధర్వులును రుద్రు లప్సరసలు
ప్రోవుపడ దేవతలు విష్ణుమూర్తి నెన్ని
దివ్యమగు స్తోత్రములతోడ భవ్యరీతి
స్తుతి యొనర్చి వాక్రుచ్చిరి శుభము మీఱ. 242

వ. ఓదేవా ! ఉద్ధతుఁడును ఉగ్రతేజస్కుఁడును మిగుల దర్పించిన వాఁడును దేవేంద్రుని ద్వేషించువాఁడును అందఱను విశేషముగా నేడ్పించు వాఁడును సాధువులకు తపస్వులకుఁ గంటక మైన వాఁడును తాపసులకు భయముగూర్చు వాఁడును అయిన యారావణుని మొదలంటఁ బెల్లగించివే యుము. బల బాంధవ సహితముగా నధికపౌరుషముగల యా రావణుని జంపి కృతకృత్యుఁడవై చింత లేక చిరకాలమునుండి దేవేంద్రపాలితమై ఏ దోష ములు పాపములుగాని లేని నీ లోకమునకు మరల రమ్ము" అని. 243

## దేవతలు వెడలి పోయిన పిదప ఒక దివ్య పురుషుడు అగ్నికుండము వెడలి దివ్యపాయసము దశరథుని కిచ్చుట

వ. పిదప భగవంతుడైన నారాయణుడు ఇట్లు రావణవధకై దేవతలచే నియోగింపఁ బడి- సర్వమును తెలిసినవాఁ డయ్యును తెలియనివాఁడు బోలె మధురమగువాక్యము ఇట్లు పలికెను, "ఆ దురాత్ముఁ డైన రావణుని వధించు టలో ఏ యుపాయ మవలంబింపవలెను. ఏ యుపాయముచే మహర్షులకుఁ గంటకమై యున్న వానిని వధించెదను" అని ఇటు నారాయణుఁడు పలుకు టయు నంత అవ్యయుఁ డగు హరితో దేవత లందఱు ఇటు వచించిరి. 244

మనుజశరీరము దాలిచి
యనిలో రావణుని జంపు మతఁడు తపంబున్
ఘొనరించి చిరము వరమును
గొనెను దొలుతఁ బుట్టి జగము గూర్చిన యజుచే. 245

మానవుఁడు తక్కఁ దక్కిన ప్రాణివలన
భయము లేకుండునటు బ్రహ్మ వరము నిచ్చె
పురుగులనుబోలె నరులను సరసి వారి
లెక్కఁ గొనకయె మిగుల గర్వించి పోయె. 246

ఇంకం జూఁడుఁడు వాఁడో
జంకక లోకములు మూఁడు చంపఁగఁ దొడగెన్

కొంకక కనఁబడు వనితలఁ
జంక నిడును నరులె చంపఁజాలుదురు హరీ ! 247

అని సురలు వచించెడి పల్కు లాలకించి
తండ్రిగా దశరథనృపున్ దలఁచె హరియు
నప్పుడామహాద్యుతి శత్రుహంతకుఁ డగు
నృపుఁడును జేయు బుత్రకామేష్టి" యనుచు. 248

వ. ఇటు హరిదేవుండు నిశ్చయించుకొని పితామహుని వీడ్కొని దేవతలును మహర్షులును పూజలు సలుపుచుండ నటనుండి యంతర్ధానంబు పొందె.

—: ఒక మహాపురుషుఁడు దశరథునికి పాయసము నిచ్చుట :—

వ. అట నింక యాగంబు సేయు నాదశరథమహారాజు యజ్ఞవహ్ని నుండి అతులప్రభ కలిగి మహావీర్యంబును మహాబలంబును గల యొకానొక మహాపురుషుఁ డుద్భవించె. ఆతఁడు నలుపు, ఎఱుపు గల అంబరములు ధరించి ఎఱ్ఱని ముఖము కలవాడై దుందుభుల ధ్వనివంటి గంభీరధ్వని గలిగి నున్నని సింగము జూలును బోలిన పెండ్రుకలు మీసములు గడ్డములతో భూషితుడై శుభలక్షణములతోఁ గూడి దివ్యమైన యాభరణములను ధరించి పర్వతశృంగము వలె నున్నతమయి. మదించిన పెద్దపులి విక్రమంబును బోలిన విక్రమంబు గలవాఁడయి దివాకరుని యాకారము గలిగి మండు వహ్నిజ్వాలల శిఖలతో సమానమైన గొప్పకోరలు గలిగి, గదను చేతితో ధరించి వృషభంబు కంధరము వంటి కంధరముతో గొప్ప వక్షఃస్థలముతో ఆజానుబాహువులతో రెండు అంగదములతో ఉరమునందు ప్రకాశించు తారావికృతకల్పమైనహారముతో చంద్రుని వలెఁ దెల్లని దంతముతో మెఱయుచు తేజస్సులచే మండుచున్నవాఁడు వలె లక్ష్మితోఁ దీపించువాఁడువలె పుటమువేసిన బంగారముభూషణముల మెఱయుచుండ ఉద్భవించి వెండిమూతగల దివ్యపాయసముతో నిండిన స్వయముగ

ఆశ్చర్యకరమైయున్న పెద్ద మేలిబంగారుపాత్రను రెండు చేతులలో పట్టు
కొని దశరథ నృపాలుని జూచి, "ఓరాజా ! ఇక్కడకు వచ్చిన నేను ప్రజాపతి
మనుష్యుఁడ నని తెలియుము" అనెను. పిదప రాజు దోసిలి పట్టుకొని యిట్ల
నెను. "ఓ భగవానుడా ! నీకిదె స్వాగతము. నీకు నేనేమి చేయుదును" అని.
అపు డాప్రజాపతి మనుష్యుడు ఇటులు అనెను. 249

"దేవతలఁ బూజచేసిన నీవు రాజ !
స్వర్గవాసులవలన నీపాయసంబు
వడసితివి నీవిపుడు, నరవ్యాఘ్ర ! యిదియె
ధన్య మారోగ్యకరము సంతతి కరంబు. 250

వ. అని దివ్యపురుషుండు పలుక॰

సరె యని ప్రీతితో నృపతి జాగిలి మ్రొక్కి సురాళి యిచ్చు బం
గరు పరమాన్నపాత్రయును గైకొని యద్భుతుఁడై ప్రియాస్య సుం
దరుడగు దివ్యపూరుషుఁ బ్రదక్షిణముం బొనరించి మ్రొక్కి బైఁ
బొరలు ముదంబుతో వినయ పూర్ణ ముఖాబ్జముతోఁ గృతజ్ఞుడై. 251

ధనహీనుండు ధనంబు పొంది యెటు మోదం బొందునో యట్లె యా
జనపాలుం డిటు దేవదత్త మగు నాసత్పాయసంబున్ గనుం
గొనె, నాయద్భుత దివ్య మూర్తి యటనే గావింపఁగాఁ దగ్గ క
ర్మను గావించియు మాయ మయ్యె త్రుటి నిర్వర్తించి దేవాజ్ఞలన్.
252

సంతోష రశ్మల నృపతి
యంతఃపుర మెల్ల వెలిఁగె యట నా ల్లైన్
ఎంతయు సుందర మగు వ
ర్షాంతశరద్భృతుశశిరశ్మల నభంబటులన్. 253

వ. అంత దశరథుఁడు అంతఃపురంబు ప్రవేశించి కౌసల్య కిట్లనియె.
"నీకుఁ బుత్త్రుని ప్రసాదించు పాయసమును గ్రహింపుము" అని నరపతి కౌస

ల్యకు ఆపాయసములో సగ మిచ్చి పిదప సుమిత్రకుఁ గౌసల్య కివ్వఁగా మిగిలిన సగములో సగ మిచ్చి తరువాత ఆమిగిలినదానిలో సగము పుత్త్రినికై కై కేయికి ఇచ్చెను. ఆయమృతమువంటి పాయసమును ఆ మిగిలిన దానిని ఆలోచించి మరల మధ్యస్థురా లగుసుమిత్రకే యిచ్చెను. ఇట్లే వేఱు వేఱుగా ఆ దశరథమహారాజు తన భార్యలకు పాయసమును పంచి యిచ్చెను. 254

అనరేంద్రునియుత్తమ లైన స్త్రీలు
పాయసం బది భుజియించి స్వాంత మలర
అగ్నిసూర్యులతో తుల్య మైన తేజు
వడసి చిరమునకును గర్భవతుల యైరి. 255

ఇఁకదశరథుఁడు దిట వొందుహృదయ మెసఁగ
ప్రకట గర్భము కలుగు భార్యలను గాంచి
శక్ర సిద్ధ మహర్షి పూజలను గన్న
హరి త్రిదివమునబలె గడు హర్ష మొందె. 256

ఆమహాత్ముఁడౌ రాజున కచ్యుతుండు
సుతుఁడుగాఁ బుట్టఁదలచుటఁ జూచి యంత
సర్వదేవులతోడ సత్వరముగ
ననియె నిటు భగవంతుఁడౌ వయ్యజుండు. 257

సత్య సంధుఁడు వీరుండు సర్వులకును
హితము చేయఁ గోరెడి విష్ణు వీతనికిని
మీర లందఱు సాయంబు మీఱి చేయఁ
బుత్త్రులఁ గనుండు కామరూపులను బలుల. 258

మాయ లెఱుఁగువారి మహనీయశూరుల
వేగముతో వాయువేగ సముల

నీతివేత్తల బుద్ధినిపుణత గలవారి
విష్ణువుతోఁ దుల్యవిక్రములను

వధియింపఁగా రానివారి యుక్తి విదుల
దివ్యగాత్రాంతోఁ దిరుగువారి
నమృతభోజులువోలె నఖిలమౌ నస్త్రాలు
నిఖిల గుణంబుల నెఱయువారి

ఘనత నప్సరస్త్రీల తనువులందు
ప్రథిత గంధర్వ వరశరీరంబులందు
యక్ష పన్నగ కిన్నర ఋక్ష కపుల
అమల విద్యాధరస్త్రీలయందుఁ గనుఁడు. 259

వ. ఇదివఱకే నేను ఋక్షపుంగవుడైన జాంబవంతుని సృజించితిని. నేను *ఆవులించుచుండ వెంటనే అతడు నా ముఖమునుండి పుట్టుకొని వచ్చెను. అని భగవంతుఁ డగు నాబ్రహ్మ యట్లు చెప్పఁగా అతని శాసనమును విని వారు వానరరూపు లైన పుత్త్రులను గనిరి. మహాత్ము లైన ఋషులను సిద్ధ విద్యాధర నాగులను వనచరు లైన చారణులను వీరులైన పుత్త్రులను గనిరి. 280

తనతో సమానుఁడౌ తనయుని సువాలుని
నధికు వాలిని నింద్రుఁ డంతఁ గనియె
తపియించు వారిలో నపురూపుఁడౌ రవి
గ్రీవాభిరాము సుగ్రీవుఁ గనియె
అఖిల వానరముఖ్యులం దనుత్తము బుద్ధి
యుతుని తారుని బృహస్పతియుఁ గనియె
ఘనుని శ్రీమంతుని గంధమాదన కపిన్
ధనదుండు గనియె నందఋను మెచ్చ

విశ్వకర్మ నలు మహాకపిని సృజించె
పావకుండు శ్రీమంతుని స్వగుణసముని

* పూర్వము స్త్రీ పురుష సంబంధము లేకుండగనే సంకల్పాది సృష్టి జరిగినది. పిదప స్త్రీ పురుష సంబంధముచే సృష్టి జరిగినది. ఇది పురాణ వచనము.

నీలుఁ డనుమహాకపిఁ గనెన్ వీరుఁడతఁడు
యశముచేఁ దేజుచే మించె నఖిల కపుల. 261

అందమె ధవమగు నశ్వినీదేవత
అందమౌ ద్వివిదుని మైందుఁ గనిరి
వరుణుండు కపివృషుఁ బడసె సుషేణుని
జలదుండు బలవంతు శరభుఁ గనియె
అనిలుండు శ్రీమంతు హనుమంతుఁ గనియెను
వజ్రాంగుఁ డతఁడు జవాన గరుడి
వారు వేలుగఁ బుట్టి వీరు రావణుఁ జంప
మిగుల నాసక్తితో మీఱి యుండ్రు

అప్రమేయబలులు వీరలై యెదిర్చ
స్వైరరూపులై యుందురు మేరు మంద
రాభులై ఋక్ష గోపుచ్ఛులగుచు ధరణి
* వెలసినారలు హరిఁ గొల్వ వినుతరీతి. 262

ఏదేవుని కేరూపము
నేదేవుని కెట్టిశౌర్య మేతే జుండెన్
ఆదేవునితో సమముగ
నాదేవుని సంతతి కపు లలరుదు రట్లే.

ఘనదర్పోద్ధతి సింహులై బలిమి నుగ్రంబైన వ్యాఘ్రంబులై
పెనురాళ్ళే నిశితాయుధాలుగ మహావృక్షాలె శస్త్రాలుగాఁ
దునుమం బోరుచు గోళ్ళఁ గోరలను నెందున్ జీల్చుచున్ వానరుల్
వినుతాస్త్రాళిఁ బ్రవీణులై కడు విజృంభింఁ బ్రెల్లియుద్ధంబులన్. 264

* ఇక్కడ పునరుక్త శ్లోకములు కొన్ని విడువఁబడినవి.

శైలేంద్రంబుల పైనఁ జిమ్మగల రేచెట్లైన భేదింత్రికన్
లీలన్ వాహినినాధు వార్ధిని గడున్ విక్షోభ పెట్టంగలా
రేలా వేలు ధరిత్రిఁ జీల్పఁ గల రిట్లీ యీదనే త్రుబ్ధులన్
వ్రేలన్ జొచ్చెద రాకసాన జలదాళిన్ బట్టుకొం ద్రాకపుల్. 265

పని స్వేచ్ఛన్ విహరించుమత్తకరులన్ బట్టంగలా, రిట్టె గ
ర్జన గావించుచుఁ బక్షులన్ ధరణి రాలన్ గొట్టువా రింతయే
లను నాక్రోఁతులు చేయలేని పని సుంతన్ లేదు నూర్లొచు వే
లును సై యెంతొ మహాత్ము లౌచునగపుల్ యూధేశులై యుండ్రటన్. 266

ఇటులన్ వీరు పరాక్రమించుచును శైలేంద్రంబులన్ జెట్టులన్
తటులన్ గానల నాశ్రయించెదరు మందల్ మందలై కొంద ఱం
తట సుగ్రీవుని వాలి నాదుకొని యుండ్రానీలునిన్ గొంద ఱు
ద్భట వీరున్ హనుమంతుచెంత నలుచెంతన్నుండ్రు తార్క్ష్యోద్ధతిన్. 267

వీరలు వీరు లయి రణ వి
శారదులై మించి సింహ శార్దూలములన్
ఘోర విమర్దించుచుఁ బెం
పారఁగ నుండఁ గని వీరి వాలియు మనుచున్. 268

కరమున్ బాహుబలుండు వాలి కడు వీఁకన్ బుక్ష గోపుచ్ఛ వా
నరులన్ బాహుబలంబుచే నిలుపగన్ వారెల్ల నందుండి యీ
ధరపై గొండలపైని గానల సముద్రాలందు నభ్రాన నా
దరి నిందం దననేల శూరులయి సుంతన్ నిండి యుండ్రెప్పుడున్. 269

మేఘాల గుంపువోలెను
ద్రాఘిష్ఠపు గిరులవోలె బ్రకటితభయుదా
మోఘబలు లగు కపుల గ
ర్జాఘాతముల భువి నిండె రాము భజింపన్. 270

## శ్రీ రామావతారము

ఆ మహాత్ముఁడౌ దశరథు నశ్వమేధ
యాగము యథావిధి ముగియు నంత సురలు
తమతమదు యాగభాగముల్ తగ గ్రహించి
వచ్చినటు వెడలిరి యిచ్ఛ వచ్చినట్లు. 271

ధర్మపత్నులతోఁగూడ దశరథుండు
యాగదీక్షను నియమము నట ముగించి
భటులు భృత్యులు బలములు వాహనములు
చేరి చనుదేఁ బురిఁ బ్రవేశించె మరియు. 272

యాగమును జూడ వచ్చిన యఖిలనృపులు
రాజుచే యథార్థమ్ముగఁ బూజలంది
మౌనివరుని వసిష్ఠు నమస్కరించి
తమ తమదు దేశములకు సత్వరమ చనిరి. 273

వారు శ్రీమంతులై తృప్తిఁ బట్టణంబు
వీడి చనుచుండ రాజుల వివిధబలము
లెంతయు బ్రహృష్టమై ప్రకాశించి మించె
నృపులు చన రాజు ద్విజులతో నేగెఁ బురికి. 274

అపరిమితపుఁ బరివారము
నృపతియు వీడ్కొలుప ఋశ్యశృంగుండు జనం
బు పొగడ, శాంతాసతితో
నపుడేచనె రాజుచేత నధికార్చితుఁడై. 275

ఇటు వీడ్కొల్పి సమస్తరాజతతులన్ బృద్ధ్విపుఁ డవ్వేళ మి
క్కుటమౌ మోదముతోడ మదిలోఁ గోర్కెల్ సుతోత్పత్తి సం
ఘటనల్ ముంచుకు రాఁగ హృష్టుడయి సౌఖ్యంబుండె, నం
తట యాగాంతమునుండి యాఋఋతువుల్ తామై చనెం జెచ్చెఋన్. 2:6

వ. ఇటులుకాఁగా

* సరిగఁ బంౘ్రెండవ చైౘ్రమాసంబున
భువి శుక్లపక్షపు నవమి నాడు
అదితి దేవత గాఁగ నమరు నక్షౘ్రాన
సైౘదుౘ్రగహము లూర్ధ్వమందు నుండ
కర్కటలగ్నానఁ గలిగి బృహస్పతి
చంౘ్రమునితోఁ గూడ సరిగ రాఁగ
సకలలోకంబులు శాంతంబులై యుండ
దుష్టాసుర తమంబు దూరమేఁగ.

విష్ణులో సగ మంశమౌ విశ్వనాథు
అనఘు నిక్ష్వాకువంశవర్ధనుని దనయు
సకలలక్షణ సంపన్నునధిక తేజుఁ
గనియెఁ గౌశల్య యపుడు రాముని శుభాంగు. 277

---

* పాయసము భుజించిన మూడు నెలలకు దశరథుని భార్యలు గర్భవతులైరి. పిదప తొమ్మిది మాసములు నిండ సుతులను గనిరి. కనుక 3 తో 9 కలియుగా 12 మాసము లయ్యె నని తెలియునది. పాయసములోని సగము భాగము (అంశము) కౌసల్య భుజించినది కాన హరిలో సగము అంశమున రాముడు జన్మించె నని భావము.

ఎల్లసురలలో ముఖ్యుడౌ నింద్రుచేత
అనఘ కాశ్యపు నర్ధాంగి యదితివోలె
భూమి జనులలో ముఖ్యుడౌ రాముచేత
క్ష్మావిభుని పట్టమహిషి కౌసల్య వెలిగె. 278

భరతుఁ డొదవెఁ గైకేయికి బ్రకట గుణుఁడు
సత్యమగు పరాక్రమమున స్తుత్యుఁ డతఁడు
* హరికి సాక్షాత్తు నాల్గంశ నలరు వాఁడు
వినయ భూషణుఁ డగు వాడు పితృరతుఁడు. 279

అవల లక్ష్మణశత్రుఘ్నులు నఘమతులు
కలిగిరి సుమిత్రకు సుతులు కవల లగుచు
వారు సర్వాస్త్ర కుశలులు వీరవరులు
విష్ణువున కర్ధసహితులై వెలయువారు. 279

---

* విష్ణువు సాక్షాత్తుగా ప్రత్యక్షరూపముగా వచ్చిన రామునికి నాల్గవ యంశగాఁ బుట్టినవాఁడు భరతుఁడు. ప్రత్యక్షరూపముగాఁ గనిపింపని విష్ణువునకు ఎనిమిదవ యంశగా యున్నవాఁడు అని భావము. మొత్తము పాయసములో సగమున రాముఁడు, ఆ సగములో సగమున అనఁగా నాల్గవభాగమున లక్ష్మణుడు, నాల్గవ భాగములో సగము అనఁగా ఎనిమిదవ భాగమున భరతుఁడు పుట్టెను. ఇంక చివర మిగిలిన ఎనిమిదవ భాగమున శత్రుఘ్నుడు పుట్టెను. అనగా సగమున రాముడు, నాలుగవభాగమున లక్ష్మణుడు భరత శత్రుఘ్నులు ఎనిమిదవ భాగముల పుట్టిరి. భువిలో సాక్షాత్కరించిన రాముని నాల్గవ అంశము భరతుడని యిట చెప్పుకొనవలయును. కనుకనే సాక్షాత్ విష్ణోః అని చెప్పఁబడినది. కేవలము విష్ణువు అని చెప్పఁబడలేదు. కాన ఇట విష్ణువనఁగారాముడుగా అవతరించిన విషువునకు నాల్గవ యంశయని చెప్పుకొనవలెను.

పుష్యమిని మీన లగ్నానఁ బొడమె భరతుఁ
డంత లక్ష్మణుఁ డాశ్రేషయందుఁ బుట్టె
అమల శత్రుఘ్నుడును కర్కటమునఁ బొడయె
ఇట్లు నృపతికి నల్వురు పుట్టిరపుడు. 280

పుత్రులు వారు నల్వురును ప్రోష్ఠపదోపములై గుణాల స
త్పాత్రులు స్వానురూపులయి భ్రాతృతమీఱ మెలంగఁ గిన్నరుల్
గాత్రములెత్తి పాడి, రికఁ గన్నులు పండువుగాఁగ నచ్చరల్
చిత్ర విచిత్ర భంగిమల నృత్యము చేసిరి, మ్రోగె దుంధుభుల్. 281

మెండుగఁ బుష్ప వృష్టి పడె మిన్నున నుండి, యయోధ్యలో
నిండుగఁ బండుగల్ జరిగె నేర్పుగ నాడిరి పౌరులెల్ల బ్ర
హ్మాండమె యీఁతెనో యనఁగ మార్గములన్ జనులెల్ల ప్రోగులై
నిండిరి, గాయకుల్ నటులు నృత్యము గానము చేసి రంతటన్. 282

సూత వంది మాగధులకు క్షోణివిభుఁడు
ఈయఁ దగినవి యెల్లను నిచ్చి పైచె
బ్రాహ్మణులకు ధనము సహస్రముల కొలది
గోవులను దాన మిచ్చెను గోర్కి దీఱ. 283

వ. పిదప దశరథుఁడు పదునొకండవ నాఁడు తన కుమారు లందఱకు నామకరణము చేసెను. మహాత్ముఁ డైన పెద్దకుమారునికి రాముఁ డని, కైకేయి కుమారునికి భరతుఁ డని, సుమిత్ర కొడుకులలో పెద్దవానికి లక్ష్మణుఁ డని, రెండవ వానికి శత్రుఘ్ను డని పేరు పెట్టెను. పరమ ప్రీతు డైన వసిష్ఠుడు గూడ ఆనామములనె పెట్టెను. అపుడు బ్రాహ్మణులకు తనజనపదమందలి పౌరులకు భోజనము లిడి అందు బ్రాహ్మణులకు రత్నసముదాయమును గూడ నిచ్చెను. ఆకుమారులకు నామకరణములతో బాటు జాతకర్మాది సర్వకర్మలను గూడ రాజు గావిరచెను. 283

అందఱలో ధ్వజం బటు జ్యేష్ఠుఁ డగు రాముఁ
డెసగి తండ్రికిఁ బ్రీతి సెపుడు గూర్చు

బ్రహ్మదేవునివలెఁ బ్రాణుల కెల్లకు
నాథఁ డెప్పుడు నిష్టుఁ డయి మెలంగు

సోదరు లందఱు వేదంబుల నెఱింగి
లోకమంగళకరుల్ శూరు లైరి

వారెల్ల జ్ఞానసంపన్నులై సర్వ
గుణరాసులై మెలంగుదురు సతము

వారిలోఁ బెద్ద రాముఁడు బహుగుణుండు
ప్రథితతేజస్వి సత్యపరాక్రముండు
చంద్రుఁ బోలె నెప్పుడును బ్రసన్నుఁ డగుచు
రాజిలెను నమలుఁడు ప్రజారంజకుఁడుగ. 284

మదపుటేనుఁగు లెక్కి మరలించు రాముండు
మీఱి గుఱ్ఱములపై స్వారి చేయు

వేదాల నిఁక ధనుర్వేదాన స్థిరుఁ డయ్యు
స్వపితృశుశ్రూష నాసక్తుఁ డగును

బాల్యమాదిగ స్నేహవంతుఁడై మెలగును
లక్ష్మివర్ధనుఁ డైనలక్ష్మణుండు

సర్వప్రియుఁడె యయ్యు సతతంబు సేవించు
అన్నయౌ రాము లోకాభిరాము

లక్ష్మినిధి లక్ష్మణుఁడు శరీరమున వేఱె
యయ్యు నన్న రాముని బహిఃప్రాణ మయ్యె
నిద్ర పురుషోత్తముఁడు గనం డితఁడు లేక
తినఁడు మృష్టాన్న మైన నీతనిని విడిచి. 285

ఎపుడు గుఱ్ఱమెక్కియు వేట కేగురాము
డపుడు విలుపట్టి లక్ష్మణుం డరుగు కూడ
భరతునికి నీశత్రుఘ్నుఁడు ప్రాణ మగుచు
ప్రియుఁడె యయి లక్ష్మణానుజుఁ డనిపించుకొనియె. 286

వ. మహానుభావులును ప్రియులు నైన యానల్వురు పుత్రులచేత దశరథుడు దేవతలచేతఁ బితామహుఁడు వోలెఁ బరమప్రీతుఁడై యుండెను. వారు జ్ఞాన సంపన్నులై గుణములప్రోవు లయ్యు లజ్జావంతులై కీర్తిమంతులై సర్వజ్ఞులై దీర్ఘదర్శు లయి యుండిరి. ఇట్టి ప్రభావములు కలిగి దీప్త తేజస్కులైన వారిచేఁ దండ్రి యయిన దశరథుఁడు లోకాధిపుఁ డటుల వెలుగుచుండెను. ఆమనుజవ్యాఘ్రు లైన పుత్రులు వేదాధ్యయనమునందు ఆసక్తులై పితృశుశ్రూషాపరులై యుండిరి. ధనుర్వేదములలోఁ గూడ నిష్ణాతు లయిరి, అంత ధర్మాత్ముఁ డైన రాజు దశరథుఁడు తన కుమారులకుఁ దగు భార్యలను గూర్చుటకయి ఉపాధ్యాయులతోడను, బంధువులతోడను ఆలోచనలు సలుప సాగెను. 287

## —: విశ్వామిత్రుని రాక :—

వ. అట్లు ఆమహాత్ముఁడు మంత్రులమధ్య ఆలోచనలు సాగించుచుండగా మహాతేజస్కుఁ డైన విశ్వామిత్రమహాముని వచ్చెను, ఆవిశ్వామిత్రుఁడు రాజు దర్శనము చేసికొనఁ దలఁచి ద్వారపాలకులతో, "నేను గాధికుమారుడను కౌశికుఁడను. నేను వచ్చి నట్లు త్వరగా రాజుతో చెప్పుఁడు అనియెను, వారు అంతట దానిని విని భీతిచే రాజగృహమునకు పరు వెత్తిరి. వారు అందరును కంగారుపడిన మనసు గలవారై ఆవిశ్వామిత్రుని వాక్యముచే ప్రేరేపించఁబడి రాజభవనమునకు వెళ్లి విశ్వామిత్రమహర్షి వచ్చినట్లు ఇక్ష్వాకునృపాలునికి చెప్పిరి. అపు డారాజు వారి మాటలు విని పురోహితులతోఁ గూడి శ్రద్ధతో సంతుష్టుడై బ్రహ్మకు ఇంద్రుడువోలె నెదురుగాఁ బోయెను. దీప్తితోఁ బ్రకా

శించుచున్నట్టియు వ్రతము పూని నట్టియు నాతాపసుని జూచి సంతసించిన మోముగలవా డయి రాజు అతనికి అర్ఘ్య మొసంగెను. అప్పుడా ముని సుధార్మికుఁ డైన రాజొసంగిన యర్ఘ్యమును యథావిధిగాఁ గైకొని నరాధిపునితో పురిలోను కోశములోను జనపదములోను బాంధవుల విషయమయి స్నేహితుల విషయమయి యోగక్షేమము లడిగెను. "ఓరాజా! నీకు సామంతులు వినమ్రము లయి యుందురుగదా! నీవు శత్రువులను జయించితివిగదా! దైవ కర్మను మానవ కర్మను సరిగా నీవు ఆచరింతువుగదా" అని యడిగెను. పిదప ఆముని పుంగవుఁడు వసిష్ఠుని సమీపించి కుశల మడిగి యక్కడె యున్న ఋషులను మహానుభావులను కుశల మడిగెను. అప్పుడు వారందఱు హృష్టమనస్కులై రాజుచే పూజితులై ప్రవేశించి అర్హ మగురీతిలోఁగూర్చుండిరి. అపుడు పరమోదారుఁ డైన రాజు ప్రహృష్ట మనస్కుఁడై ఆవిశ్వామిత్రుని బూజించుచు ఇటుల పలికెను. 288

క్ష్మా వలయంబునఁ గలనైన దొరకక,
దొరికిన యమృతంపు దొన్నెవోలె
నీళ్ళైన లేనట్టి నిండు టెడారిలో
బూర్తిగఁ గురియు వానపోతవోలె
సంతానమే లేనిజనునికిఁ దనభార్య
లను గల్గిన సుపుత్త్రు లబ్ధి పగిది
ధనము పోయి మిగుల వనటలఁ గుందెడి
నరునికిఁ బెన్నిధి దరియు పగిది

గొప్ప యుదయమున హర్షము గూరినటుల
నీదు రాక నాకు ముదంబు నింపి సైచె
అనఘ! యోముని! నీకిదే స్వాగతంబు
హృష్టుఁడ నగు నే నిడుదు నీకేమి కోర్కె. 289

పాత్రుఁడ వైతి నాకు భగవానుఁడ ! కౌశిక ! నాయదృష్టమున్
చిత్రము పండ వచ్చితివి; జీవిత మెల్ల సుజీవితంబు ప
త్పాత్రమునయ్యె; నిప్పుడుగదా ఫలియించెను నాదు జన్మ, లో
క త్రయపూజ్య ! విశ్వమున కంతకు మిత్రుఁడ వైతి వెంతయున్. 290

ఇదివఱలో రాజర్షివి,
పదపడి భీకరతపముల బ్రహ్మర్షిపదం
బదనునఁ జేకొంటి, వఖిల
విధములఁ బూజ్యుండ వైతి విధిగా నాకున్. 291

నీవెది కోరి వచ్చితివి నీవిటు రాకకు హేతు వేదగున్
నీవిట నీదు వృద్ధికయి యేదవుఁ జెప్పి యనుగ్రహింపు మీ
ఈవిటువంటి కార్యము వచించుట యెట్లని సంశయింపరా
దీవ మధీయదైవతమ యేనె కదా నెఱవేర్తు దానినిన్. 292

ఈవు కోరున దిచ్చు నదృష్ట మిపుడు
పట్టె, నాకింతకంటె నేభాగ్య మబ్బు;
నీదు రాకవలని ధర్మ మీధరిత్రి
నేమి గల, దను త్తమ మది యెందుఁ గాని. 294

వ. అని యటు లాత్మవంతుఁ డైన దశరథునిచే వినయముగా విన్న వించఁబడి హృదయ సుఖమైన వాక్యమును విని ప్రఖ్యాత మైన గుణములు కీర్తి గల గుణవిశిష్టుఁ డైన విశ్వామిత్రమహర్షి ఎంతో యానందమును పొందెను. 294

వ. అపుడు అద్భుతము విస్తరము నైన రాజసింహుని వాక్యమును విని మహాతేజుం డైన విశ్వామిత్రుఁడు మేనెల్లఁ గగుర్పొడువ నిటుల పలికెను, 295

ఉత్తమం బైన కులమున నొదవినావు
ఈవసిష్టు జాడలఁ బట్టి పోవుచున్న

నీకు తగినటు పలికితి నృపవరేణ్య !
యీ పనిన వలు కన్యథా యెటులగును. 296

ఏది యయితె నాహృది గలదొ అట్టిమాట
ఆవనియె నిశ్చయంబుగ నాచరించి
రాజశార్దూల ! యీపృథ్విరాజులందు
సత్య మగు ప్రతిజ్ఞ గలరాజన్యుఁ డగుము. 297

నేను సిద్ధికై యొక వ్రతం బూనినాడ !
గామరూపు లిరువురు రాక్షసులు దాని
కెల్ల నెపుడు విఘ్నాలు గావించుచుండి
కరము పాడు చేయుదు రయ్య పురుషవర్య. 298

పలుమార్లెన్నొ వ్రతాలు చేసియు సమాప్తంబు గావించు వే
ళల మారీచసుబాహునాము లగు నారక్షస్సు లత్యంత వీ
ర్యులు సంపూర్ణ సుశిక్షితుల్ రుధిర మాంసౌఘంబులన్ యజ్ఞవే
దుల వర్షించుచు నా వ్రతంబులను నెందున్ బాడు గావింత్రుగా. 299

ఇఁక నాయెల్ల శ్రమంబు వ్యర్థమయిపో నేమాత్ర ముత్సాహ మొ
ంక యీ ప్రాంతమునుండి మర్లితిని క్రోధంబూనఁగా నాకు నిం
పుకయున్ బుద్ధిజనింప దాయె, మదిలోఁ జూడంగ నాచర్య యీ
రక మైనట్టిది, శాపమున్ విడువగా రా దెప్పు డాచర్యలన్, 301

వ. రాజేంద్ర! సత్యమైన పరాక్రమము గలిగిన వాఁడును కాకిరెక్కల వంటి పార్శ్వశిఖలు గలిగినవాఁడును శూరుడును జ్యేష్ఠుఁడు నగు రాముని నా కప్పగింపుము. ఇతఁడు నాచే రక్షింపబడి వికారము గలిగించు రాక్షసులనుగూడ తన దివ్యతేజస్సుచే వినాశమొందింప శక్తిగలవాఁడగును. ఈ పుత్రునికినిస్సంశయముగా అనేకవిధ మైన శ్రేయస్సులను గూర్చెదను. వానివల్ల ఇతఁడు మూఁడులోకములందును ఖ్యాతి బొందును. రాముని యెదుట ఆ రాక్షసులు ఎట్లును నిలువ జాలరు. రాముడు తక్క నింకెవ్వరును ఆ రాక్షసులను చంప

జాలరు. వీర్యగర్వితులైన యాపాపులు కాలపాశమునకు లొంగిపోయిరి. రాజశ్రేష్ఠ! మహాత్ముఁడైన రామునికి వా రేమాత్రము చాలరు. రాజా! పుత్రుని యందు వ్యామోహము వదలుము. ఇదిగో నీకు నేను ప్రతిజ్ఞ చేయుచున్నాను ఇంక ఆ రాక్షసులు చచ్చినట్లే యని తెలిసికొనుము. 302

నే నెఱుంగుదును మహాత్ముఁడైన రాము
సత్యమె పరాక్రమము గ నెసంగు ఘనుని
శుచి మహాతేజుఁ డగు వసిష్ఠుఁడును నెఱుఁగు
గొప్పతాపసుల్ వా రెరుంగుదురు గూడ. 303

జగమున నీకు ధర్మము యశంబును గావలె నంచు నెంచితే
జగదధినాథ! రాముని నొసంగుట యర్హము నాకు, నావసి
ష్ఠ గురువు లోనుగా సచివ సత్తము లిప్పు డనుజ్ఞ నిచ్చి వా
రగుదుర యేని నిష్టుని మహాత్ముని పుత్రుని రామునంపుమీ. 304

పదిదినాలె యజ్ఞమునకుఁ బట్టుకాల
మింక నెక్కువ దాటదు, యిదియె సమయ
మంపు రాము దశరథ! నీకొదవు శుభము
ఇందుకై యించుకయును శోకింపఁ దగవు. 305

వ. అని యిటుల ధర్మాత్ముడును మహాతేజస్కుడైన విశ్వామిత్ర మహాముని ధర్మార్థసహితమైన మాట పలికి విరమింపఁగా ఆ రాజేంద్రుడు శుభమైన విశ్వామిత్ర వాక్కును విని భయము పొంది తీవ్రమైన దుఃఖమును పొందెను. ఇంక నతఁడు ఆ హృదయ విదారక మైన ముని వచనముచే వ్యధచెంది ఆసనమునుండి చలించిపోయెను. 306

—: దశరథుఁడు విశ్వామిత్రునితో రాముని బంపలేననుట :—

అవల ఋషిపల్కు నరపతి యాలకించి
క్షణము స్మృతి లేక మది స్మృతి గాంచి పలికె
* పదియు నారేండ్లు నిండని పద్మనేత్రుఁ
డైన నారాముఁ డెటు రాక్షసాళి నోర్చు. 307

---

* పదియారేండ్లు నిండనివాడు అనఁగా నాలుగేండ్లు వచ్చినఁగాని 16 ఏండ్లు నిండని వాఁడు అని యనుకొనవలెను. ఏల యనఁగా, సీత అరణ్యవాసములో రావణుడు మారు వేషముతో వచ్చినపుడు "మమ భర్తా మహా తేజాః వయసా పంచ వింశకః । అష్టా దశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే" (అరణ్య 47). మహా తేజస్సు గల నా భర్త ఇరవై యయిదు ఏండ్ల వాఁడు, నాకు 18 ఏండ్లు అని చెప్పినది. మఱియు 18 ఏండ్లని చెప్పక ముందే, "ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామ సమృద్ధినీ తత స్త్రయోదశే వర్షే రాజాఽమంత్రయత ప్రభుః (అరణ్య. 47). ఇక్ష్వాకుల యింట 12 ఏండ్లు మానవ భోగములను అనుభవించి సర్వ కామములతో సమృద్ధి కల దానవై పదుమూడవ యేట ప్రభువైన రాజు మమ్ము అడవికి పంప ఆలోచించి చెప్పెను" అనెను. అను ఈ వాక్యములను బట్టి పెండ్లి అయిన తరువాత 12 ఏండ్లు జరగినవని తేలుచున్నది. మరియు సీత వనములో అనసూయతో "పతి సంయోగ సులభం వయో దృష్ట్వాతు మే పితా చింతా మభ్యగ మద్దీనః" (అయోధ్య. 118 సర్గ, 34 శ్లో.). పతి సంయోగానుకూల వయస్సు నాకు వచ్చుట చూచి నా తండ్రి చింతించెను. అని చెప్పిన దానిని బట్టి సీతకు వివాహ కాలమున 12 ఏండ్లు ఉండె ననవలయును. రావణునితో 18 ఏండ్లు అని చెప్పుట వలన, అట్లు చెప్పుటలో "వేదవతిగా పుట్టి ప్రహస్తుని మాట వలన రావణునిచే సముద్రములోఁ బడవేయఁబడఁగా క్రమముగా

ఇదె యక్షౌహిణిసేన, దానికిఁబతిన్నే కుండదు; నీసేనతో
కదనంబు న్నసురాళి నొర్చు వివిధోగ్రాస్త్రాళి విద్యావిశా
రదు లీభృత్యులు వీరు లారిపుల గెల్వం జాలువా రెట్లు, నీ
యదనన్ బాలుని రాముఁ దీసికొనిపో నర్హంబుగా దెట్టులున్. ౧౦౮

నేను రణరంగమున విల్లు పూని ప్రోతు
అసువు లున్నంతదాక రాక్షసుల నొర్తు
నీదు వ్రతచర్య నిర్విఘ్నమై దనర్ప
నత్తు నేనె, తీసికొనిపో వలదు రాము. ౧౦౯

---

మిథిలలో జనకునికి దొరికె ననియు ఆ దొరికిన సమయమును బట్టి పద్దెనిమిది ఏండ్లు అని చెప్పెనని గ్రహించవలయును. అనఁగా సీత పెట్టెలో వేచవతిగా 6 ఏండ్లు ఉన్న దన్నమాట. ఆరేండ్లు పెట్టిలోను 6 ఎండ్లు జనకుని యింట పెండ్లి వరకును, ఆపిదప 12 ఏండ్లు అయోధ్యలో సుఖములు అనుభవించు చున్న దనవలయును. తరువాత 13 ఏండ్లు వనములో ఒక ఏడు రావణుని యింట అయోధ్యలోను నున్నది. అందుచేత సీత పట్టాభిషేక సమయానికి 38 ఏండ్లది అని తేలినది. ఇంక రామునికి విశ్వామిత్రుడు వచ్చునప్పటికి 12 ఏండ్లు 4 తక్కువగా 16 ఏండ్లు. అనఁగా 12 ఏండ్లు. ఇదే తరువాత "ప్రత్యువాచ మహాభాగం విశ్వామిత్రం మహామునిం బాలో ద్వాదశవర్షోఽయమకృతాస్త్రశ్చ రాఘవః" అను అరణ్యకాండలో 38 సర్గ, 6వ శ్లోకమునఁ జెప్పఁబడినది సరి పోవుచున్నది. మరియు "దశ సప్తచ వర్షాణి తవజాతస్య రాఘవ" పదునేడు ఏండ్లు నీవు పుట్టి యయినవి. అని చెప్పిన వాక్యము రామునికి ఉపనయనము అయిన పిదప 17 ఏండ్ల సంఖ్యగా అనుకొనవలయును. అప్పుడు 8వ ఏట ఉప నయనము 13వ ఏట విశ్వామిత్రునితో పెళ్లుట, పిదప పెండ్లి, అయోధ్యలో కలిసి యుండుట 12 ఏండ్లు కాగా 25 ఏండ్లు నా భర్తకు అని సీత వాక్యము. కుదురును. పిదవ 14 ఏండ్లు వనవాస మైన పిదవ 39వ ఏట పట్టాభిషేకము అయినదని గ్రహింపవలయును. ఈ రీతిగా సమన్వయించుకొనవలెను.

బాలుఁడు, లేదువిద్యలను[ప్రౌఢి, కనండుబలాబలాలు, న
స్త్రాలబలంబులేదు, రణరంగవిశారదుఁడేనికాఁ, డికన్
చాలఁడు రాక్షసాళికి; నిశాటులొకూటరణాలనేర్పరుల్
చాలను, జీవముల్ నిలుపఁ జాల క్షణంబును వీడి రామునిన్. 310

మునివర ! రాముఁ దీసికొనిపోఁదగ దీవాకవేళ రాముఁ గై
కొనఁదలపోసితే ననఘ ! కూడ ననున్ చతురంగసేనతో
గొనిచను, మేను పుట్టి యిదిగో చనె * నర్వదివేల యేండ్లు; వీ
నిని నిటుగంటిబాధలెగణింపక; తీసుకపోకు రామునిన్. 311

సుతులలో రాముఁ డన నాకు నతిగ [ప్రీతి
జ్యేష్ఠ ధర్మాతు రాముఁ దీసికొని పోకు;
ఎవ రసురు లెట్టిబలవంతు లెవరిసుతులు
ఎంతలేసి వా రెవరు రక్షింౘు వీరి. 312

రాముడుఁ గాని నాదగు బలంబులు గాని మఱేమి గాని యె
ట్లేమిబదుల్ పొనర్పవలె నిప్పుడు కూటరణాలు చేయు నా
భీమనిశాచరావళికి; వీర్యబలాఢ్యులు రాక్షసుల్ గదా,
యేమెటు వారలన్ [ప్రతిఘటింపఁగ నొప్పు నిదెల్ల చెప్పుమీ. 313

వ. అంత దశరథునిమాటలు విని విశ్వామి[త్రుఁ డనియె. 314

పౌలస్త్యకులుఁడు రావణు డను రాక్షసుం
డుండె మహావీర్యుఁ డు[గ్రబలుడు

---

* "సహ[స్రం చతు రుచ్యతే" వేయి అనఁగా నాలుగు అను జ్యోతి శ్శాస్త్ర పరిభాష [ప్రకారము 60 వేలు అనఁగా $60 \times 4 = 240$ ఏండ్లు అని చెప్ప వచ్చును. ఇట్లే ఆం[ధ్ర విజ్ఞానసర్వస్వములో చెప్పఁ బడెను.

బ్రహ్మచే వర మొందిన రాక్షసుండు చనుదెంచి
మిపుల బాధించుఁ ద్రిభువనములను

సాక్షాత్తు నతడు వైశ్రవణుని తమ్ముడు
విశ్రవసుమునికి ప్రియ సుతుండు

ఆమహాబలుడు స్వయంబుగా యజ్ఞంబు
పాడుచేయుడు కాని వాడు పంప

నరిగి మారీచుండు సుబాహు వనెడి యసురు
లిరువు రిష్టివిఘ్నము నాచరింతు రెపుడు
కనుక రాముని పంపుమి యనిన మునీశుఁ
డనఁగ విని రాజు పలికెను వినయ మొప్ప. 315

వ. అమరాత్ముని కెదురుగా నేనును నిలువఁజాలను. ఓధర్మజ్ఞా ! నా చిన్ని కుమారునిపైని అనుగ్రహముచూపుము. అల్ప భాగ్యము గల నాకు నీవే దైవతమవు గురుడవు. దేవులు దానవులు గంధర్వులు యక్షులు ఉరగులు పతగులుకూడ రావణుని కెదురు నిలువఁ జాలరే యింక మానవుల సంగతి చెప్ప నేల, వీర్యవిక్రమములు గల యాతనిచేత దక్షిణ లోకపాలకుఁ డయిన సాక్షాత్తు వైశ్రవణుఁడును విల్లెక్కుపెట్టి జయింపఁబడెను. ఇట్టి స్థితిలో ఓమహానుభావా ! రాము నెట్లు తీసికొని పోవుట న్యాయము " ఆరాక్షసుడు యుద్ధములో వీర్యవంతుల పరాక్రమమును గూడ ఓడించి వేయఁగలడు. వానితోఁ గాని వాని బలముతోఁ గాని నేను బలములతోఁ గూడియు నా సుతులతోఁ గూడి కూడ ఓ మునివరా ! యుద్ధముచేయు శక్తిగలవాఁడను గాను. ఏదో విధముగ అమరులవంటి వాఁడును యుద్ధములలో నేర్పు లేని వాఁడును బాలుడునగు నా కుమారుని ఓ బ్రహ్మ ! నేను నీ కీయలేను. యమునితో సములును యజ్ఞములకు విఘ్నము చేయువారును ఆ సుందోప సుందుల కొడుకులు. అందుచే నేను నాకుమారు నీయ లేను. మారీచుడు సుబాహువును వీర్యవంతులు సుశిక్షితులు. నేను వాస్నేహితులతోఁగూడి యుండిగూడ వారిద్దఱిలో ఏయొకరితోను మాత్రమే యుద్ధము చేయగలిగియుందును. 316

అనుచు నిట్లు రాజు వచింప నాద్విజేంద్రు
డైన కౌశికున్ గడు క్రోధ మావహించె
నిండుగా మండు యజ్ఞాగ్ని నేయిపోయ
మండు నటు మహామునియగ్ని మండిపోయె. 317

—: విశ్వామిత్రుడు దశరథుని కోపింప వసిష్ఠు డోదార్చుట :—

కొమరుపైని స్నేహమున వ్యాకులము లైన
యక్షరము లొప్పు నృపవాక్కు లాలకించి
మన్యువు గల కౌశికుడు రాజన్యుతోడ
ఈవిధంబుగ నింక వచియించె నపుడు. 318

తీర్చ నిచ్చెద ననుచు ప్రతిజ్ఞ చేసి
ఇపుడు మాటతప్పుట కిచ్చగించుచుంటి
విట్టులన్ మాట యిచ్చి యు తప్పుకొనుట
రాఘవుల కులానకు చేయరాని పనియు. 319

సరియె యిది నీకు తగునేని క్ష్మాతలేంద్ర !
వచ్చినటు లిదే నేను పోవం గలాఁడ
నీ వొసగిన ప్రతిజ్ఞను వృథ యొనర్చి
స్వజనములతోడ కాకుత్స్థ ! సౌఖ్య ముండు. 320

వ. అని యిటుల ధీమంతుఁ డైన విశ్వామిత్రుఁడు రోషముతో పలుక సమస్తభూతలములు కంపించెను. దేవతలను భయ మావేశించెను. ఇటుల జగ మంతయు భయపడుట తెలిసికొని సువ్రతుడైన వసిష్ఠ మహర్షి రాజుతో నిట్లనియె. 321

ధర నిక్ష్వాకు కులంబునం దపరధర్మం బట్లు సాక్షాత్తుగా
మఱి జన్మించితి, ధీరసువ్రతివి శ్రీమంతుండ వీధర్మమే
మరు టర్హంబొకొ, మూడు లోకముల ధర్మాత్ముండ వంచుం బరం
వరగా ఖ్యాతుఁడ, వొందు ధర్మము; నధర్మంబొంద నర్హం బెటుల్. 322

చేయుమ నంచు మాట యిడి చేయని వారల యజ్ఞకూపదే
వాయుతనాది కర్మ ఫల మంత నశించును గాన రామునిన్
వే యిడి పంపు మస్త్రముల నేర్చిన నేర్వక యున్న గాని గా
ధేయుని యుండ, నన్ని సుధ తీరునఁ దాకగ లేదు రాక్షసుల్. 323

ఈతఁడు వీరులందు ఘనుఁ డీతఁడు దేహము గొన్న ధర్మమే
ఈతఁడు బుద్ధిచే నధికుఁ డీతఁడు సర్వతపోనిధానమే
ఈతఁడౌ యస్త్రశాస్త్రవిదు డెల్ల చరాచరమౌ జగత్త్రయిన్
ఈతని శక్తి దానవ మునీశ సురాము లెఱుంగ రెవ్వరున్. 324

మును సకలాస్త్రరూపులయి పుట్టి సుధార్మికులౌ భృశాశ్వ స
త్తనయులఁ బొందెఁ గౌశికుఁడు తానటు రాజ్యము నేలునప్పుడా
తనయులు నాభృశాశ్వునికి దక్షప్రజాపతి కూతులందు మున్
జననము గాంచి దీప్తి గని శౌర్యము పొంది యనేకరూపులన్. 325

వ. సుమధ్యములను దక్షకన్యలు నగు జయ సుప్రభయను వారు పరమ భాస్వరము లైన యస్త్ర శస్త్రములను గనిరి. అందు జయ మునుపు అసుర సైన్యములను చంపుటకు అయిదు వందల యుత్తమ పుత్రులను కనెను. వారు అమేయులు కామరూపులును. ఇంక సుప్రభయు ఎదుర్కొనరానట్టియు దురాక్రమములును బలీయులు నగు సంహారు లనెడి యయిదు వందల పుత్రులను కనెను. ఈవిశ్వామిత్రుఁడు యథావిధిగా ఈ యస్త్రము లన్నిటిని ఎఱుఁగును. ధర్మవేత్త యగు నితఁడు ఇంకను క్రొత్త యస్త్రములను పుట్టింపఁ గలడు కూడ. 326

ఏతాదృశ వీరుండు మ
హాతేజశ్శాలి, పృథుల యశుఁడు, మునీశుం
డై తగు విశ్వామిత్రుం;
డీతనితో రాముఁ బంప నేటికి శంకల్. 327

అసురులఁ జంపఁ జాలును స్వయంబుగఁ గౌశికుఁ, డైనఁగాని, నీ
దు సుతుహితంబు కోరి యిటు తొందరగా నరుదెంచి నిన్నుఁ గో
రె సుమి" యన వసిష్ఠుఁడు, నరేశుఁడు సద్యుఁ డుజ్జ్వలాంగుడౌ
దశరథు డంత నిష్టపడెఁ దాపసివెంటను రాము నంపగన్. 328

## —: దశరథుఁడు రామలక్ష్మణులను విశ్వామిత్రునితో పంపుట :—

అటు ముని పల్కులన్ దశరథేశుఁడు ధీరత నాలకించి యం
తట ముద మొంది వాడు వదనంబు వికాసము పొంద వేగమే
యటకును రామలక్ష్మణుల నాదృతి రమ్మన తండ్రి తల్లియున్
వటుత శుభాహమున్ జరవ, బ్రహ్మ వసిష్ఠుడు పల్కె మంత్రముల్. 329

కొమరుశిరంబు మూర్కొనుచు క్షోణిధవుం డపు డెంతొ హర్ష మొం
దు మనసుతోడఁ గౌశికునితో సుతు రామునిఁ దమ్ము నంప ఆ
సమయమునన్ సమీరములు చక్కఁగ దుమ్ములు లేక వీచె న
భ్రమునను మ్రోగె దుందుభులు బాగుగ కుర్సెను పుష్పవర్షమున్. 330

మునుకొని దివ్యశంఖములు మ్రోగుచు నుండగ ముందు మౌని వె
ళ్లెను పిదపన్ ధనుస్సును ధరియించియు రాముఁడు వెళ్లె పిమ్మటన్
జునుపములన్ ధరించి యనుజుండును లక్ష్మణుఁ డేగె; నిట్లు మౌ
ని ననుసరించి యేఁగి వనిన్ త్రిశిరస్సుల పాములో యనన్. 331

ధనుసులు ధరించి వ్రేళ్ళ రక్షణకు నుడుము
చర్మ కట్టి, ఖడ్గము దాల్చి చనిరి రామ
లక్ష్మణులు సుందరులు మునివ్రవరు వెంట
బ్రహ్మ వెంటను సశ్వదేవతలు వోలె 332

శ్రీలచే దీప్తులయి శుద్ధశీల మొప్ప
ననుజు లతని ననుసరించియరిగి నారు
* ఆ యనఘ కుమారులును మహాత్ముడైన
స్థాణు దేవుని వెనువెంటc జనిన యట్లు. 334

సరయునది దక్షిణతటి యోజనము సగము
అరిగి యపుడు విశ్వామిత్రుc డరసి రామ!
యనుచు మధురముగాc బిల్చి యనియె నిట్లు
"ఇపుడె ఆచమింపుమి! యాలసింప వలదు. 334

కై కొనుమి మంత్ర జాలము
గై కొను బల యతి బలయును ఘనమగు విద్యల్;
తాకదు శ్రమ జ్వరము వికృతి,
సోకcగ జాలరు ప్రమత్తు సుప్తుని నసురుల్. 335

ఇల నీబాహుబలం బెదుర్కొనcగ లే డెవ్వండు యోచించి చూ,
డలముల్లోకములందు నీకు సమఁ డుండంబోడుగా రామ ధీ
బలిమిన్ జ్ఞానమునందు శక్తి పటుతన్ భాగ్యాన యుక్తిప్రయు
క్తుల వాదించెడి వాc డెవండయిన నెందున్ లేడు నీకెయ్యెడన్. 336

ఈ రెండు విద్యల నేమరకుండగ నొగి నేర్వ నీసముc డుండబోcడు
బల యతిబలలు సర్వజ్ఞాన మూలము వరల వాకలి దప్పి వధి జపింప
ఈ రెండు శ్రద్ధc బఠింపcగ భూమిలో నతులయశము నీకుప్రాప్తమగును
ఇది పితామహ సుత లివి తేజస్సుతో నెసగు విద్యలని గ్రహింపుమయ్య. 337

పుడమిలో నీవె పొంద నర్హుండ వటంచు
నీవు ధార్మికుcడ వని యర్పించుచుంటి
నీయెడ నివి బహుగుణమై నెగడుచుండు
జపముచే వృద్ధిపొందు సంశయము లేదు. 338

---

* 1 అంబులపొది 2 ధనుస్సు 3 తాడు ఇవి మూడు శిరస్సులవలెనుండెను.

అవల శుచిగ రాముఁడు జలం బాచమించి
భావితాత్ముఁడౌ ఋషినుండి బల యతిబల
లంది శరదృతు నందు సహస్రరశ్మి
సూర్యభగవానుఁ డట్టుల జ్యోతినలరె. 339

సకలంబౌ గురుకార్యముల్ వినతి విశ్వామిత్రునం దుంచియున్
సుకమొప్పన్ సరయూనదీ తటమునన్ మోదంబుతో నుండి, రే
యికరంబున్ తగనట్టి గడ్డి పఱుపందే సోలి నిద్రింపఁగా
సుకముంబోలె నెసంగె రాత్రిముని రాట్పూక్తుల్ వినోదంబిడన్. 340

—: కామదహన కథ :—

తెల్లవాఱ విశ్వామిత్రుఁ డల్ల లేచి
సోలి నిద్రించు నారాజసుతులఁ బలికె
పురుషసింహ! కౌసల్యాసుపుత్త్ర! రామ!
లెమ్ము తొలిపంజ యయ్యె నర్చింపు సంధ్య. 341

మౌని యుదారవాక్కు విని మన్నసతోడుత లేచి వేగమే
స్నానము సంధ్యయున్ జప మొనర్చియు నాచమనంబు చేసి యా
మౌనికి మ్రొక్కి హర్షమున మార్గము పట్టిరిసౌనియాశ్రమ
స్థానము చేర వీరులు నుదారచరిత్రులు రామలక్ష్మణుల్. 342

చూచిరి వారు బాటఁ జనుచున్ సరయూనది సంగమం బటన్
చూచిరి యాత్రిమార్గగను శుద్ధసుఖంగను గంగఁ, దత్తటిన్
చూచిరి యేండ్లు వేల్ తపముఁ జొచ్చిన మౌనుల యాశ్రమస్థలిన్
చూచిరి పావనాశ్రమము, శుద్ధునిఁ గౌశికు బల్కిరిట్టులన్. 343
ఎవ్వని దీపుణ్యాశ్రమ
మెవ్వా రీ యాశ్రమమున నిపుడుందురు నీ

విద్విషయములు వచింపుమి
యివ్వి వినఁగఁ వేడుక జనియించెను మాకున్. 344

వారల యామాటలు విని
గౌరవమున మౌని నవ్వి కడఁగె వచింపన్
ఓ రామా! పూర్వంబున
వేరిదొ యాయాశ్రమంబు వినుము వచింతున్. 345

వ. ఇక్కడ మూర్తిమంతుఁ డగు కందర్పుఁడు ఉండెను. అతనిని కాముఁ డని బుధులు పిల్చెదరు. ఇక్కడ తపస్సుచేయుచు నియమముతో సమాహితుడై వివాహనూడ మరుద్గణములతో వెడలుచున్న దేవేశుడైన స్థాణుని ఈ కాముడు దుర్మేధయై యెదుర్కొనెను. అంత ఆ స్థాణుండు హుంకరించి రౌద్రమగు కంటిచే నీకాముని దహించెను. తరువాత దహింపబడిన యీకాముని శరీరమునుండి యవయవము లన్నియు విడి పోయినవి. అంతట ఆ మహాత్ముడైన రుద్రునిచేఁ దగులబెట్టబడి యశరీరుఁడై యీకాముడు అనంగు డనబడెను ఎక్కడనైతే కాముఁడు అంగమును విడిచెనో అది శుభమైన యంగదేశమయ్యెను వానిది యీ యాశ్రమము. పూర్వము ఆ రుద్రుని శిష్యులైన యీ మునులు నిత్యము ధర్మపరులై యుందురు వారి యెడ పాపమన్నదిలేదు. ఇపుడు 346

మనము పవిత్రమౌ నదులమధ్యను రాత్రి వసించి యోసుధ
ర్మన! తరియింత మీనదులమధ్యము, రేపటి స్నాన సంధ్యలన్
పొనరిచి హోమముల్ జపము పొల్పుగ పూర్తిగచేసి యందఱున్
మనము పవిత్ర మాశ్రమము మండపమందును, చేరుకోవలెన్. 347

అని యిటు వారు చెప్పుకొనునంత తపోధిక దివ్యదృష్టి చే
మునులు గ్రహించి యెంతయును మోదముతోడుత నర్ఘ్యపాద్యముల్

* ఈ కథకు కుమారసంభవములోని కథకు భేదముకలదు. అందులో హరునికి పార్వతిపై ప్రేమకలుగుటకు కాముడు బాణములువేసి భస్మమయ్యెనని కలదు.

ఘనముగ నిచ్చి యాయతిథి గణ్యతc గౌశికు మెచ్చి రామల
క్ష్మణుల కనంతరం బతిథిసత్క్రియ చేసిరి యర్థ మౌగతిన్. 348

ఇcక ఋషులు సత్కృతిc గని జపించి కథలు
చెప్పి రామలక్ష్మణుల రంజింప జేయు
వారు కామాశ్రమమ్మునc జేరి,రంత
కౌశికుcడు గథల్ చెప్పి సుఖంబుగూర్చె. 349

## —: మలద కరూశదేశములకథ :—

తెల్లవాఱ శత్రు దమనుల్ దేవకృత్య
మాచరించి విశ్వామిత్రు నగ్రమందు
నుంచికొని నదీతటిc జేర నుగ్రతపసు
లనఘమునులు నావను నిల్పి యనిరి యిట్లు. 350

నృపతి పుత్రుల నావ నెక్కించి ముందు
అవల నీవెక్కుశుభమౌ మహాత్మ యనcగ
కౌశికుcడు ఋషులను పూజ చేసి నదిని
దాటగ రాజపుత్రులతోడ త్వరగ నెక్కె. 351

అపు డానావయు నేటిమధ్య చనcగా నారాముc డాలించి నీ
రపు గంభీరపుఘోష; మౌనివరునిన్ ప్రశ్నించె "పూజ్యా ! గభీ
రపు ఘోషం బిది నీరుపైc బడుటచే ప్రాదుర్భవం బధదెనొ
చెపుమీ" యంచు వచింప వేడ్క యొదవన్ జెప్పెన్ మౌని ధర్మాత్ముcడై. 352

రామ ! కైలాసగిరియందు బ్రహ్మ మున్ను
మనసుచేత సర బొకదానిని సృజించె

కాన * మానస సరసం్రదు: దానినుండి
యిది వెడలి యయోధ్యను ప్రవేశించి పాఱు. 353

సరసునుండి ప్రవర్తిల్ల * * సరయు వం్రదు
వెడలి బ్రహ్మసరసునఁ బవిత్రమయ్యె
నీర సంక్షోభచే ఘోష సెగడి యిట్లు
గొప్పదై యుండె మ్రొక్కుము తప్పకుండ. 354

ధార్మికులు లఘువిక్రముల్ దరిసి నదుల
మ్రొక్కి దక్షిణతటిఁ జేరి పొదల నిండి
యుగ్రమై దట్టమౌ వనం బొకటి చూచి
పొడము భక్తి విశ్వామిత్రు నడిగి రిట్లు. 355

ఈచోటఁ గూసెడి కీచురాళ్ల ధ్వనితో
భయముగ సెఱచెడి పక్షు లడరు
అచ్చోట భయద సింహ వ్యాఘ్ర గర్జనల్
దిశల గుహలను బ్రతిధ్వనించు
ఇచట వరాహము లెంతయో గీపెట్టి
హుంకరింప గజముల్ ఘీంకరించు
అచట ధవాశ్వక ర్ణాద్రమ కకుభ తిక్త
బిల్వ తిందుక తరుల్ వింత గూర్చు

ఇచ్చటను పాటల బదరీ వృక్షగణము
ప్రబల గాఢాంధకారముల్ వ్యాప్తి చేయు
ఏవనం బిది చెప్పు మునీశ ! యనఘ !
అనఁగ నంత విశ్వామిత్రముని వచించె, 358

* మనసః సృష్టం మానసం మనసునుండి సృజింపఁబడినది అని వ్యుత్పత్తి.
* * సరసః యాతీతి సరయూః సరసునుండి వెడలినది అని వ్యుత్పత్తి.

వత్స ! యీదారుణవన మెవ్వరిదొ వినుము
దేవ నిర్మాణరచితమై స్ఫీత మగుచు
ఈజనపదమ్ము లిటఁ పూర్వ మెసఁగె నివ్వి
* మలదములు కరూశము లనం బ్రథిత మెవ్వి. 357

మునువృత్రాసురుఁ జంపినప్పుడు మలంబున్ ద్రమ్మ దేవేంద్రునిన్
వెనుకొ త్తున్ కడు బ్రహ్మహత్యయును నావేశించె, నంతన్ దపో
ధనులున్ దేవులు పుణ్యతీర్థ జల శుద్ధాత్ముంగఁ గావించి మే
నున నున్నట్టి కరూశమున్ మలతతిన్ బోగొట్టి రిచ్చోటనే. 358

అల దేవేంద్రుని దేహమం దడరి యత్యంతంబు బాధించు నా
మల దోషంబు కరూశ మీక్షితికి సమ్యక్దానముం జేసి ని
ర్మలుఁడై ముక్త * కరూశుఁడై యతఁడు హర్షం బొంది యాదేశమున్
మలదంబంచుఁ గరూశమంచుఁ బ్రథితంబై పో వరంబే యిడెన్. 359

ఇంద్రుఁ డీదేశములను మన్నింప నలరి
భేష భేషని పొగిడిరి విబుధు లింద్రు
మలదములు కరూశము లనంబరగి యివ్వి
చాల వర్ధిల్లె ధనధాన్య సంపదలను. 360

## —: తాటక కథ :—

కొంతకాలమునకు గురుకామరూపిణి
యైన యక్షి తాట కనెడి యామె
ప్రబలబుద్ధి సుందు భార్య యౌచును నిందె
గజ సహస్ర బలము గలది యుండె. 361

* మలదములు=మలము ఇవ్వబడినవి. కరూశము=ఆకలి.
* పోయిన క్షుత్తు గల వాఁడై.

ఆమె పుత్త్రుఁడు మారీచుఁ డనెడి యసుర
ఇంద్రబలుఁడు, గుండ్రని బాహు లెసఁగు వాఁడు
పెడఁద మొగము మేను గలవాఁ డడరి యిటనె
జనుల భయపెట్టుచుండును ననుపదంబు. 362

సతత మీమలద కరూశ జనపదములఁ
జేరి దుష్ట తాటకయు నశింపఁ జేయు
మీరి సగము యోజనములో దారి నడ్డ
గించియున్న, దీపథి మన మేగవలయు. 363

ఇంక నీబాహుబల మాశ్రయించి వేగ
యిపుడు నా యాజ్ఞచే దుష్ట నీమెఁ జంపి
జనపదమును నిష్కంటకమును బొనర్చు
ఇట్టి చోటికి రాజాలఁ డెవ్వడైన. 364

సైచరాని యక్షి యిదెల్ల క్షయ మొనర్చె
ఇట్టి యుగ్రవనము గూర్చి యిట సమస్త
మెఱుఁగఁ జెప్పితిఁ దెలిసికో యిపుడు కూడ
మానకుండెను క్రూరకర్మలను నీమె. 365

ఇటుల నప్రమేయుఁ డగుమౌనీశు పలుకు
విని నరవ్యాఘ్రు డగురాముఁ డనియె శుచిగ
యక్షు లల్పవీర్యు లనుచు నాలకింతు
మెటుల గజసహస్ర బలాన నెసఁగె నబల. 366

అనఁగ విదితాత్ముఁ డగురాముఁ డనినమాట
లాలకించి విశ్వామిత్రుఁ డనియె నిటులు
అబల వరముచే నెట్టులు నబల యయ్యె
వినుము కేతు డన యక్షుండు వెలయు నిచట. 367

అతఁడు సంతతి లేనివాఁడగుట శుచిగ
తపము చేయ పితామహుఁ డపుడు మెచ్చి
యక్షునకు తాటక యనుకన్యను నొసంగి
గజసహస్రబలము కూడ కన్య కిచ్చె. 368

ఘనయశుఁడు బ్రహ్మ వానికి తనయ నీయఁ,
డామె రూపయౌవన వతి యయి యొసంగె
జనకుఁడును ఝర్ఝ సుతుఁడు సుందునికి నిచ్చి
సతిగఁ జేయ మారీచుడన్ సుతుడు పుట్టె. 369

వాఁడె మారీచుఁ డతఁడు శాపమున నసుర
యయ్యె, సుందుఁడొ మరణింప నామె- సుతుడు
నిర్వైరు ఋషి యగస్త్యుని నెదురుకొనుచు
తినుటకు నయి గర్జించుచు మునిని దరియ. 370

ఋషి యగస్త్యుఁడు భగవంతుఁ డెంతొ యలిగి
రాక్షసుండ వగు మనుచు శాపాక్షరంబు
లిచ్చి తాటకం గూడ శపించె "నోసి
పురుషులను దించు వికృతవై తిరుగు" మనుచు. 371

ఈమెయు శాపముం బడసి యెంతయు నల్కను నొళ్లుఱుంగకే
రామ ! యగస్త్య నాయడుగులన్ శుచియౌ భువిఁ బాడొనర్చెడిన్
ఈమెను దుష్టయక్షిని వధించుము బ్రాహ్మణ గో హితంబుకై,
ఈమెను శాపదూషితను నెవ్వఁడు నిర్విడి చంపలేఁ డిలన్. 372

స్త్రీని వధింప నీవు ఘృణ చెంతకు నుంతయు మానవాగ్ర్య ! రా
ట్పానుడు నాల్గువర్ణములఁ జూచి హితంబును చేయ నొప్పు, భూ
జాని నృశంస మైన నసృశంసమ యైనను నెట్టి పాతకం
బైన సదోషమైనను ప్రజావళి రక్షకుఁ జేయఁగా వలెన్. 373

రాజ్యభారము దాల్చు రాజుల ప్రాచీన
ధర్మ మియ్యది యిం దధర్మ మేది
ఈమె దగ్గర ధర్మమే లేదు కావున
ఈమె నధర్మను నిపుడె చంపు
ఇటు విరోచనసుతఁ బృథివిఁ జంపఁగఁ గోరు
మంధర నింద్రుఁడు మఱి వధించె
లోకాన నింద్రుఁడు లేకుండుత మనుకా
వ్యజననిఁ బృగుపత్ని హరియుఁ జంపె

వీరు నితరులు మహాత్ములౌ వీరనరులు
చాలమంది యధర్మలౌ స్త్రీలఁ జంపి
రిది సనాతన ధర్మంబ యిపుడు నీవు
నీవిషయమున నిఁక సంశయింప వలదు. 374

పౌరుషమున్ వెలార్చు ఋషి వాక్యములన్ విని భక్తితోడ నా
పూరుషవర్యుఁ డంతటను మోమున దోసిలి యొగ్గి యిట్లనెన్
"వారక తండ్రి యాజ్ఞవలనన్ పితృవాక్కుల గౌరవంబునన్
మీరక కౌశికోక్తులను మెకొని శంకలె లేక చేయుదున్. 375

వరగురు వైన కౌశికుని వాక్యప్రకారము చేయు మంచు నన్
గురువులముం దయోధ్య సభలో జనకుం డటు లాజ్ఞ చేయగా.
సరి యని సమ్మతించితి వెసన్ పితృవాక్పరిపాలకుండనై
గురువగు కౌశికాజ్ఞ గొని కొంకక చేయుదు తాటకావధన్. 376

ఏను గోబ్రాహ్మణులకును హితము చేయఁ
జూచి యీదేశమునకును సుఖము గూర్ప
అప్రమేయుండ వగు నీదు నాజ్ఞ చేయ
నిప్పు డిటు సిద్ధపడితి గ్రహింపుమయ్య. 378

అనుచున్ రాముఁడు దీక్షసౌ ధనుసు మధ్యన్ ముష్టి బంధించి నా
రిని టంకారము చేసి దిగ్గుహల పూరింపంగ నానాదమున్
విని మూర్ఛిల్లిరి తాటకావనమునన్ గ్రీడించు రాత్రించరుల్
విని మోహంబున నుల్కి తాటకయు వేవే వచ్చి పైఁబడం బడెన్. 379

వికృతాకారముతో భయంకరముగా మిన్నంటు దేహంబుతో
నికటక్షోణికి వచ్చి యార్చుచు వడిన్ మీఁదం బడం జోవు తా
టక నీక్షించుచుఁ బల్కె లక్ష్మణునితోడన్ రాము డో లక్ష్మణా,
యిఁక నీమెన్ గను మెంత భైరవముగా నీయక్షి మేనున్నదో. 380

ఈమె మహోగ్ర రూపు గన నింతనె భీరుల గుండె బ్రద్దలౌ
నీమెయు మాయఁ బూనియు మదించి దెసెటుల్ గనరాకయున్నదో
ఈమెకు నగ్రనాస చెవు లిత్తరిఁ గోసి మరల్తు నింక నే
నీమెను స్త్రీ స్వభావను వధింపను దుర్బలఁ జేసి త్రోలెదన్. 381

అని రాముండు వచించు నంత త్రుటిలో నట్లన్ మెయిన్ మర్చి గ
ర్జనలన్ తాటక బాహు లెత్తి వడిగా రామున్ సమీపింప మున్
చని యామెన్ బెదరించి హుంకరిలి విశ్వామిత్ర బ్రహ్మర్షియున్
ఘనకళ్యాణము రామలక్ష్మణుల కౌఁగా కంవిడెన్ దీవనల్. 382

దుమ్మును జిమ్ముచుఁ దాటక
దుమ్ముల రాఘవుల ముంచి తోచనటు ముహూ
ర్తమ్మెనరించి శిలావ
ర్షమ్ములు మాయఁ గురిపింప రాముండంతన్. 383

శరవర్షంబుల రాళ్ళవర్షము త్రుటిన్ శాంతింపఁగాఁ జేసి భీ
కరియై పర్విడుచున్న యామె కరముల్ ఖండింపఁగా నుక్కి చె
చ్చెర మీఁదంబడునామె ముక్కుచెవులన్ ఛేధించి యాలక్ష్మణుం
డరయన్, తాటక కామరూపమున మాయం బయ్యె శీఘ్రమ్ముగన్. 384

కనఁబడకయు తాటక జ్యా,
స్వనమున మూర్ఛిల్లి లేచి పఱచుచు, వరముల్
కొని నముచి తనయ దేవేం
ద్రుని విష్ణునివలెను రాళ్ళఁ ద్రోయుచు మించెన్. 385

అది గని మునియెను గౌశికుఁ
డిదిగో రామ! ఘృణ గొనకు మీమెయి పాపా
త్మ దురాచారిణి యజ్ఞము
నిదె పాడొనరించు మాయ నిటు వర్ధిల్లున్. 386

ఇదిగో నీ మెను జంపుమి
ఇదె సంధ్యాకాల మయ్యె నిది సంధ్యలలో
మదమున వర్ధిలు నసురుల
నెదురుకొనుట కష్టమౌను నీసంధ్యలలో 387

అనఁగా రాముఁడు శబ్దవేధి శరమున్ హస్తంబునం దాల్చి-యా
తనిపై లక్ష్మణుపై పడిం బిడుగు చందం బొంది మేనన్ పడం
గను నేతెంచెడి తాటకన్-శరము వక్షఃస్థానమం దేసి చం
పెను నావేళను దేవతల్ దివిని మేల్మేలంచుఁ గీర్తింపఁగన్. 388

అంత సురలు దేవేంద్రుఁడున్ హర్ష మొంది
కౌశికుని నభినందించి “కౌశిక! యిఁక
రాఘవులకు తపోబలామోఘ శరము
లిడుము దేవ కార్యము” గావింత్రు వీరు. 389

అని సురలు చన, రామలక్ష్మణులశిరము
మౌని మూర్కొని మెచ్చుచుం బలికె రామ!
ఇటనె నిశ యుండి రేపింక నిచటనుండి
మాదు నాశ్రమంబునకును బోదు మయ్య. 390

అనఁగ కౌశికు మాటల కలరె రాముఁ
డపుడు శాపంబు విడిచిన యావనంబు
చైత్రరథ మట్లు వెలయు మెచ్చంగ సురలు
అటనె వారుండిరి, ముని ప్రొద్దుటనె లేఁ, 191

—: విశ్వామిత్రుఁడు సర్వాస్త్రములు నిచ్చుట :—

వ. పిదప మహాకీర్తి గల విశ్వామిత్రుఁడు ఆరాత్రి యచట గడిపి చిరునవ్వు నవ్వుచు మధురాక్షరములతో రాముని కిట్లనియె. "ఓమహాకీర్తి గలరాజపుత్రా ! సంతసించితిని. నీకు భద్ర మగుగాక. ఎక్కువ ప్రీతితో నీ కింకను అస్త్రము లిచ్చెదను గైకొనుము. వానివలన దేవతలను రాక్షసులనే గాదు గంధర్వులను ఉరగులను వశపఱచుకొని జయింపగలవు. ఇదిగో దండచక్రము. ఇది మహా దివ్య మైనది. ధర్మచక్రమును కాలచక్రమును విష్ణుచక్రమును ఇంద్రాస్త్రమును వజ్రాస్త్రమును శ్రేష్ఠ మైన శైవశూలమును బ్రహ్మశిరో నామకాస్త్రమును ఐషీకమును బ్రహ్మాస్త్రమును ఇచ్చెదను గ్రహింపుము, ఇదిగో రెండు గదలు, రెండు మోదకులు, రెండు శిఖరులు దీపించుచున్నవి. వీనిని గ్రహింపుము. రామ ! ధర్మపాశమును, కాలపాశమును, వరుణపాశమును, వారుణాస్త్రమును, శుష్కార్ద్రములైన అశనుల నిచ్చుచున్నాను తీసికొనుము. పైనాకాస్త్రమును, నారాయణాస్త్రమును, ఆగ్నేయమును, శిఖరమును వాయవ్యమును, ప్రమథనమును ఇచ్చుచున్నాను. హయశిరోస్త్రమును, క్రౌంచాస్త్రమును, రెండు శక్తులను, కంకాలమును, ఘోర మగు ముసలమును, కాపాలమును, కంకణమును ఇచ్చుచున్నాను. అసురులు వేని నైతే ధరించుచున్నారో వానిని గూడ ఇచ్చుచున్నాను. వైద్యాధరాస్త్రమును, నందనమును, అసిరత్నమును, గాంధర్వాస్త్రమును, దంతమును, మానవమును, ప్రస్వాపనమును, ప్రశమనమును, సౌరాస్త్రమును గ్రహింపుము. దర్పణమును, శోషణమును, సంతాపమును, విలాపనమును, మదనమును, దుర్ధర్షమును, కంద

ర్వదయితమును, ఇచ్చుచున్నాను. పైశాచాస్త్రమును, దయితమును, మోహనమును నరశార్దూల ! గ్రహింపుము. తామసమును, సౌమనసమును, సంవర్తమును, ఎదురొక్కనరాని మౌసలమును, సత్యాస్త్రమును, మాయాధరమును, పరుల తేజస్సును పోఁగొట్టు తేజః ప్రభమును, సౌమాస్త్రమును, శిశిరమును, త్వష్టి అస్త్రమైన సుదామనమును, భగుని దారుణాస్త్రమును, శీతము లందుప యోగింప మానవమును, మహాబాహా ! కామరూపము లైన మహాస్త్రములను శీఘ్రముగా తీసికో" అని పలుకుచు తూర్పుగా మొగముంచి ఆవిశ్వామిత్రుడు శుచి యై ప్రీతిలో దేవతలును గూడఁ బొందలేని మహాస్త్రములను రాఘవుని కుపదేశించెను. ఆవిశ్వామిత్రమహాముని జపించుచుండఁగా మహార్హంబు లైన మహాస్త్ర దేవత లన్నియు సమీపించి దోసి లొగ్గి "ఓ రాఘవా ! మేము నీకు ఈనాటినుండి కింకరుల మైతిమి. అనఁగా ఆరాముడు వానిని చేతితో ప్రతిగ్రహించి, "సనే నామానసమందు ఉండురుగాక !" అని వానిని చోదన చేసి ఆవిశ్వామిత్రునకు నమస్కరించి ముందు ప్రయాణమునకు ఉపక్రమించెను. 392

## —: అస్త్రోపసంహారము :—

వ. అట్లు రాముఁడు సంతోషము గలిగి శుచియై నడచుచు విశ్వామిత్రునితో నిట్లనియెను. "ఓభగవానుడా ! నేను అస్త్రములను గ్రహించితిని. నేటి నుండి నీదయచే సురలకు ఎదురింపరాని వాఁడ నైతిని. వీనికి ఉపసంహారమును గూడ తెలుపఁ గోరుచున్నాను." అని పలుక విశ్వామిత్రమహాముని సుప్రీతుఁడై ధీరుఁడై శుచియై యాయస్త్రముల యుపసంహారమును చెప్పెను. పిదప మహాముని సత్యవంతము సత్యకీర్తి ధృష్టము రభసము ప్రతీహారతరము పరాఙ్ముఖముఅవాఙ్ముఖము లక్షాక్షము విషమము దృఢనాభము సునాభకము దశాక్షము శతవక్త్రము దశశీర్షము శతోదరము పద్మనాభము మహానాభము దుందునాభము సునాభకము జ్యోతిషము కృశనము నైరాశ్యము విమలము యోగంధరము హరిద్రము దైత్యము ప్రశమనము సార్చిర్మాలి

ధృతిర్మాలి వృత్తిమంతము రుచిరము పితృసౌమనసము విధూతమ కరము శరవీరకరము ధనము ధాన్యము కామరూపము కామరుచిమోహనము మరణము జృంభకము సర్వనాభము సంతానము వరణము అను భృశాశ్వతనయులైన యస్త్రదేవతలను కామరూపులైనవానిని రామునికి గ్రహింపుము అని యిచ్చి "రామా! నీవు వీనికిఁ దగినవాఁడవు" అని చెప్ప "సరె" అని రాముఁడు గ్రహించెను. ఆయస్త్రములలోఁ గొన్ని అంగారమువంటివి. కొన్ని పొగవంటివి. కొన్ని సూర్యచంద్రుల వంటివి. ఇవి యన్నియు అంజలి పట్టి మధురముగా నిట్లనెను. "ఓ! నరశ్రేష్ఠా! శాసింపుము. మే మేమి చేయవలయును" అనగా ఆరాముఁడు "నామనస్సున నుండుడు. సమయము వచ్చినపుడు నాకు సాయపడుదురుగాని, మీరు మీచోటికి పెళ్ళుఁడు" అని రఘునందనుఁడు వానితోపలుక అవి రామునికి ప్రదక్షిణముచేసి రాముని సెలవంది "అట్లే చేయుదుము" అని కాకుత్స్థునితోఁ బలికి వచ్చినట్లు వెళ్ళెను. పిదప రాముడు బ్రహ్మవాది యైన విశ్వామిత్రుని అనుజ్ఞ పొంది ఆయస్త్రము లన్నిటిని లక్ష్మణునికిఁగూడ ప్రయోగము ఉపసంహారమును నివేదించెను. అంత వారు నడచుచు విశ్వామిత్రమహామునితో మధురముగా వినయముగా నిట్లనిరి. 393

అదిగో నచట మేఘము వోలె నద్రిదరిని
వృక్షముల గుంపు కన్పడి వింత గూర్చె
జంతువులతోడ రమ్యమై చక్కఁగాయు
పక్షిగుంపుల ధ్వనులతో వరలె మిగుల. 394

ఒడలికిని గగుర్పాటిడు నడవిదాటి
వచ్చితి మనుకొం దిది సౌఖ్యవంత మగుట
ఎఱుఁగజెప్పు మహాభాగ! యియ్యె దెవరి
యాశ్రమమ్ము ప్రశాంతమై యలరుచుండె. 395

ఎచట బ్రహ్మఘ్నులై యెవ్వ రెంతొ చెడుగు
చేయుచును యజ్ఞవిఘ్నంబు చేయుచుండ్రొ
దాని కీదేశమేది, చంపఁదగిన యసురు
లెవరు, దేనిఁ గావవలె నిద్దె3ఁ జెపుమ. 396

## —: సిద్ధాశ్రమము - వామనుని చరిత :—

వ. అని రాముఁ డడుగ మహాతేజస్వి యగు విశ్వామిత్రమహాముని యిట్లని వివరింప సాగె. 397

ఇచటన్ దేవవిభుండు విష్ణువు తపంబెన్నేండ్లొ యెన్నో యుగాల్
సచరింపం దగె, నిద్దె వామనుడు పూర్వం బున్న సిద్ధాశ్రమం
బిచటన్ సిద్ధుఁ డొనర్చె దారుణతపం; బింద్రాదులన్ దేవతా
నిచయంబున్ బలిచక్రవర్తి యిపుడే నిర్జింప దీనాత్ములై. 398

విబుధు లగ్నితోఁ గూడియు విష్ణుకడకు
వచ్చి యని రిటు : బలిచక్రవర్తి యిపుడు
యజ్ఞమును చేయుచుండె నయ్యదియె పూర్తి
కాక ముందేగి మనపని గడపవలయు. 399

అతడు దరికేగు నర్థుల కడిగినదియు
నిచ్చుచుండెఁ గావున దేవహితముకొఱకు
మాయతో వామనుండవై చేయు మాకు
అని వచించి వారు యథేచ్ఛ నరిగినారు. 400

అయ్యె దిటులుండఁ గాశ్యపుఁ డగ్నిసముఁడు
దేవి యదితితో నోజస్సు దీప్తి పొంద
దైవ మగు వేలయేండులు తపము చేసి
యావ్రతము ముగించి స్తుతించె హరిని నిటుల. 401

110

హే విభువా ! తపోమయుండ, వీవు తపోనిధి, వీపహో తపో
భావుండవున్, తపస్స్వరూపివి, తపం బొనరించి తపస్సుచే నినున్
నేవిధిగాం గనుంగొనితి నీమెయి నెల్ల జగాలు చూచెదన్
నీవొ యనాది నెవ్వడవొ యెట్టిండవో నిను నాశ్రయించితిన్. 402

అని పలుకు కశ్యపుం జూచి యనియె విష్ణు
విపుడు కోరుకో వర మేదయిన నీవు
వరము పొంద నర్హుండ వనం బలికె నపుడు
కశ్యపుండు మరీచి సుతుండు కరము పొంగి. 403

ఈసురలు నేను నిన్ను ప్రార్థించుచుండ
ప్రీతి వరమీయం దగుదువు, వినుము వరద
పుత్రుండ వయి యదితి యందు పుట్టి, యింద్రు
ననుజుండయి సాయపడి ప్రోవు మూర్త సురల. 404

ఇది సిద్ధాశ్రమ మిందుం గార్యములు సిద్ధింపంగ ఈపేరుతో
విదితంబౌభగవానుడా యనంగ ! ఆవిష్ణుండు శీఘ్రంబ యా
యదితిన్ వామను పేరం బుట్టి సురరక్షార్థంబు యావామనుం
డిదె వచ్చెన్ బలిచక్రవర్తి దరికిన్ హేలన్ జగత్పూజ్యుండై. 405

వెడలి మూం డడుగుల భూమి భిక్ష మడిగి
గైకొనియు భూతహితుం డౌచు లోకరక్ష
నాచరింప త్రిలోకంబు లాక్రమించి
బలిని త్రొక్కి లోకములు దేవపతి కిచ్చె. 406

శ్రమ పోంగొట్టెడి యాశ్రమం బిదియ పూర్వంబందు నిందే త్రివి
క్రముం డుండెన్ జుమీ, మేము వామనునిపై రాజిల్లు భక్తిన్ వసిం
తు మిటన్, రాక్షసు లిష్టి విఘ్నముల నెందున్ వచ్చి గావింతు రా
శ్రమమందే, యిట రాక్షసాళిని వడిన్ జంపందగున్ రాఘవా ! 407

మనము పోద మీయాశ్రమమునకు నిపుడె
మాదె కాదాశ్రమం బిది మీది కూడ
అనుచు రామలక్ష్మణులతో, మునియు- మంచు
చన, పునర్వసు సహిత చంద్రునిగ వెలిగె. 408

అంత సిద్ధాశ్రమ నివాసు లరసి మునిని
యెగిరి యెగిరి విశ్వామిత్రు నెంతొ తగిన
గతులఁ బూజించి యారాజసుతుల కపుడు
నతిథి సత్కారములఁ జేసి రాశ్రమమున. 409

క్షణము విశ్రమించి క్షితీశతనయు లపుడు
అంజలి ఘటించి వరముని కనిరి మౌని !
"దీక్షగొనుము సిద్ధాశ్రమ మీక్షణంబు
సిద్ధమై త్వదుక్తిని సత్యసిద్ధిఁ గనుత. 410

అనుచు రామలక్ష్మణు లన నామహాత్ము
డైన కౌశికుఁ డట దీక్షఁ బూని నియతి
నుండె, వారు శ్రద్ధగ రాత్రి యుండి యుదయ
మున జపించి మ్రొక్కిరి వ్రేల్చు మునికి భక్తి. 411

—: రామలక్ష్మణులు విశ్వామిత్రుని యాగ రక్షణకై సిద్ధపడుట :—

ఎప్పు డెక్కడ నేమాట చెప్పవలెనొ
అట్టి దేశకాలపు విషయాలు తెలియు
రాజసుతులు విశ్వామిత్ర బ్రహ్మఋషికి
ననిరి శత్రుదమనము చేయంగ దలఁచి. 412

అనఘ ! భగవంత ! ఏసమయంబునందు
రాక్షసులనుండి కావవలయునొ చెప్పు
ఎట్టి సమయంబును నతిక్రమింపరాదొ
ఈసమయ మేదొ వినవెంతు మెఱుగఁ దెలుపు. 413

ఇట్లు పలుకుచు రణ మొసరింపఁ గోరు
రాజసుతుల మెచ్చుచు ఋషుల్ పలికి రపుడు
"ఇదియు మొదల లాఱు నిశలు రక్షింపవలయు
మౌని యితఁడు దీక్షను బూని మౌన మూను." 414

అనఁగ విని యశస్వులు రాజతనయు లపుడు
నిద్రలేకుండనే, యాఱునిశలు పవలు
లాశ్రమము కావ ధను వూని యా మునీశు
నెంతగానొ సేవించి రక్షించినారు. 451

అవల నారీతి చేసి యాఱవ దినాన
తమ్ముని కనె రాముఁడు "సిద్ధముగ శ్రద్ధ
గలిగి యుండ"ని రాముండు పలుకుచుండ
ఋత్విజులు బ్రహ్మ గలవేది యెంతొ మండె. 416

దర్భలు చమసములు సమిధలు స్రువంబు
లలరు లొప్పి విశ్వామిత్రు డాహుతు లిడ
ఋత్విజులు మంత్రములు పఠియించుచుండ
యజ్ఞవేది జ్వాలలతోడ నతిగ మండె. 417

—: మారీచ సుబాహులు యజ్ఞవేదిక పైని రక్తధారలు పోయుట :—

అప్పు డాకాశమున ఘోర మైన చప్పు
డొడవె వర్షకాలమున మబ్బులను క్రమ్మి
నటులు మారీచుఁడు సుబాహు వనెడి యసురు
లంత నార్చి పర్విడి వచ్చి రపుడు మింట. 418

వారితోఁ గూడ భీమరూపాలు గలిగి
అనుచరులు నఱుచు నరుగుదేఱ
వేదిదరి రక్తధారలు మీద పోసి
రచట వేది మండెను రాముఁ డపుడు చూచి. 419

అనియె లక్ష్మణ! మాంసాలు తినెడి వీరిఁ
గనుము దుష్టులన్ మబ్బులన్ గాలివోలె
చిమ్మెదను వెల్గు మానవాస్త్రమ్ముచేత,
అనుచు మారీచు ఱొమ్మున నస్త్ర మేసె. 420

రాముఁడు మారీచుని సముద్రములోఁ బడఁగొట్టి సుబాహుని చంపుట

గొప్ప మానవాస్త్రముచేతఁ గొట్టఁబడిన
యుగ్రమారీచుఁడును నూరు యోజనములు
చిమ్మఁబడి సముద్రపు నీటఁ జేష్ట లేక
పడ దొరలఁ జూచి రాముఁడు పలికె ననుజు. 421

చూడు లక్ష్మణ! ధర్మము చూచి వేయఁ
బడిన యామానవాస్త్రము వాని కిపుడు
స్మృతిని పోగొట్టెఁ బ్రాణముల్ తీయ దింక
చంపెదఁ గనుము యజ్ఞఘ్న రాక్షసుల నిపుడే. 422

అనుచుఁ లక్ష్మణుఁ బలికి నేర్పును దలిర్ప
గొప్ప యాగ్నేయమస్త్రము కొంచునతఁడు
ఆసుబాహుపై వేయఁగ నతఁడు పడెను
నవల వాయవ్యమునఁ జంపె నసురగణము. 423

* త్స్వరు సహిత ఖడ్గము శరాలు తనరు రాముఁ
డపుడు యజ్ఞము పాడుచేయుంగ వచ్చి
పట్టి రాక్షసుల వధింప- సమర విభుని
యటు-జయించు రాముని మెచ్చిరంత ఋషులు. 424

వ. పిదప యజ్ఞము ముగియఁగా విశ్వామిత్రమహాముని దిక్కులు నిర్బాధములయి పోవఁగా కాకుత్స్థునితో ఇట్లనెను. ఓమహాబాహూ ! నేను కృతార్థుఁడ నైతిని. నీవు గురువాక్కు చేసితివి. ఓయశస్వీ ! దీనిని సత్యముగా సిద్ధాశ్రమముగా నిప్పుడుగదా చేసితివి అని, 425

—: విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మిథిలకుఁ దీసికొని వెళ్లుట :—

యజ్ఞమును గాధి కృతకృత్యు డగుటవలన
చాల ముద మొంది రామలక్ష్మణులు నటనె
రేయి యుండి ప్రొద్దుట దినకృత్యములను
చేసి కొని వచ్చి కనిరి కౌశికుని మునుల. 426

కని ముని పదాబ్జముల ప్రాలి యునలుఁ బ్రోత
వెలుగు మునితో నృపతిసుతుల్ వినయ మొప్ప
మధురముగఁ బల్కి రనఘ ! మే మిదిగొ నుంటి
మనుచరుల మేమొనర్తుమొ యాజ్ఞ యిమ్ము. 427

* "త్స" అనునది "తత్సవితుః" అను గాయత్రి మంత్రములోని రెండవ బీజాక్షరము. ఇంతవరకు మూలరామాయణములో "త"తో మొదలైన వేయి శ్లోకము లైనవి. ఇంక రెండవ వేయి శ్లోకములకు ఈ యక్షరము మొదలు

ఇటులఁ బల్కి విశ్వామిత్రు నెదుట నుంచి
కొనుచు మునులెల్ల రాముని కనిరి యపుడు
నృపవరులు ! మిథిలేశు జనకు నింట నొక్క
పరమ ధార్మిక యజ్ఞంబు జరుగుచుండె. 428

అటకు పోదము మాతోడ నరుగుదెమ్ము
అచట పరమాద్భుత మగు విల్లు లరుచుండె
చూచెదవు గాని యదియుఁ జూడఁదగిన
దందుచే నీవు తప్పక యరుగుదెమ్ము. 429

అప్రమేయ బలము గల యాధనుస్సు
మునుపు దేవత లిచ్చిరి జనకుసభకు
దేవ గంధర్వరాక్షసుల్ దీని నెవరు
నెక్కిడఁగ లేరు నరులమా టేమి చెప్ప. 430

ధనువుశక్తిని తెలిసికోఁ దలచివచ్చి
బలులు రాజులు రాజపుత్త్రులును గూడ
నెత్తలేక పోయిరి, మిథిలేశు ధనుసు
అద్భుతం బైన యదాని నరయఁ గలవు. 431

యజ్ఞఫలముగ జనకుఁడు నడిగె దాని
దేవు లిచ్చిరి; యాగపు దైవ మదియు
రాజుకడ పుష్ప గంధ మాల్యములతోడ
రోజురోజు పూజలనంది రాజిలుఁజుమి. 432

వరముని యిటుబల్కి వనదేవతల కడను
సెలవు గైకొని మీకింక క్షేమ మవుత
గంగకు నుదక్తటి హిమాద్రికడకు బోద
మని ఋషులు రాట్సుతులు రాఁ బ్రయాణ మయ్యె. 433

వినుత సిద్ధాశ్రమ ప్రదక్షిణము చేసి
మునియు నుత్తరదిక్కుగాఁ బోవసాగె
బయలుదేఱు మౌనితో బ్రహ్మవాదు లెల్ల
నూరుబండ్లతో వెనుకగ నొప్పయినారు. 434

అల సిద్ధాశ్రమమందు నున్న పశుపక్ష్యాదుల్ మహాత్మున్ మునిన్
వలగా వచ్చుచుతోడుతో ననుసరింపన్ వాని మళ్లించి, వా
రలు సూర్యుఁడును వ్రాలుచుండ పథి దూరంబేగి యచ్చోట న
వ్వలి శోణాతటమందు నాడినమునన్ వాసంబు గావించిరే. 435

అర్కుఁ డస్తమింపఁగ స్నాన మాచరించి
హోమముల వ్రేల్చి కౌశికు నుంచి ముందు
మునులు కూర్చుండ రాముఁడున్ మునులఁ గొల్చి
ధీరుఁ డగు కౌశికుని ముందు కూరుచుండె. 436

జనమాన్యుం డగురాముఁ డంత ముని విశ్వామిత్రుఁ బ్రశ్నించె నో
యనఘా ! యీవనరాజిచేత రమణీయం బీప్రదేశం బెదో
వినఁగాఁ గోరెదఁ జెప్పు నద్భుఁడ విదే వేడ్కయ్యె విన్పింపుమీ
యన మౌనీశుఁడు సర్వసంయములమధ్యన్ జెప్ప సాగెన్ వడిన్. 437

—: కుశనాభకన్యోపాఖ్యానము :—

కుశుఁ డనుతపోనిధి బ్రహ్మకొడుకు కలఁడు
అతఁడు క్లిష్టముగా నట్టివ్రతము ధర్మ
మెసఁగుహాఁడు సజ్జనులను నెల్లయపుడు
పూజచేయుచు ఘనుఁ డయి పొలుచువాఁడు. 438

ఆ మహాత్ముఁ డుత్తమకులమునందు పుట్టి
యుక్త యైన వైదర్భియన్ యువతియందు
కనెఁ గుశాంబుఁడు కుశనాభుఁడును నధూర్త
రజసుఁడు వసు వన్నల్వు రాత్మజుల ఘనుల. 439

సత్యమతులు దీప్తులు మహోత్సాహయుతులు
ధార్మికులు నైన సుతులతో ధర్మకాంక్ష
అనెఁ గుశుఁడు "పుత్రులార! రాజ్యంబు పాల
నంబు చేయుడు ధర్మమున్ బడయుఁ డిపుడు. 440

కుశుమాటల్ విని యాకుశాంబుఁడు పురిన్ గూర్పించెఁ గౌశాంబినిన్
కుశనాభుండు వడిన్ మహోదయపురిన్ పుణ్యాన నిర్మించె, లీ
ల శుభం బొప్ప నధూర్తరాజసుఁడు ధర్మారణ్యమున్ దీరిచెన్
వసుపుత్రుండు గిరివ్రజాఖ్యపురమున్ గట్టించె లోకేచ్ఛచే. 441

ఈ గిరివ్రజ వసుమతి యామహాత్ముఁ
డయిన వసువు పాలింప విఖ్యాత మయ్యె
వెలసె నైదుకొండ లిచట వీనినడుమ
తగె సుమాగధి నది పూలదండవోలె. 442

మగధదేశాలఁ బేరొందె మాగధినది,
ఆ మహాత్ముఁడౌ వసువిది; అదియు తూర్పు
దిక్కుగా బైలుదేఱెను ధీర! రామ!
అదియు సుక్షేత్ర; మొప్పె సస్యాలతోడ. 443

## —: కుశనాభుని చరిత్ర :—

అతిధర్ముండు మహాయశుండు కుశనాభాఖ్యాకరాజర్షి యో
గ్య తనూరోచి ఘృతాచియందుఁ గనియెన్ గన్యాశతంబంత వా
రతిలోకాకృతి ప్రాయముం గలిగి యుద్యానాల వర్షాలలో
ద్యుతులం జిమ్ము మెఱుంగుఁదీవ లటుకాంతుల్ తొణ్కఁ గ్రీడింత్రహో. 444

గేయాల్ పాడుచు నాడుచు
వాయించుచు నెల్లయెడల, బహుభూషణముల్
ఏయెడఁ గాంతులు చిలుకఁగ
నాయొయ్యారులు కులికి యులికి రతిమోదముతోన్. 445

చారుతర సమస్తాంగులు
వారలు రూపమున ధరణి ప్రతి లేకుండన్
ఆరామంబుల చేరియు
నీరదములఁ దారక లటు నింపిరి ద్యుతులన్. 446

సకలగుణంబులన్ వరలి సౌరు సురూపము ప్రాయమున్న యా
సకియల వాయుదేవుఁడు వెసన్ గని యిట్లనె "మిమ్ముఁగోరితిన్
ఇక నిట నాకు భార్యలయి యెప్పుడు నుండిన మీమనుష్యతల్
వికల మగున్, జిరాయువును వెంటనె మీరలు పొందుఁ డింతటన్. 447

అనయము చంచలం బెపుడు యౌవన, మింకను నెంతొ మర్త్యులన్
కనుకనె యౌవనంబు క్షయి కానటు మీరలు కం డమర్త్యులై
యని యనిలుండు పల్క సుఖమౌ పని చేసెడి వాయువాక్కులన్
విని యవహాస మొప్ప వినిపించిరి నూర్గురు కన్యలీనుడుల్. 448

సురవర ! సర్వభూతహృదిఁజొచ్చి చరింతువు నీప్రభావమే
మెగుదు, మేలమమ్ము నిరసించెద విట్టుల, మేము వేదవి
ద్వర! కుశనాభు కూఁతులము, దైవపదంబున నుండి క్రింది కీ
తఱిఁ బడఁద్రోయఁగాఁ గలము, తద్దయు మాతప మోము మమ్ములన్. 449

మాపిత సత్యవాది నవమానముచేయకు నీకుఁ గాలమున్
జేపడకుండుఁ; దండ్రి తగఁజేయును మాకు స్వయంవరం బిటన్
మాపితయే ప్రభుండు, పరమంబగు దైవము మాకతండు, మ
మ్మేపరమర్షి కిచ్చు నతఁడే పతియౌను ధరిత్రి మాకికన్. 450

వారల వాక్కులవ్వి విని వాయువిభుఁ డెదఁ గోపగించి య
వ్వారి సమస్తగాత్రములఁ బట్టియు భగ్నముచేసు, నంగముల్
కూరుకుపోయి వారు మరుగుజ్జులునై పడి సిగ్గుచెంది క
న్నీరులుజాలు లై కనులనిండఁగఁ గూలిరి చేరి తండ్రిపై. 451

దీనలౌ ప్రియసుతల యాస్థితిని జూచి
వారు మరుగుజ్జులౌటఁ గంగారుపడుచు
ఏమి టిది యేల యిటులైతి రిటు లధర్మ
మొదవె, చెప్ప రేల యని నిట్టూర్చి యడుగ. 452

—: కుశనాభుని కన్యలను బ్రహ్మదత్తుఁడు పెండ్లియాడుట :—

జనకుఁడు కుశనాభుని నుడుల్ వినియు వారు
కన్యకలు నూర్గురు తలలన్ గాళ్లఁ దాకి
యనిరి "పిత ! వాయువు మము డీకొనఁగ నెంచె
అశుభ పద మొందె ధర్మంబు నరయకుండె. 453

తండ్రి మాకుఁ గలఁడు స్వతంత్రులము కాము
తండ్రి నడుగు మాతఁ డిడ భద్రింబు నీకు
మాపలుకు లివి వినకయె పాప మెంచి
యిటుల పల్కి మమ్ము వాయు విటులు కొట్టె.

వారిటు లన ధార్మికుఁ డగు పార్థివుండు
విని మహాతేజుఁ డవెఁ గన్యలను గుఱించి
"ఓర్పు గలవారి కోరుపె యుండఁ దగిన
దదె యొకటయి చేసితిరి మీయుంద ఱిపుడు.

మీరు కులగౌరవము నిలంబెట్టినారు
ఓర్పె స్త్రీలకు భూషయౌ నోర్పె పురుషు
లకును భూషణ మోర్పు సురలకు దుష్క
రము విశేషించి; యో ర్వృందఱకును భూష.

ఓర్పె దానము సత్యము నోర్పె సుమ్మి
ఓర్పె యజ్ఞము సుతలార! ఓర్పె కీర్తి
ఓర్పె ధర్మము జగ ముందు నోర్పువలన"
అనుచు దేవవీర్యుండు రా జనిపె సుతల. 4

రాజు మంత్రులతోఁ గొమా ర్తలకు తగిన
వారి కిచ్చి పెండిలి యొనర్పంగఁదలచి
సదృశులకు దేశకాలాలు సరిగ చూచి
పెండ్లి చేయఁగ మతిఁ దలపెట్టె నపుడు. 4

సరిగ నపుడె చూలి యన్ పరమ మౌని
ఊర్ధ్వ రేతస్కుఁడు శుచియై యుండి బ్రహ్మ
తపము చేయఁగా నూర్మిళ తనయ సోమ
ద యనుగాంధర్వి కొల్చెఁ దద్దయును కోరి. 45

ఆమెయును మ్రొక్కి సేవాపరాయణయయి
తగిన కాలాన ధర్మిష్ఠ యగుచు నిలిచె
అందుకు గురువౌమౌని ప్రహర్షమొంది
ప్రీతుఁడై "నీకుఁ బ్రియమేమి చేతు" ననఁగ. 460

వాక్కుల తత్త్వముం దెలియు భామిని తుష్టుని మౌనిఁ గాంచి తా
నెక్కువ ప్రీతి పొంది వచియించెను వాక్చతురుండు మౌనితో
"మిక్కిలి బ్రాహ్మలక్ష్మి తగి మిక్కిలి బ్రహ్మమయుండవై తప
స్సెక్కువ గల్గి బ్రాహ్మతప సేర్పడు ధార్మికుఁ బుత్త్రుఁ గోరుదున్. 461

పతి గలదానఁగా, నిపుడు భార్యను నెవ్వనికేని గాను, భ
ద్రిత యగుఁగాక నాయెడలఁ, బ్రాహ్మపు యోగ్యతఁ జేరు నాకు నా
దృతి సుతునిన్ బ్రదాన మొనరింపఁగ నర్హుఁడ వోమహాముని
వ్రతమును బూను" మంచు నిటు వాక్యము లాడఁగ మౌని ప్రీతితో.
462

ఆమెయెడఁ బ్రసన్నుఁ డయి బ్రహ్మర్షి యపుడు
బ్రహ్మదత్తుఁ డన్మానసభావుఁ బూజ్య
చూలికిం దగు సుతు నిచ్చె; లీల నతఁడు
కాంపిలి పురి నుండె హరి నాకమునఁ బోలె. 463

నయగతి ధార్మికుండు కుశనాభుఁడు నూర్గురు స్వీయకన్యలన్
ప్రియముగ బ్రహ్మదత్తు కిడి పెండిలి చేయగ బ్రహ్మదత్తుఁడున్
రయమున పూవుఁబోఁడుల కరాలు క్రమంబున నిందుఁ డట్లు వ
ట్టి యిఁక స్పృశించు మాత్రను వడిన్ గని రందఱు పూర్వరూపమున్.
464

స్వసుత లిటు వాయుచే విడువంగఁ బడుచు
తమదు మరగుజ్జుతన మేగ నమితహర్ష
మంది కుశనాభుండును తనయల్లుఁ బ్రీతి
సాగనంపె నుపాధ్యాయచయముతోడ. 465

పిదప సోమద కూడ స్వప్రియకుమారు
నాఘనతఁ జూచి మరిమరి హర్షమొంది
మిగులఁ గుశనాభ నరవరు మెచ్చి తనదు
స్నుషను నభినందించె మేన్ ముట్టి ముట్టి. 466

## —: విశ్వామిత్రుని వంశ వర్ణనము :—

పెండ్లియయి బ్రహ్మదత్తుండు వెడలినంత
సుతుఁ గనని కుశనాభుండు సుతునికొఱకు
పుత్రికామేష్టిఁ జేసె నప్పుడు సుతేష్టి
బ్రహ్మపుత్రుండు కుశుఁ డుదారాత్ముఁ డనియె. 467

"గాధి యనుతగిన కొడుకు కలుగు నీకు
వాని వలన శాశ్వతకీర్తి వరలు నీకు"
ఇట్లు కుశనాభునితో వచియించి కుశుఁడు
ఆకసముపొంది తొలిబ్రహ్మలోక మొందె. 468

ఊర్విఁ గుశనాభునకుఁ గొంత కాలమునకు
గాధి యను ధార్మిక సుతుండు కలిగె రామ !
ధరణిపతి ధార్మికుఁడు గాధి తండ్రి నాకు
తనుము కుశవంశజుఁడ నేను కౌశికుఁడను. 469

నాకు సువ్రత యక్కయున్ గలదు రామ !
పత్యవతిపే, రది ఋచీకు పతిగ నయ్యె
పతి ననుగమించి బొందితో స్వర్గ మొందె
అదె మహోదార కౌశికీనదిగ నయ్యె. 470

అల జగద్ధితముకయి నాయక్క పిదప
దివ్యపుణ్యాంబు వయి హిమాద్రిని భజించె
అక్క కౌశికి మీది స్నేహంబు చేత
హిమగిరిదరి హాయిగ నుంటి నెపుడు నేను. 471

సత్యవతి పతివ్రత పుణ్య సత్యధర్మ
మందె నిలచి కౌశికినది యటు వెలింగె
మతి వ్రతమున కీసిద్ధాశ్రమమ్ము చేరి
సిద్ధుఁడైతి నీతేజస్సుచేత రామ ! 472

సరిగ నాజన్మ, నావంశజన్మ యింక
దేశజన్మ నీవడిగిన దెఱుఁగఁ జెపితి
కథ తెలుపుచుండ సగరాత్రి గడచె, భద్ర
మగుఁ ! ఐరుండు దారిని విఘ్న మవదు మనకు. 473

అదల వీచెట్లు మృగపక్షు లణఁగిమణఁగె
నిండి పోయె రేచీకటిన్ దిశలు, సంధ్య
వెడలె, నక్షత్రములు తార లడరి మిన్ను
కండ్లచేఁ బోలె జ్యోతులన్ కడు వెలింగె. 474

శిశిరకరంబులం బరపి చిక్కని లోకతమంబుఁ దోలుచున్
నిశి ప్రభచేత జీవముల నెమ్మనసుల్ వికసింపఁజేయుచున్
శశి యుదయించె రే తిరుగు జంతువు లిట్టటు సంచరించె రా
క్షసులును యక్షు లుగ్రపు మృగావళులున్ తిరుగాడె నెల్లెడన్. 47.

అని యిటు దివ్యతేజుడు మహాముని చెప్ప, సెబాసు భేషటం
చును నతనిన్ సమస్త ముని, సూర్యులు పూజయొనర్చి రిట్టులన్
“ఘన కుశికాన్వయంబు ననఘంబు సుధర్మపరంబు దీనిలో
జననము గన్న పూజ్యులౌ యశస్వులు బ్రహ్మసముల్ సదాధరన్. 476

అందు నీవు విశ్వామిత్రుఁ డన్ యశస్వి
వామె కౌశికి కులద్వీప యనఘనదియు”
అనుచు మునులు పొగడఁ గుశికాత్మజుండు
అస్తమించు సూర్యు డటుల నటఁ బరుండె.

వ. రామలక్ష్మణులుంగూడ కొంతయాశ్చర్యముం గని మునిశ్రేష్ఠుఁ బ్రశంసించి, నిద్ర రాఁగఁ బరుండిరి. 478

—: ఉమా గంగల పుట్టుక :—

రామ ! నిశ తెల్లవాఱె తొల్సంజ వచ్చె
భద్రమగు నీకు, లేలెమ్ము పయన మగుము
అనఁగ విని దినకృత్యంబు లాచరించి
పయన మయి రాముఁ డిట్లని పలికె నపుడు. 479

ఇది యగాధము శుచి శోణ, మిసుకతిన్నె
లవిగొ మన మేపథిని బ్రహ్మ ! యరుగవలయు
ననఁగ నపుడు విశ్వామిత్రుఁ డనియె నిట్లు
ఇదిగొ పథి దీనివెంట నేగుదురు ఋషులు. 480

అనఁగ మునులు విశ్వామిత్రుఁ డనిన దారి
వరసి వివిధ వనులగుండ నరిగినారు
వారు దూర మేగి సగంబు పవలు గడవ
మునులు సేవించు వరనదిన్ గనిరి గంగ. 481

పావన నీరముల్ గలిగి బార్లుగ బెగ్గురు పక్షు లంచలున్
శేవ షికార్లు చేయఁదగి నీటగు గంగను జూచి మౌనులున్
క్షావిభు పుత్త్రులున్ చెలఁగి గాంగతటాన మకాము చేసి యెం
తే వడి మున్కలాడి పితృదేవుల కిచ్చిరి తర్పణంబులన్. 482

వ్రేలిచి యగ్నులన్ శుచి హవిస్సమృతం బటు లారగించి యా
లీలగఁ ద త్తటిన్ విడిసి ప్రీతిని గౌశికుఁ జుట్టి వేడ్కలన్
దేలిరి మౌను లంత నిఁక సెమ్మది రాముఁ డనెన్ మహాత్మ ! యే
లీల త్రిలోకి దాటి కడలిన్ గనె గంగ వచింతువే యనన్. 483

రామునిచే ప్రేరితుఁడై
యామునివరుఁ డటఁ దెలిపె సురాపగ జననం
బీమెయి నానది వర్ధిలె
నీమహి, నిది యెల్ల శ్రద్ధ నెల్లరు వినఁగన్. 484

కలఁడు హిమవంతుఁ డనెడి నగాధిరాజు
అతఁడు సకలధాతువులకు నాకరంబు
అతనికి రూపమున సాటి యరయ రాని
సుత లిరువురు, తల్లియొ మేరుసుతయె సుమ్మి. 485

వ. * ఆమెపేరు మనోరమ, ఆమె హిమవంతునికి పత్ని యయ్యెను. ఆమెయందు హిమవంతునికి ఈ గంగానది జ్యేష్ఠసుతయై పుట్టెను. రెండవ కుమార్తె హిమవంతునిపేరుతోనె ఉమగా పుట్టినది. మఱి దేవతలు దేవతల ప్రయోజనము చేయు కోరికతో జ్యేష్ఠసుత గంగను దేవతలు కోరగా హిమవంతుడు కన్యయు త్రిపథగ లోకపావనియు నగు గంగను దేవతలకు ధర్మబుద్ధితో నిచ్చెను. పిదప దేవతలు తన కిచ్చవచ్చిన మార్గముగుండ పోవు గంగను త్రైలోక్యహితముకొఱకు పరిగ్రహించి కృతార్థులై వెడలిపోయిరి.

---

* కాళిదాసు ఉమ తల్లి మేనక యనెను.

ఇంక రెండవ కుమార్తెయు తపోధనయై యుగ్రతపస్సును చేసెను. అట్లు ఉగ్రమైన తపస్సును చేసిన యుమను లోకనమస్కృతను సాటిలేని రూపము గల రుద్రుని కిచ్చెను. ఇట్లు శైలరాజసుత అగు గంగయు ఉమయు లోకములచే నమస్కరింపబడిరి. గతిమద్వరా ! రామా ! త్రిపథగ యైన ఆ గంగ హిమవంతుని కుమార్తెగా బయలుదేతి భూలోకమున మొదట ఆకాశమున భువర్లోకమున సురనదిగా సురలోకమును (సువర్లోకమును) పొందిన పవిత్రురాలు. ఇట్లు నీకు ఆగంగ ఎట్లు త్రిపథగ యయినదో చెప్పితిని" అని ముని యనెను. 486

శుభగాథల్ విని రామలక్ష్మణులు హర్షోత్సాహులై యాకథన్
అభినందించి మునీశుతో ననిరి బ్రహ్మ ! ధర్మ మీగాథ వా
గ్విభవం బొప్ప ననుగ్రహించితివి పావిత్ర్యంపుటిల్లౌ నగ
ప్రభు జ్యేష్ఠాత్మజ గంగఁ దెల్పఁగదవే ప్రార్థింతు మోకౌశికా ! 487

సురల నరుల సంబంధించి చోద్యమైన
గంగకథ విస్తరింపుము కథల వివర
మీవ చెప్పఁగల్గుదు, గంగ యేల మూఁడు
పథములుగ నేగె, త్రిపథగ వరలె నెట్లు. 488

మూఁడు లోకాల నేకర్మములను జేసె
నోయి సర్వజ్ఞ ! యని ప్రశ్న చేయ రాముఁ
డప్పుడు విని విశ్వామిత్రు డఖిలకథను
మునుల మధ్య విస్తరముగను వినుపఁ దొడఁగె. 489

మునుపు వివాహమాడిన తపోధికుఁడౌ హరుఁ డిచ్ఛతో నుమన్
గని తమితోడ సంగమమొనర్చుచునుండగ వారి కయ్యేడన్
మునుకొని దివ్యవర్షశతమున్ చనెఁ గాని యుమన్ జనింపఁ డ
య్యెను సుతు డూర్ధ్వరేతు డయి యాహరుఁ డెప్పుడు నొప్పుచుండుటన్.
489

పిదవన్ బ్రహ్మయు నాదిగా సుర లెదన్ వీక్షించి యేజ్యోతియో
యుదయింపన్ సతియందు, దానినెవరిం దోర్వం గలా రంచు నీ
శుదరిన్ జేరి సురల్ పచించి రిటు కేల్ జోడించి దేవాదిదే
వ ! దయాంబోధి ! యనుగ్రహింపుము నమోవాకంబు లోకోద్ధరా !
490

జగముల్ నీఘనతేజమున్ నిలుపఁగా శక్యంబొకో నీవు బ్ర
హ్మగతంబౌ తప మంబతోఁ గలసి చేయన్ గోరుచున్నాము పూ
ర్తిగ తై ౹లోక్యహితం బొనర్చుటకు నీతేజస్సు తేజస్సులో
నిగుడం దాల్చుము, కావు లోకములు వానిన్ మాఁప బోకెమ్మెయిన్.
491

దేవతల వాక్కు విని జగదీశ్వరుండు
సరె యని, మఱియు నిటు పల్కె సురలతోడ
తేజ ముమతోడ ధరింతు తేజ మందె
సురలు భూమియు సుఖముగ వరలుఁ గాక. 492

నాయమోఘతేజమ్ముస్థానంబు నుండి
వెడల దానిని ధరియింత్రు వేరు చెపుడు
అని పలుక నిట్లు దేవతల్ హరుని కనిరి
వెడలు నీతేజము నిపుడె పుడమి తాల్చు. 493

అన విని హరుఁ డపుడు తేజ మవని నుంచె
నంత గిరికాననములతో నమరు నవని
హరుని తేజస్సు వ్యాప్తమై యడరుచుండ
నమరు లగ్ని హోత్రుని జూచి యనిరి యిటుల. 494

ఓయి తేజస్వి ! వాయుతో నుగ్రతేజ
మునఁ బ్రవేశింపు మనఁ జేసి యనలుఁ డట్లె
అయ్యె శ్వేతాద్రి, యయ్యె సూర్యాగ్నిఁ బోలు
శరవణం, బచ్చటనె పుట్టె షణ్ముఖుండు. 495

అవల నుమను శంకరుని మహర్షు లసుదు
లెంతొ ముదముతో పూజించిరపుడు రామ!
గిరిజ కనులెఱ్ఱవడఁ గోపగించి శాప
మిచ్చుచును దేవతలతో వచించె నిట్లు. 496

నందనుని గోరి హరుఁగూడు నాకు మీర
లౌరస సుతుండు లేకుండ నడ్డు పడుట
నేటినుండి సంతతిని మీదు బోటులందు
గనరు, మీభార్యలును ప్రజన్ గనరు గాక. 497

సురల నిటు శపించి, శపించె ధరను గూడ
కుమతి! నాకౌరసులలేమిఁ గూర్చియుంట
రక్షచే నేకరూపనై ప్రథిత వయ్యు
నీవు బహుభార్యవై సుతప్రేమఁ గనవు. 498

హరుఁ డపుడు దేవి శపియింప సురల బాధఁ
దెలిసి యిట నుండక వరుణు దిశకుఁ బోయి
హిమగిరికి నుత్తరశిఖరి కేగి తపము
గిరిజతోఁ జేసె నిఁక గంగ చరిత వినుడు. 499

—: కుమారస్వామి పుట్టుక :—

దేవదేవుండు తపములఁ దేలుచుండ
ఋషులు దేవతల్ సేనాని నిచ్ఛగించి
బ్రహ్మఁ జేరి కాళ్లఁ బడి ప్రార్థనంబు
చేసి రగ్ని యింద్రుఁడు ముందు చేరి యుండ. 500

"బీజముగ నీశివుఁడు సైన్య విభుని నిచ్చె
నతఁడె యుమతో మహాతపం బాచరించు
ఇపుడు లోకహితేచ్ఛఁ గావింపఁ దగిన
పని యెదో చేయు నీవె మా పరమగతియు. 501

అని దేవాదులు విన్నవింపగ త్రిలోకాధారుఁడౌ బ్రహ్మ తి
య్యని వాక్యంబుల నూరడించి యపుడే యాదేవులం జల్కె నిం
కను మీపత్ను లపుత్రి లయ్యెదరయౌగా కంచు నాదేవి యి
చ్చిన శాపం బది క్లేశ మీయనిదె లోఁ జింతింప సత్యంబ యౌ. 502

కనుఁడు వహ్ని యీ యాకాశగంగలోనె
ఘను నరిందమున్ సేనానిఁ గనఁగఁ౦డు
జ్యేష్ఠయౌ శైలసుత వానిఁ జేరఁదీయు
నతఁడు దేవికి నిష్టుఁడై సుతుఁలఁ బొందు. 503

అటుల బ్రహ్మవాక్కు విని కృతార్థు లగుచు
బ్రహ్మకును మొక్కియును ధాతు రంజితంబ
యయిన కైలాసగిరి కేగి యచట నగ్నిఁ
బుత్రుఁ గనఁగ నియోగించిరి బుధు లు ఋషులు. 504

అగ్ని దేవ! యీ సురల కార్యము గ్రహింపు
శైలసుత యైనగంగఁ దేజంబు నుంచు
మన, నటులె ప్రతిజ్ఞను జేసె యభ్ర నదికి
అనియె దేవి! గర్భము దాల్చు నమరుల కిది- 505

ప్రియ మయిన పని" యన దివ్య మయిన రూపు
గంగ దాల్పఁ దన్మహిమను గాంచి యపుడు
తేజ మది గంగలో నెల్ల దెసల నలమె
నగ్ని దానిఁ జల్లఁగఁ బ్రవాహములు నిండె. 506

ఎల్ల దేవతలకుఁ బురోహితుఁడై యైన
యగ్నితో గంగ యనె దేవ ! యలముకొన్న
తేజ మిది సైపఁజాలను తేజ మిద్ది
నన్ను దహియించు నీవ్యథ నన్ను నొంచె. 507

అపుడు సర్వదేవాత్మకుఁ డయిన యగ్ని
యనియె నీగర్భము హిమాద్రి యంఘ్రి నుంచు
మనఁగ నగ్ని వాక్కుల విని యట్టిగర్భ
మురు లహరుల నుండి హిమాద్రి దరుల నుంచె. 508

అవలన్ గంగనుసుండి భూమిఁ బడు సౌమ్యంబైన తేజంబు జా
తప బంగారముఁబోలెనై యమలమై లోనున్న తీవ్రాలు వెం
డివియై రాగివి యయ్యె లోహ త్రపులై నేర్పార సీసంబునై
యవె యాయామలముల్ ధరిత్రి వివిధంబౌ ధాతులయ్యేన్ పడిన్. 509

అటులు గర్భ ముంచినమాత్ర నద్రుల లొప్పు
వనము దాని తేజస్సుచే వ్యాప్త మగుచు
స్వర్ణమయ మయ్యె, నాప్రదేశంబు చేరి
బ్రహ్మ యిట్టులు వాక్యముల్ పలికె నపుడు. 510

“జాతమునకు రూప మిదౌట జాతరూప
మనుచు రూఢమై ప్రసిద్ధినందు” ననుచు
అదిమొదలు * జాతరూపంబు ననఁగఁ బడియె
రామ ! పసిఁడి యగ్ని సదృశప్రభలు కలది. 511

---

* జాతరూపము=బంగారము.

మివులన్ బంగరుకొండగాఁ దనరి యామీఁదన్ కుమారుండుగా
భువి నాశ్చర్యముగాఁ గనంబడ ముదంబున్ బొంది క్షీరంబుకై
దివిపై భాసిలుచున్న కృత్తికల నిర్దేశించి దేవేంద్రుఁడుం
దివిజుల్ పంప నొసంగినారు స్వసుతుండే యంచు క్షీరంబులన్. 512

కార్తికేయుఁడై త్రిభువన ఖ్యాతిఁ గాంచు
ననుచు సర్వదేవులు వల్క నాలకించి
జాఱి వెల్వడి యగ్నియై మీరునతని
కృత్తిక లటస్నానములు చేయించినారు. 513

అనలఁ గార్తికేయు మహాత్ము సన్నసముని
గర్భమునమండి * స్కన్నుని స్కందుఁ డనిరి
క్షీర మొకనాఁడె గ్రోలె సుకుమారదేహుఁ
డసురులను పెద్దవాడై స్వవీర్యమున గెలిచె. 514

ఇఁకను నాతఁ డారుగురు కృత్తికల పాలు
మొగములారిటఁ గ్రోలి షణ్ముఖుఁడె యయ్యె
అప్రతిముఁడైన యతని కగ్న్యాది సురలు
సలిపి రభిషేకములు సురసైన్యపతిగ. 515

క్ష్మావసుత ! విస్తరముగ గంగాచరిత్ర
పావన మగుకుమారసంభవము గాథ
చెప్పితిని, స్కంధభక్తుఁడు చిరము బ్రతుకు
పుత్త్రపౌత్త్రులతో స్కంధభువన మొందు. 516

* స్కన్నుని=జాఱిపడిన వానిని.

## —: సగరుని చరిత్ర :—

ఆ కథను చెప్పి కౌశికుం డంత మరల
రామునితో నిట్లనె నయోధ్యరాజు సగరుఁ
డనెడి వాఁడు మున్నుండెను, నాతఁ డనఘుఁ
డతఁడు సుతకాముఁ డతనికి సుతులు లేరు. 517

వ. ఆ సగరునికి కేశిని సుమతి యను నిద్దరు భార్యలు కలరు. జ్యేష్ఠ భార్య కేశిని వైదర్భుని కూతురు ధర్మాత్మురాలు సత్యవాదిని. రెండవ భార్య సుమతి అరిష్టనేమి కూతురు రూపములో సాటి లేనిది. ఆ యిద్దఱు పత్నులతోఁ గూడి సగరుఁడు హిమాద్రికేగి భృగుముని యున్న గిరిపైని తపము చేసెను. అట్లు తపము చేయుచుండ నూరేండ్లు గడచెను. సత్యవంతులలో జ్యేష్ఠుడైన యాభృగుమహాముని తపస్సుచే ఆరాధింపఁబడి వారికి వర మిచ్చి యిట్లనెను. 518

అనఘా! నీకెలఁ జాలమంది జననం బందం గలారీవు సాటియుం
డనికీర్తింగనఁజాలు, దోర్దు కులమున్ వర్ధిల్లఁగాఁ జేయు నొ
క్కని పుత్త్రిన్గను వేఱొకర్తె యుఁ గనుంగా యర్వదివేల చ
క్కని సత్పుత్త్రుల నంచు మౌని యనఁగాఁ గాంతల్ ప్రహృష్టాత్మలై. 519

మునిని ప్రసన్నుఁ జేసికొని మ్రొక్కియు భక్తిని నామహాత్ముతోఁ
నని రిటు బ్రహ్మ! యెవ్వతెకు నౌనొక పుత్త్రుఁడు, నేమె చాలమం
దిని గనుఁ జెప్పవే, యన మునీశుడు వాకొనె నిప్పు డిందు మీ
కును నెది యిష్ట మట్లె యగుఁ గోరుకొనుం డెదొ యిష్ట మీరనన్. 520

పతి యెదుటఁ గోరెఁ గేశిని వంశకరుని
సుమతి గరుడసోదరి వేల సుతులఁ గోరె
మునికిని ప్రదక్షిణ మొనర్చి మ్రొక్కి యంత
నృపతి తన భార్యలను గూడి యేగెఁ బురికి. 521

పిదపఁ గొంత కాలమునకు మొదటి భార్య
కేశిని యసమంజుని గనెఁ గీర్తియుతుని
సుమతి యోరామ ! * గర్భతుంబమును గనియె
వెడలి రందుండి యర్వదివేల సుతులు. 522

నేయి నిండిన ఘటముల నింపి వారిఁ
బెంచినారు దాదులు, వారు పెరిగి పెరిగి
చాల కాలానకుఁ గనిరి జవ్వనంబు
అర్వదౌవేల్ సగరునికై రటులు సుతులు. 523

సగరు పెద్దకొడు కసమంజసుఁడు పిదప
బాలుర సరయు నది నీట పాఱ వైచి
నీళ్ళలో మున్గు నాకుఱ్ఱవాళ్ళఁ జూచి
ఎపుడు పరిహాసములఁ జేసి యెంతొ యలరు. 524

ఇటుల పాపంబు చేయుచు నెల్ల వారి
హడలు కొట్టు పుత్త్రుని దండ్రి వెడలఁ గొట్టె
వాని కంశుమంతుఁ డనెడి సూనుఁ డుండె
నతఁడు వీరుఁడు జనపూజ్యుఁ డఖిలహితుడు. 525

---

* గర్భతుంబము=వల వంటి చిల్లులు గల యానపకాయ వంటి గర్భము

చాలకాలము గడవంగ సగరునకును
యజ్ఞమును జేయవలె నని యాశ పొడమె
అంత వేదజ్ఞుఁ డయి యుపాధ్యాయు లొప్ప
జన్నమును చేయు దొడఁగెను శ్రద్ధతోడ. 526

## —: భూమిని సగరసుతులు త్రవ్వుట :—

క్ష్మాపసుతుఁడు విశ్వామిత్రు మాటలు విని
అగ్ని వలె వెల్గు మునిఁ జూచి యనియె బ్రహ్మ !
మునుపు మాపూర్వుఁ డెటు యజ్ఞమును బొనర్చెఁ
దెలుపు విస్తరముగ నీకుఁ గలుగు శుభము. 527

అనఁగ నగుచు విశ్వామిత్రుఁ డప్పు డిట్లు
రాముఁ బలికె సగరు గాథ రామ ! విస్త
రింతు వినుము శంకరు మామ హిమగిరియును
వింధ్యగిరి చేరి యొం డొరుల్ ప్రేమ నుండ. 528

వానికిని మధ్య యజ్ఞంబు బయలుదేరె
ఆప్రదేశము యజ్ఞకార్యముల కిల్లు
అది ప్రశస్తము దృఢధన్వ యంశుమంతుఁ
డశ్వరక్ష చేసె సగరు నాజ్ఞఁ బూని. 529

యజ్ఞమును పాడు చేయఁగ వసురపతియు
అసురతను పూని యజ్ఞాశ్వ మపహరించె
అంత నటు దొంగిలఁగ నుపాధ్యాయు లనిరి
ఇదిగొ నశ్వము ఇది దొంగిలింపఁ బడియె. 520

అశ్వహ ర్తను జంపి యాహమును తెమ్ము
యజ్ఞ లోపమౌ నెడ మన యందఱకును
అశుభ మగుఁ గాన పార్థివ! యజ్ఞ మెట్టి
లోపములు లేక జరగు నట్లే పొనర్పు. 531

అను నుపాధ్యాయుల వచస్సు లాలకించి
యఱువదౌ వేవురు సుతుల కనియె నృపతి
పురుషవరులు! సుతులు! దైత్య భువుల గనుఁడు
క్రతువౌ మంత్రపూతులచేతఁ గడుధృతమ్ము. 532

కనుకన్ మీరలు గుఱ్ఱ మొందుఁ గఁడో నాలింపుఁడీ భద్రమౌ
తను మీ, కంబుధిదాక వే వెదకుఁడీ ధాత్రిస్థదేశంబు, లెం
దనుకన్ గుఱ్ఱము చూతు రందనుక నీధాత్రిం గడున్ ద్రవ్వి వెం
టనె యాయశ్వహరున్ గనుం డసుమతిన్ సర్వంబు నేనిచ్చితిన్. 533

నేనొ దీక్షఁబూనితి, బాలుఁడైన పౌత్రుఁ
డీ యుపాధ్యాయు లశ్వ మీక్షించుదాక
నిందె యుందురు, శుభము మీ కెసఁగు ననఁగ
నృపసుతులు పొంగి పితృ నాజ్ఞ నేగి రంత, 534

యోజనంబంత భూతలి నొక్కొ రొకరె
వజ్రసమ నఖంబులఁ ద్రవ్వి పైచిదారు
అశనిఁ బోల్ శూలములు వాడి పగుహాలాల
ప్రీల్చఁ బడుచు వసుమతి శబ్దించె రామ! 535

త్రవ్వ నపు డసురనాగరాక్షసులను
జంపు నపుడగు ఘోషంబు చదల నలము
అఱువదౌ వేల యోజనా లంద అపుడు
ధరణిఁ ద్రవ్వి రంతట రసాతలము చూడ. 536

గిరుల నిండు జంబూద్వీప మరసి యెల్లఁ
ద్రవ్వుచును పర్వదిక్కులఁ దడవినారు
అపుడు దేవ గంధర్వ నాగాసురలును
మనసు కంగారువడ బ్రహ్మఁ గనిరి దరిసి. 537

చేరి వారు బ్రహ్మఁ బ్రసన్నుఁ జేసికొనుచు
దీనులై భయంపడి బ్రహ్మఁ దెలిపి రిట్లు
సగరసుతులోయి భగవంత ! సకలధరణి
త్రవ్వి చంపుచుండి రచటి ధర్మపరుల. 538

వీడు యజ్ఞంబు చంపిన వాఁ డటంచు
వాఁడు హయము హరించినవాడె యనుచు
సగరపుత్త్రులు కనిపించు జనుల నెల్ల
చంపుచున్నారు దేవ ! రక్షింపవయ్య. 539

—: కపిలమహాముని సగరపుత్త్రుల భస్మము చేయుట :—

దేవతల మాట విని బ్రహ్మదేవుఁ డపుడు
సగర బల మోహమునఁ గుందు జనుల కనియె
ఈవసుధ వాసుదేవుని దివ్యుఁ డితఁడు
కపిలు రూపమున ధరనెల్లపుడు దాల్చు. 540

అతని కోపాగ్నిచే దగ్ధు లగుదు రెల్ల
రుర్విఁ ద్రవ్వుట యెన్నఁడు నున్నదె సుఁడీ-
మృతిని గనఁబోయెడి సగరసుతుల యంతు
గనఁదగిన, దవవ్ దేవతల్ చనిరి యటరి. 541

ఘను లయిన సగరసుతులు క్ష్మాతలంబు
వ్రీల్చుచుండ మహాఘోష మెడలె నపుడు
వారు భూతలమును ద్రవ్వి వలగఁ దిరిగి
కలసి యందఱు జనకునిఁ గనుచు ననిరి. 542

భూమియెల్లఁ దిరిగితిమి, భూతవితతి
సుర పిశాచ నాగులు రాక్షసులును గూడ
చచ్చి రశ్వము గాని యశ్వాపహర్తఁ
గాని గన మేమెునర్తుమె కాంచి తలచు. 543

సుతుల నుడుల విని సగరక్షోణి ధవుఁడు
కోపమునఁ బల్కె మీరిఁకన్ క్షోణితలము
చీల్చి మరి మరి త్రవ్వుఁడు క్షేమ మగుత
అశ్వహర్తఁ బొంది కృతార్థులగుచు రండు. 544

జనకుఁడు సగరు నావాక్కు విని యరువది
వేవురు సుతుల్ రసాతలిన్ వ్రీల్చి యందు
అద్రిఁ బోలి భూమిని మ్రోయునట్టి దిగ్గ
జము విరూపాక్ష మనుదాని సరగఁ గనిరి. 545

గిరులు వనములు గల యెల్ల క్షితిని రామ !
శిరసుతోఁ దాల్చు విరూపాక్ష కరి సతంబు
ఎపుడు విశ్రాంతికై తలన్ నృపకుమార
శ్రమఁ గదపు- నాఁడె భూకంప మమరు చుండు. 546

అంద ఆదిక్కు నేలు మహాగజంబు
వెసఁ బ్రదక్షిణమును చేసి వ్రీల్చి రవని
చెలఁగి తూర్పుగఁ ద్రవ్వి దక్షిణగఁ ద్రవ్వి
యాదిశను మహాపద్మమన్ హస్తిఁ గనిరి. 547

శిరసుతో భూమి మోసెడి కరిని జూచి
అచ్చెరుపడి ప్రదక్షిణ మాచరించి
విభుని తనయులు నర్వది వేల మంది
పశ్చిమపు దిక్కు త్రవ్విరి త్వరితగతిని. 548

పశ్చిమపు దిక్కునను కొండవంటి గిరిని
సౌమనసమును గనుగొని శ్రద్ధతోడ
వడిఁ బ్రదక్షిణ మొనరించి వ్రచ్చియిలను
ఉత్తరపు దిక్కుగాఁ బోయి రుచితగతుల. 549

మించి మంచటు తెల్లనౌ మేనితోడ
నచట భువి మోయు భద్రమన్ హస్తిఁ గాంచి
తనయు లర్వదివేల మందపుడు కరికి
వడిఁ బ్రదక్షిణ చేసియు వ్రచ్చి రిలను. 550

అవల నీశాన దిక్కుగా నరిగి యపుడు
రోషమున భూమిఁ ద్రవ్వి యాలోన నచట
కపిలుఁ బ్రాచీను వసుదేవఘనతమాంశు
సత్వరము గాంచి రతిబలుల్ సగరసుతులు. 551

అతని దరిగ చరించెడి హయముఁ గాంచి
అమిత సంతోష మంది వా రామునీశు
నశ్వహర్తగఁ దలఁచుచు నలుకతోడ
వ్యాకులం బగుకండ్ల సర్వంబు మఱచి. 552

చెట్లు గునపముల్ నాగలుల్ శిలలు దాల్చి
నిలునిలు మని పర్వు లిడుచు నలిగి మిగుల
"యజ్ఞియాశ్వము మాయది యపహరింతె
కుమతి ! సగరాత్మజుల మని మము నెఱుంగు". 553

అనెడి వారి వాక్కుల విని యాకపిలుఁడు
హు మ్మనుచును రోషంబుతో హుంకరించె
నంత నప్రమేయుఁడును మహాత్ముఁడైన
కపిలుచే వారు భస్మ్రపో గపుడె యైరి. 554

## —: సగరుని యజ్ఞ సమాప్తి :—

సుతు లేనాటికి రాకయుంట సగరక్షోణీధవుం డెంచి స
న్మతిఁ దేజంబున వెల్గు నామనుమనిన్ రావించి వాత్రకుచ్చె నే
ర్పుతి విద్యల్, మనపూర్వపూరుషులకీర్తిన్ నిల్పు శూరుండవున్
పితృ వృత్తాంత మెఱింగి యశ్వహరు నన్వేషింపుమీ వేగమే. 555

భూబిల మాశ్రయించి బలపుల్ గల సత్త్వములుండు, నీవు బా
హాబల మేర్పడన్ జని మహాసిని వింటిని బూని ఖడ్గధా
రాబలిఁ జేసి, మ్రొక్కఁదగు రాజుల మ్రొక్కుచు విఘ్నకారులే
పోఁ బొలియించి యజ్ఞమును పూర్తి యొనర్పఁగ రమ్ము శీఘ్రమే. 556

ఇటుల మహాత్ముఁడౌ సగరుఁ డేర్పడఁ బంపఁగ నంశుమంతుఁ డం
తట స్వధనుస్సు ఖడ్గమును దాల్చి కడున్ లఘువిక్రమంబుతో
తటుకునఁ దండ్రులెల్లెడలఁ ద్రవ్వినచోటుల భూబిలంబులన్
పటుగతిఁ జూచుచున్ జనియె భక్తియు శక్తియు యుక్తి మీఱగన్. 557

చని ఘన తేజుఁ డంతటఁ బిశాచ సురోరగ దానవాళి భ
క్తిని గని పూజలన్ జలుపు దిగ్గజమున్ గని మ్రొక్కుచున్ ప్రద
క్షిణ మొనరించి యోగమును క్షేమము శ్రద్ధగ పృచ్ఛచేసి యా
జనకులఁ గూర్చి యశ్వహరు సంగతి ప్రశ్నము చేయ నేర్గనెన్. 558

అసమంజసుతా! ధన్యుఁడ
వు సుఖముగ హయంబుతోడఁ బోయెద వసఁగా
అసమంజసుతు డిటు క్రమము
గ సకల దిశలకుఁ జన, నిటె గజములు పలికెన్. 559

ఆగజముల పల్కులు విని యంశుమంతుఁ
డెచటఁ దండ్రులు భస్మమై యెసఁగి రిటకుఁ
జనియు భస్మరాశిగ నున్న జనకులఁ గని
పితలు మృతులౌటఁ గని వెక్కి, వెక్కి యేడ్చె. 560

అట్లు దుఃఖానఁ గుములుచు, నటనె దరిగ
తిరుగు యజ్ఞాశ్వమును జూచి, మరణ మొందు
తండ్రులకు నీళ్ళు వదలఁగఁ దలఁచి యచట
జలముకై చూచియును జలాశయముఁ గనఁడు. 561

చాలశ్రద్ధగఁ గనుచునచ్చటను గరుడు
వనిల వేగుఁ దండ్రుల మామఁ గనియె, నంత
గరుడుఁ డిట్లనె వీర! దుఃఖంబుఁ గనకు
పితల యీచావు లోకసమ్మతమె సుమ్ము. 562

అప్రమేయుఁడౌ కపిలుచే నట్టి ఘనులు
దగ్ధులైరి యీ నీరీయుఁ దగదు వీరి,
కా హిమాద్రి పెద్దకుమార్తె యభ్రగంగ
దాని నీట వారికి చేయు తర్పణములు. 563

లోక పావని యగు గంగలోని నీళ్ళఁ
దడిసి యాభస్మ యాయుర్వ దైన వేల
తండ్రులను స్వర్గలోక మొందఁగఁ జేయు
పోయి గుఱ్ఱము గొని యజ్ఞ పూర్తి చేయు. 564

గరుడు మాటలు విని వాజిఁ గైకొనుచును
వీరుఁ డంశుమంతుఁడు తాతఁ జేరి యపుడు
జరిగినది యంతవృత్తమున్ గరుడు నుడులు
సరిగఁ జెప్పె జరిగినవి జరిగి నట్లు. 565

అంశుమంతునిచే ఘోర మైన వార్త
ఆలకించి యథావిధి యజ్ఞపూర్తి
చేసి పురి చేరి గంగను క్షితికి నెట్లు
తీసుకొని రావలెనొ రాజు తెలియఁ డయ్యె. 566

రాజు గంగ తే, నెంతకు, స్థిరంబు చేయఁ జాలక
ముప్పది వేలయేండ్లును, రాజ్య మేలి దివిన్ జనెన్. 567

సగరుఁ డిటుల్ గతింపఁ బ్రజ సర్వము ధార్మికు నంశుమంతునిన్
తగ నృపుఁ జేసె, వాని కొక నందనుఁ డుండె దిలీపు డన్న ఖ్యా
తి గను మహాత్ముఁ, డాతని క్షితీశుని జేసియు నంశుమంతుఁ డం
త గడుఁ దపం బొనర్చె గని ధన్యత పుణ్యహిమాద్రిశృంగమున్. 568

అటుల నంశుమంతుడు మహాయశస్వి
ముప్పదియు రెండువేలేండ్లు గొప్పతపము
సలిపి చన, దిలీపుడును తాతల పథంబు
విని వెతల మతి చన నిశ్చితిని గనండు. 569

ఎటుల గంగావతరణంబు నెటుల నుదక
మొసఁగి వారిఁ దరింపఁ జేయుటయు నిపుడు
అని యిటులఁ జింతల మునింగి తనరు ధార్మి
కునకుఁ బుట్టె భగీరథుఁ డను ఘనుండు. 570

ఆ దిలీపుఁ డనఘుఁ డెన్నొ యజ్ఞములను
చేసి ముప్పది వేలేండ్లు క్షితిని నేలి
ఎటుల వారిఁ దన్పుటో నిశ్చయింపలేక
రామ ! వ్యాధిచేఁ గాలధర్మంబు నొందె. 571

స్వార్జితం బగు కర్మచే నాదిలీపుఁ
డాత్మజు భగీరథు రాజు నాచరించి
ఇంద్రలోకము పొంద నాఋషి భగీర
థుం డపుత్త్రుఁడై సుత వాంఛ నుండి యంత. 573

క్ష్మాభరము మంత్రులం దిడి గంగావతరణ
కొఱకు గోకర్ణమునఁ జేసెఁ జిరము తపము
ఊర్ధ్వ బాహువై పంచాగ్ని హోత్ర మధ్య
నెలకు నొకసారె తిని జితేంద్రియత నుండె. 573

ఇటు లతఁడు ఘోరతప మాచరించుచుండ
వేలయేండ్లు గడచె నంత ప్రీతిఁ బొంది
యాప్రజాపతి భగవంతుఁ డైన బ్రహ్మ
బుధులతో వచ్చి యిటు భగీరథుని కనియె. 574

ఓ భగీరథ ! ధన్య ! యెంతో తపస్సు
నెఱపితివి ప్రీతిఁ బొందితి వరము గోరు
అన భగీరథుఁడు మహాత్ముఁ డంజలించి
అఖిల లోకపితామహు నరసి యనియె. 575

ఓయి భగవంత ! ప్రీతిని పొంది తేని
తపసు ఫల మిదేని సగరాత్మజులు జలము
పడసెదరుగాక, వీరల భస్మ- గంగ
యుదకము దడుప స్వర్గ మొందెదరుగాక. 576

నాకుదేవ ! సంతతినిమ్ము మాకులంబు
క్షయము గనకుండుఁగాక యిక్ష్వాకు కులుఁడ
నాకడిది రెండవ వరం బనఁగ నపుడు
నఖిలలోక పితామహుం డనియె మరల. 577

అట్లు యగుత నీకును భద్రమగుత ఓ మ
హారథా ! భగీరథ ! నీమనోరథంబు
శ్రేష్ఠ మిది, గంగ హిమగిరి జ్యేష్ఠసుతను
తాల్ప హరుఁడె శక్తుఁడు, హరుఁ దాల్పఁ గోరు. 577

గంగ పడుటను భూమి సైపంగ లేదు
దాని హరుకంటె నితరుఁడు దాల్ప లేఁడు
అని భగీరథుఁ బల్కి స్వర్ధునికిఁ జెప్పి
సురలతో బ్రహ్మ దేవతాపురికి నేగె. 578

## —: గంగ భూమికి అవతరించుట :—

ధృతి భగీరథుఁడును దేవదేవుఁ దరుగ
ధరను బొటన వ్రేలికొనపై సరిగ నిల్చి
యొక్క యే డుపాసించె నాయొక్కయేఁడు
నిండఁగ నుమాపతి యిటుల నృపతి కనియె. 579

హర్ష మొందితి నీకుఁ బ్రియం బొనర్తు
హిమగిరి జ్యేష్ఠసుతను ధరింతు ననఁగ
వెంటనే లోకపావని మింటినుండి
తరలి గొప్పరూపున హరుతలను బడియె. 580

వ. అట్లు పడి ధరింపరాని యాగంగాదేవి "నే నీశంకరుని నాప్రవాహం బుతో పాటు దీసికొని పాతాళమును ప్రవేశింతు" ననుకొనియెను. ఆ గంగ గర్వము నెఱింగి భగవంతుఁ డైన త్రినయనుండు కోపగించి యా గంగను మాయము చేయఁ దలంచి హిమవత్పర్వతము వలె ప్రవేశింపరాని జడలగుంపు పైబడి యత్నించి గూడ ఆజడలనుండి వెలువడలేనిదై యక్కడనే కొన్ని యేండ్లు తిరిగెను. అంత అది చూచి భగీరథుండు మరల తపంబు చేసి హరుని యనుగ్రహింప జేసికొన అతఁ డాగంగను బిందుసరస్సుగుండ వదలెను. అట్లు వదలఁగా అది ఏడుప్రవాహంబు లయి అందు మూడు హ్లాదిని, పావని, నళిని అనుపేర్లతో తూర్పుగఁ బ్రవహించినది. సుచక్షువు, పీత సింధువు అనుపేర్లతోఁ బడమరగా ప్రవహించినది. ఏడవది మహానది యనుపేర భగీరథుని ననుస రించెను. 581

ఇఁక భగీరథరాజర్షి యిటుల ముందు
దివ్యరథ మెక్కి చన గంగ తిన్నగానె
వాని ననుసరించె, తొలి నభ్రంబునుండి
శివుని శిరసున పైని క్షితిని నాగె. 582

అచట తీవ్రమౌ ఘోషతో నరిగి యలమి
మీలు తాబేళ్లు మొసళులు వేలకొలఁది
నీళ్ళతోఁ బడ భువియొప్పె, వింగినుండి
పడునదిఁ గనిరి సిద్ధదేవాదిగణము. 583

మబ్బులనుబోల్ విమానాలు మత్తకరులు
వాజులును వల్లకీలును, త్వరగ నెక్కి
వచ్చి రమరు లత్యద్భుతావహమ యైన
ప్రథిత గంగానదీ జలపాత మరయ. 584

దివి లీలన్ విహరించు దివ్యులమెయిన్ దీపించు భూషావళుల్
ఛవులన్ గ్రక్కఁగ నూఱు సూర్యులు ప్రకాశం బొప్పుచున్
మివులన్ పాములు మీలు వక్రవితతుల్ మీఱంగ విద్యుత్తు లె
ల్లవిధం బొప్పఁగ నాకసంబు కడు వెల్గం జొచ్చె రమ్యంబుగన్. 585

వ. రాజహంసంబులు వోలె, చిమ్మఁబడిన శారద మేఘంబులు వోలె ఆనీటిలో నురుగులు ప్రకాశించుచుండె. 586

ఒకచో వంకర టింకరై నెఱపు నందారయ్యొయ్య నొయ్యారముల్
ఒకచోఁ గ్రిందకుఁ బైకి గంతులిడు, నింకొక్కక్కచోఁ బాఱెడున్
ఒకచో నీళ్ళను నీళ్ళు కొట్టి చను, వేఱొక్కక్కచోఁ బైకిఁ గ్రిం
దకు నేగున్ హరు నెత్తినుండి పడి నానారీతి గంగాంబువుల్. 587

సురలున్ రాజఋషుల్ నరుల్ హరు జటాజూటంబునన్ జాఱి నీ
ళ్లురలన్ మేలని నెత్తిఁ జల్లుకొని రొక్కొక్కొంద్రు శాపంబుచే
పరితాపంబును బొందువారు జలముల్ స్పర్శించు భద్రాత్ము లం
బరమున్ జేరి స్వలోక మేగిరి మహానందంబుతో తుష్టులై. 588

వెలుగు నానీటిలో లోక మలరి పొంగె
గంగలో నభిషేకించి క్లాంతి విడిరి
రాజఋషి భగీరథుండును రథము నెక్కి
ముందు ముందేగె గంగయున్ బోయె వెనుక. 589

సురగంధర్వులు యక్షు లప్సరస లచ్చో వారివెన్వెన్కఁ బో
యిరి, యప్డద్భుత కర్మ జహ్నుముని తా నెందుండె నాయజ్ఞవా
టి, రయం బొప్ప గ ముంచిపై వగ నతండే యల్గి గంగాజలం
బరచేతం గొని త్రాగి వైచె సుర లత్యాశ్చర్యముం జెంద గన్. 590

అపు డాజహ్ను మహాఋషిన్ సురగణం బర్చించి యాగంగతో
నిపుడే మౌనికిఁ బుత్త్రిగాఁ దనరుమీ యీవంచు బ్రార్థింపఁ గా
నపుడా జహ్నువు తుష్టుడై చెవులచే నాగంగ వీడంగ నిం
దపుడే యాదిగ, గంగ జాహ్నవి యనన్ ఖ్యాతిం గనెన్ ధాత్రిలో. 591

అవల గంగ భగీరథు ననుగమించి
జలధిఁ జేరియు పాతాళతలము జేరె
అభగీరథుఁడును భస్మ మైన తాత
లను గనియు దీనచిత్తుఁ డయ్యెను కరంబు. 592

అంత భస్మంపు రాశిని, పూత గంగా జలంబు చే
తడిపె నంత తాతలు, శుద్ధులై స్వర్గ మొందిరి. 593

—: సగరపుత్రులు తరించుట :—

అంత గంగ భగీరథు ననుగమింప
భస్మమై పోయిన ధరిత్రిపతులకు పోయి
భద్రగంగాజలంబుచే భస్మ తడుప
నిఖిలలోక విభుఁడు బ్రహ్మ నృపతి కనియె. 594

క్ష్మాప ! అర్వదివేవురు సగరసుతులు
ఇపుడు తరియించి స్వర్గ మేగినారు
సాగరజల మెంత దనుక జగతి నుండు
నందనుక దేవు లటు తాత లుంద్రు దివిని. 595

ఇంక నీకు జ్యేష్ఠసుతయై యొసఁగు గంగ
నీదుపేరున నెప్పుడు నెగడి ధరణి
త్రిపథగ యనియు భాగీరథియని దనరు
త్రిపథములఁ బొందియుంటచే త్రిపథగ యగు. 596

రాజ ! తాత లందరికి నీరములు విడుము
ఇంక గంగ తెచ్చు ప్రతిజ్ఞ యిదె ముగింపు
సగరుఁడు యశస్వి యయ్యు ధర్మదుఁడె యయ్యు
ఇతని యామనోరథము నీ డేర దయ్యె. 597

అమితంబై తగు తేజ మొప్పి యనఘుండౌ నంశుమంతుండు నిం
క మహర్షి ప్రతియుండు క్షత్రియుడు వీకన్ తండ్రినిన్ మించి యెం
తొ మహత్త్వం బలరారు వాఁడు ధృతిమంతుం డౌదిలీపుండు వో
ని మహాత్ముండును పొందరాని యశమున్ నీవిట్టులన్ గంటివే. 598

క్షితికి గంగావతరణంబు చేసినావు
దీనిచే సుధర్మాశ్రయుం బైన కృతివి
పుణ్యుఁడ వగు నీవీనీట మునక లిడుము
కడు శుచివి, తాతలఁ దడుపు వెడలి వత్తు. 599

వ. ఇటుల సర్వలోక పితామహుం డైన దేవదేవుండు చెప్పి దేవలోక మేగ రాజర్షి యగు భగీరథుండును సగర కుమారులకు యథావిధిగ జలాంజలు లర్పించి తానును గంగాజలంబుల స్నాన మాడి స్వపురంబేగి స్వరాజ్యంబును పాలించెను. జనులు సర్వసమృద్ధులైరి. లోకములు సంతోషమున నోలలాడె అని విశ్వామిత్రుండు చెప్పి యిట్లనియె. "ఓ రామా ! నీకు గంగా చరిత్రను విస్తరించి చెప్పితిని, నీకు స్వస్తి యగుఁగాక, నీకు శుభమగుగాక. ఇదిగో సంధ్యాకాలము దాటుచున్నది. ఈ గంగావతరణకథ యశఃప్రదము ఆయుః ప్రదము స్వర్గప్రదము. బ్రాహ్మణుల మధ్య క్షత్రియుల నడుమ ఇంక నితరుల మధ్య నెవ్వఁడు వినిపించునో వాని పితరులు ప్రీతినొందెదరు. దైవతములు సంతోషించును. ఇది విన్నవాఁడు సర్వపాపములు పోగొట్టుకొని సర్వకామము లను పొందును. 600

## —: క్షీ ర స ము ద్ర మ థ న క థ :—

అనుచుఁ జెప్ప విశ్వామిత్రు డనినమాట
వినియు రామలక్ష్మణు లెంతొ వేడ్కపొంది
ఇటు లనిరి బ్రహ్మ ! యద్భుతం బిదియు, పుణ్య
కరము గంగావతరణ సాగరపు పూర్తి. 601

ఈవు చెప్పిన కథ యాలకించుచుండ
క్షణమువలె రాత్రి యంతయు గడచిపోయె
అవుర ! మది తృప్తి గనె బ్రహ్మ ! యని ముగించె
రామ్సుతులు తలఁచెడులోన రాత్రి చనియె. 602

తెల్లవాఱఁగ దినకృత్య మెల్లఁ జేసి
కూరుచున్న విశ్వామిత్రుఁ జేరి రాముఁ
డనియె నిశ చనె వింటిమి వినఁ దగినది
పుణ్య త్రిపథగానది దాటి పోద మింక. 603

సుఖముగా గూరుచుండెడి చోట్లు గలిగి
పూతకర్ము లౌ ఋషుల దీపుణ్యనావ
మిమ్ము భగవంతుఁ గని వేగమ్మె వచ్చె
అనఁగ నదిని దాటించి రాఘనులు ఋషులు. 604

వార లుత్తరతీరంబు చేరి పిదప
గంగనది యొడ్డున విడిసి ఘనను రమ్య
స్వర్గసమ విశాలపురిన్ చారుసీమ
మునివరుఁడు రాముఁడును జూచి పోయి రంత. 605

రాముఁ డంత విశ్వామిత్ర బ్రహ్మఋషికి
మ్రొక్కి యిటు లడిగె విశాలపురిని గూర్చి,
బ్రహ్మ ! యెవ్వరీవిశాలపురంబునందు
రాజు, చెప్పు మోయి కుతూహలంబు కలిగె. 606

రాము వాక్యము వినినంత నామునీశుఁ
డిఁక విశాలాపురిని గూర్చి యిటులఁ జెప్పె
వినుము రామ ! శక్రునికథన్ వినుతు నేను
ఏమి యాదేశమున నయ్యె నిదియు వినుము. 607

మున్ను కృతయుగంబున, దితిపుత్త్రు లింక
ధార్మికులు, ఘనులు నదితి తనయు లెంతొ
యెదఁ దలంచిరి యెటు మేము మృతియు జరయు
వ్యాధియును లేక యమరుల మవుదు మనుచు. 608

ఇటు మహాత్ము లాలోచింప నెసఁగె బుద్ధి;
రసము గనెదము క్షీరాబ్ధి నెస మథించి
అనుచు వాసుకి త్రాడుగఁ దనర మంద
రాద్రిఁ గవ్వముగ మథించి రమరు లంత. 609

ఏండ్లు నూరేగ, వాసుకి యెల్ల తలలు
గ్రక్కె విషము, కోరలు రాళ్ళఁ గఱచివైచె
నడరె హాలాహలవిషంబు నగ్నిఁ బోలె
దాన నరదైత్య దేవతల్ దగ్ధు లగుచు. 610

చని మహాదేవు శంకరు శరణు పొంది
'బ్రోవు బ్రో' వని పశుపతిన్ బొగడి రపుడు
పరగ దేవదేవుఁడు శంఖచక్రధరుఁడు
విష్ణు వంత ప్రత్యక్షమై పెలసె నపుడు. 611

అతఁడు నవ్వి శూలధరుని కనియె నిట్లు
"దేవత లిటు మథింపగ నేవిషంబు
ముందుపుట్టెనో యది నీది, పుట్టి తీవు
నగ్రజుఁడవై సురల, కిదె యగ్రపూజ. 612

అనుచు చెప్పి సురజ్యేష్ఠుఁ డటనె మాయ
మయ్యె సురల భీతి హరివాక్యమును తెలిసి
తగ హాలాహలవిష మమృతంబుపోలె.
గళమున నిడి రుద్రుఁడు స్వలోకమున కరిగె. 613

సురలు నసురులు క్షీరాబ్ధిఁ దఱవ నంత
మందరగిరి పాతాళము క్రిందికణఁగె
పిదప దేవగంధర్వులు వేగ హరిని
“నీ వఖిలగతివి సురల కిఁకను గతివె. 614

ఓయి మమ్ములను గిరిని నుద్ధరింపు
మనుచు సురలు వేడంగ కూర్మావతార
మొంది వీపుపై గిరిఁ దాల్చి నుదధినుండి
హరి గిరికొన పట్టి మథించె సురలమధ్య. 615

ఇటుల వేయేండ్లు మథియింప జ్యేష్ఠ యనెడి
సాగరులు కల్పన యొనర్చు చాన వెడలె
వ్రతికొరకు సంకల్పింపఁ బడిన యొక్క
పారిజాతవృక్షము పుట్టె వార్ధియందు. 616

అవల వేయేండ్లకుఁ గమండలువును దండ
మూని ధన్వంతరి జనించె, నోలి నపుడు,
* అప్పులు మథింప రసమైన యప్సరసలు
వార్ధినుండి పుట్టియును వప్పఁసలైరి. 617

రమ్య వర్చస్సు గల యప్సరసలు జలధి
నరువ దగుకోట్లమంది పుట్టి రిఁకపిదప
వారి దాసీల సంఖ్యలు; వారి సురలు
మఱి యసురులు గైకొనమి **సామాన్యలైరి. 618

---

* అప్పు=నీళ్ళయందు; రసములు=రములైన అప్సరసలు.
** సామాన్యలు=ఎవరికిని భార్యగా నుండక సామాన్యగా వుండువారు.

వరుణు కన్య ***వారుణీభయౌ, నెవ్వరును జానిఁ
గై కొనరు, దితిసుతులును గైకొన రింక
అదితి సుతు లనింద్యను దాని నంద, కెఱుల
దైత్యులసురులు సురలు నాదిత్యులైరి. 619

వారుణిని గ్రహించి ప్రహృష్టులైరి సురలు
అందు నుచ్చైశ్శ్రవంబను నశ్వవరము
రత్నవర మగుకౌస్తుభరత్న మింక
అన్నిటను నుత్తమంబైన యమృత మొదవె. 620

ఆయమృతంబు పొందుటకునై కడువంశము నాశ మయ్యె వే
పోయి రణంబులం దతిది పుత్త్రులు నాదితిసంతు చంపి, రే
దోయొకవైపు దేవు లిఁక నొక్కెడ సర్వులు రాక్షసాసురుల్
చేయియు చేయి కల్పి యని చేసిరి లోకమె మోహ మొందగన్. 621

ఎపుడు సమస్త మాయెడ నశించిన యుట్టుల నయ్యెనో కరం
బపుడె స్వమాయచేత నటు లద్భుతమోహిని రూప మొంది వా
రపహరియించినట్టి యమృతాంచిత భాండము లాగివైచి ముం
దె పడినవారిఁ జంపె నతితేజుఁడు విష్ణువు జిష్ణువై యనిన్. 622

అదితిసుతులు రామ ! దితియాత్మజులను
జంపి రాదిత్య దైత్యుల సమరమందు;
ఇటు దితిసుతులఁ జంపి దేవేంద్రుఁ డపుడు
చారణఋషి సిద్ధ సురరాజ్యంబు నేలె. 623

*** వారుణి = కల్లు; అనింద్య = మనుష్యులకేకాని దేవతలకు నింద్యము కానిది; అసురులు=కల్లుతాగినవారు కాన అసురులు; సురలు=కల్లు కల వారు కాన సురలు; సురపదమునకు పచాద్యచ్ అప్రత్యయము వచ్చినది కాన సురలు.

## —: దితి గర్భమును ఇంద్రుఁడు చీల్చుట :—

తన సుతులు పోవ దితి యెంతొ వనటఁ గుమిలి
స్వపతి యగు మరీచిసుతుఁ గాశ్యపుని బలికె
అనఘ ! నీసుతుల్ నాపుత్త్రులను వధించి
రిందుచే శక్రహంతఁ దపించి కనెద. 62

తపము చేతు గర్భము ప్రసాదంబు చేయు
మధిపు శక్రహంతను పొంద ననుమతింపు
పనఁగఁ గాశ్యపుఁ డాలించి వనటఁ గుందు
దితి కనియె నిట్లుసుగుఁణాక తెలియు మిపుడు. 62

నీకు శుభమౌత శుచి వగు, నింద్రుఁ జంపు
సుతుని ఘనుని గందువుగాని, శుచివ యగుచు
వేయి యేండ్లు ఉంటివయేని విశ్వవిజయు
డైన పుత్త్రుని గందువటంచుఁ బలికె. 62

అమిత తేజుండు చేతితో నామెఁ దడవి
తాకి స్వస్తియౌఁగా కని తపసు కేగె
అతఁ డటులేగ దితి కడున్ హర్ష మొంది
పరమతపము చేసెను కుశప్లవసమందు. 62

ఆమె తపంబు చేయునెడ నెంతయు నింద్రుఁడు భక్తితోడ సే
వామయుఁడై వసించి వరవహ్నిని దర్భలు నీళ్ళు కాష్టముల్
ఆమెకు తెచ్చి యిచ్చును ఫలాదులు దుంపలు నెవ్వి కోరినన్
దా ముసముఁందె పోయి యిడుఁ దప్పక కొల్చుచునుండు నెప్పుడున్. 62

ఒడలు పట్టును శ్రమము పోవ నొత్తుచుండు
ఎపుడు వీడక వజ్రి సేవించుచుండె
ఇంక పది తక్కువగ వేయియేండ్లు గడవ
దితి మిగుల ప్రీతి చెంది యాగతిని బలికె. 629

నాకు వేయేండ్ల తుదిఁ గల్గు నందనుండు
అనుచు వరమిచ్చె నేఁగోర జనకుఁ డింద్ర!
యేఁ దపముచేయుచుండఁ బదేండ్లు మిగిలె
నీకు శుభమౌతఁ దమ్ముని నేను కనెద. 630

కడు నీపై విజయేచ్ఛ మించు సుతు, నీకై నే సమాధానమున్
బడఁజేతున్ తనయున్ త్రిలోకవిజయున్ బాలింతువుం గూడ నె
క్కడ నీ కేవ్యథ గల్గ దంచు దితి చక్కం బల్కి మధ్యాహ్నమే
కడు నిద్రావశయై పరుండెఁ దలప్రక్కన్ రెండు కాళ్ళుంచియున్. 631

కాళ్ళ దరిగఁ గేశములుండఁ గాళ్ళ శిరసు
చోట నుండుట నామె నశుచిగ నెంచి
నవ్వి హర్షించి యామె మేనను బిలంబు
చొచ్చి గర్భ మైదుగఁ జీల్చెఁ జూచి వజ్రి. 632

వడిగ నూఱంచు లోప్వారు వజ్రమునను
ప్రేల్పఁబడి గర్భ మేడ్చెను, లేచె దితియు
అంత * మారుదో మారుద అంచు వజ్రి
గర్భమును బల్కి యేడ్చినన్గాని చీల్చె. 633

* మారుదః=ఏడ్వకు మారుదః=ఏడ్వకు అరుదః=అన్నది సంస్కృత ధాతు లుఙ్ క్రియారూపము. మా ఉన్నపుడు అవోవును అందుండి మారుత మారుత=గాలి గాలి అనియర్థము. కాగా దానినిబట్టి మారుతము అయ్యెను.

చంపకుము చంప కని దితి శక్రుఁ బలుక
గర్భమును వెల్వడియు మాతృగారవమున
వజ్రయుతు డయి మ్రొక్కి యావజ్రి యనియె
అడుగిడి తల దేవి ! పరుండి యశుచి వైతి. 634

ఇట్టి యవకాశమును నేనె యిపుడె చూచి
యుద్ధమున శక్రహంతకు నొగి నెదిర్చి
ఏడు విధముల దేవి ! ఛేదించినాను
అందుకై నన్ను క్షమియింప నర్హవమ్మ. 635

—: విశాలాపురికి రామలక్ష్మణ విశ్వామిత్రులు వెళ్లుట :—

గర్భ మేడు ముక్కలు కాగ కరము వగచి
యనె నెదుర్పరాని సురేంద్రు ననునయించి
నేడు నాతప్పుచే గర్భ మే-డు గతుల
నిటు చెడె సురేంద్ర ! నీదు త ప్పిందు లేదు. 636

ఇట్లు చెడిన నాకుఁ బ్రియము గావింపవోయి
ఈమరుత్తు లేడు దివిఁ బాలించుగాక
పుత్త్రి లౌచు వాయుస్కంధములుగ నగుచు
దివిఁ జరించి మారుతనాము లవుమగాక. 637

ఒకటి బ్రహ్మలోకము నొంది యొకటి యింద్ర
లోక మొంద మూడవది ద్యులోక మొంద
వాయు వనబడు ఈనాల్గు నీయనుజ్ఞ
వఖిల దిశల కేగుత మారుతాఖ్యతోడ. 638

ఆమె యావాక్కు విని సహస్రాక్షు డంత
ప్రాంజలి యయి చెప్పె నిదిట్లె యగుఁగాక
నీదుపుత్త్రులు దేవులై నింగి నెల్లఁ
తిరిగెదరుఁగాక శుభము పొందియుము లేమ. ౬౩౯

ఇట్లు వారు మాతాపుత్త్రు లెదలఁ దలచి
వెడలిరి కృతార్థులై యని వింటి మిదియు
ఆమహేంద్రు డున్న ప్రదేశ మని యెఱుంగు
ఇందె తప మొనర్చె దితి, సేవించె వజ్రి. ౬౪౦

పురుషశార్దూల ! యిక్ష్వాకు పుత్త్రు డగుచు
క్షమ నలంబుస కొడనె విశాలు డనగ
ఆవిశాలుడె నిర్మించె నీవిశాల
క్షముడు హేమచంద్రుడె యావిశాలు కొడుకు. ౬41

వ. ఆ హేమచంద్రునకు సుచంద్రుడనువాడు పుట్టెను. వానికి ధూమ్రాక్షుడును ఆ ధూమ్రాక్షునకు సృంజయుడు, ఆ సృంజయునికి సహదేవుడు, ఆ సహదేవునికి కుశాశ్వుడును, ఆ కుశాశ్వునికి సోమదత్తుడును, ఆ సోమదత్తునికి కాకుత్స్థుఁడును పుట్టిరి. వారు ధర్మాత్ములును మహాప్రభావులు నగు పుత్త్రులు ఆ కాకుత్స్థునికి అమరులకు సాటివచ్చునట్టి సుమతి యనువాడు పుట్టెను. అతడే యిపుడు ఈ విశాలపురమునేలుచుండెను. ఇక్ష్వాకు ప్రసాదంబుచే వీరందఱు దీర్ఘాయువులు ధార్మికులు మహాత్ములు. ఓ రామ! యిక్కడనె యిప్పుడు సుఖముగా ఈ రాత్రి యందఱము ఉండి ప్రొద్దుటనె తెల్లవాఱగనె జనకుని చూడఁబోదమని విశ్వామిత్రు డనియె. ౬42

నరవరుడు మహాతేజుడు వరయుశుండు
నయిన సుమతి యుపాధ్యాయు లాత్మబంధు
లేగుదేఱ విశ్వామిత్రుకెదురు పోయి
ప్రాంజలియయి క్షేమ మడిగి యనియెనిట్లు. 643

అనఘు లగుమీరు మాదేశ మరుగుదేఱ
నెంతొ ధన్యు డైతి ననుగ్రహింపబడితి
మీదు దర్శన మిటులౌట మేలు కలిగె
ఇంక నాకంటె ధన్యు డెందేని లేడు. 644

వ. అనెను పిదప వారు పరస్పరము యోగక్షేమంబు లడిగి తెలిసి కొన్న
తరువాత ఆ మహామునితో సుమతి యిట్లనియె. 645

దేవతుల్యంబైన ధీరత్వమొప్పారి వ్యాఘ్ర వృష గజ సింహములఁబోలి
నలిన దళవిశాల నయనంబులను మీరి, ధను వంబుల పొది కత్తిని ధరించి
అశ్వనీ దేవుల నందంబుతోఁబోలి, యమరు యౌవనమున సలరుచుండ
దివినుండి వచ్చిన దివ్యులం దనరారి, దివి సూర్య శశు లట్లుభువిని వెలిసి
646

ఇంగితము లోన చేష్ట నాకృతులలోన
ఒక రొకరికి సమానులై యున్నవారు
ఎవరు నడచి రానేటికిః నెందుకొఱకు
ఎవనికై వచ్చి రిటు దెల్పవే మునీంద్రః 647

అనుచు నడుగ విశ్వామిత్రు డన్ని చెప్పె
అఖిలసిద్ధాశ్రమ నివాస మసురవధయు;
అపుడు మునిమాట విని రాజు హర్ష మొంగి
అతిథులౌ రాజపుత్రుల కర్చచేసెః 648

వ. అంత రామలక్ష్మణులు సుమతినుండి యథోచితసత్కారములు పొంది యచట ఒక నిశిమాత్ర ముండి మిథిలకేగిరి. అంత మునులందఱు ఆ జనకుని పురి *మిథిలను జూచి సెబాసు సెబాసు అని ప్రశంసించిరి. 649

అవల నీశాన దిక్కుగా నరిగి యపుడు
రామలక్ష్మణుల్ మౌని నగ్రమున నుంచి
జనకు యజ్ఞవాటమునకుఁ జనియు నింక
నప్పు డిటు విశ్వామిత్రు నడిగినారు. 650

---

* ఇక్కడ మూలములో "జగ్మతు ర్మిథిలాం తతః" మిథిలకు వెళ్ళిరి. అనియు దానిని ప్రశంసించిరనియు ఉన్నది. అందుచే వెనుకకు తిరిగి మొదలుపెట్టి ఆశ్రమమునుజూచినట్లును ఆశ్రమ మెవరిదని యడుగగా అహల్యా గౌతముల కథ చెప్పినట్లును 48వ సర్గ 10వ శ్లోకమునుండి 50 వ సర్గము వరకు వర్ణింపబడినది. ఇది ప్రక్షిప్తమని తోచుచున్నది. మఱియు అహల్యాయై జార కౌశిక బ్రాహ్మణ గౌతమ బ్రువాణ (తై. ఆ. 1 అ. 3) ఇవి యింద్రుని ఆఖ్యానము. కౌశికముని దగ్గఱకు బ్రాహ్మణుడవై వచ్చినవాడా! యని యున్నది. అక్కడ హలముచే దున్నబడగిన భూమి "హల్య" యనియు, దున్నరానిబీడు అహల్యయు అగును. అట్టి భూమిని వర్షము కురిపించి జీర్ణము (మెత్తగా) చేసినవాడా ! అని అందు ఇంద్రుని బొగడినట్లు తోచుచున్నది. అహల్యవంటి పతివ్రతను ఇంద్రునివంటి దేవరాజును ఇట్లు దుర్వృత్తులనువోలెఁ జూపించుట యుక్తము కాదు. ఆరణ్యకములు అపౌరుషేయములు రామాయణము పౌరుషేయము. అపౌరుషేయము నగు ఆఖ్యానము రామునికాలములో జరిగినట్లును అప్పుడు అహల్యను రాము డుద్ధరించినట్లు వర్ణనయు సరియైనది కాదు. ఈ ఆరణ్యక వాక్యమునుజూచి భ్రమపడినవారెవరో చేర్చి యుందురు. కనుక ఇది ప్రక్షిప్తమని భావించి అది తెనిగింప బడలేదు. 51 సర్గలో శతానందుని వాక్యములలో 1వ శ్లోకము నుండి 11 న్నర శ్లోకముల వఱకుఁ గూడ ప్రక్షిప్త మని తోచుచున్నది. కాన అదియు తెనిగింపఁబడ లేదు.

అవుర ! మహాత్ముడౌ ! జనకు యజ్ఞసమృద్ధియు నెంత యున్నదో
వివిధపు దేశవాసు లగు విప్రులు వేదము సంత చెప్ప శా
స్త్రవిధులు వేలమంది యిటు రాజిలుచుండ్రె మహర్షివాటు లిం
దవుపడు నూర్లుగా శకటు లయ్యవియే; మనముందు మెచ్చుటన్. 651

వ. అని యడుగుటయు విశ్వామిత్రమహాముని అచ్చటనె జలసమృద్ధియు ప్రశాంతియు గల చోట నివాస మేర్పఱచెను. అంత విశ్వామిత్రముని వచ్చినట్లు విని జనకనృపతి పురోహితుడును అనింద్యుడు నగు శతానందుని ముందు పెట్టుకొని వినయముగా నెదురేగి మహాత్ములైన ఋత్విక్కులు అర్ఘ్యమును సమర్పింప మహాత్ముడైన జనకుని యాపూజను గ్రహించి రాజు కుశలంబును యజ్ఞము యథావిధిగా జరుగుచున్నదా అనియు నడిగెను. ఆజనకుండును ఉపాధ్యాయపురోహితులతోఁ గూడ ఆమునుల యోగక్షేమాదుల నడిగిసంతుష్టు డయ్యెను. అంతజనకమహారాజు కృతాంజలియై అర్ఘ్యాసనమునఁ గూర్చుండఁ బ్రార్థించి మునులు, అందఱు కూర్చుండ తామును కూర్చుండి యందఱను తిలకించి యీరా జిట్లు విన్నవించెను. 652

ఇప్పుడుగాదె నాసవనవృద్ధి ఫలించె త్వదీయ దర్శనం
బిప్పగిదిన్ లభింపఁగ లభించెను యజ్ఞ ఫలంబు, ధన్యుడన్
ఇప్పు డనుగ్రహింపఁబడి తీగతి, మౌనులతోడ వచ్చుటన్
ఇప్పదిరెండు రోజుల ముగింపగుఁ, జూచెదు యజ్ఞభోజులన్. 653

వ. అని పలికి మఱియు ప్రహృష్టవదనుఁ డయి ప్రాంజలియై ఘరల నారాజకుమారులఁ గూర్చి తెలిసికొనఁదలఁచి యిట్లనెను. 654

దేవతుల్యం బయిన ధీరత్వ మొప్పారి
వ్యాఘ్ర వృష గజ సింహములఁ బోలి
పద్మ దళ విశాల నయనంబులను మీరి
ధను వంబులపొది కత్తిని ధరించి

అశ్వినీదేవుల నందంబుతోఁ బోలి
　　యనఘ యౌవనమున నలరుచుండి
దివినుండి వచ్చిన దివ్యాలం దనరారి
　　దివి సూర్య శశు లట్లు భువిని వెలసి.

ఇంగితములోన చేష్ట నాకృతులలోన
ఒక రొకరికి సమానులై యున్న వీరు
ఎవరు పిల్ల జుట్టు గల వీరేలవచ్చి
రెవని పుత్త్రులు దెల్పవే మహాత్మ. 655

అనుచు నడుగ విశ్వామిత్రుఁ డన్ని చెప్పె
అఖిల సిద్ధాశ్రమ నివాస మసురవధయు
దశరథుని పుత్త్రు లౌటయుఁ దగ వచించి
నీధనువుఁ జూడ వచ్చిరి నిపుణమతులు. 656

వ. అని చెప్పి మౌని విరమింప. 657

## —: విశ్వామిత్రుని చరిత్ర :—

వ. అంత ఆవిశ్వామిత్ర మహాముని మాటలు విని మహాతేజుఁ డగు శతానందుఁ డిట్లనెను. ఓనరశ్రేష్ఠా ! అదృష్టవశమున విశ్వామిత్ర మహర్షిని పురస్కరించికొని యిటకు వచ్చితిమి. ఈవిశ్వామిత్రుడు తపస్సుచే బ్రహ్మర్షి యయ్యెను. ఇతడు పరమగతి. ఏవిశ్వామిత్రుడు మహాతపమును చేసి బ్రహ్మర్షి యయ్యెనో వానిచే నీవు రక్షింపఁబడితివి కాన నీకంటె ధన్యతముఁడు ఈభూలోకమున ఉండడు. ఆకౌశికుఁ డగు విశ్వామిత్రుని బలము వృత్తాంతమును నేను చెప్పెద వినుము. 658

కుశుఁ డన్‌రాజు గలం డతండు కుజనఘ్నుం డైన ధర్మజ్ఞుఁ డా
వశి విద్యాసహితుండు బ్రహ్మసుతుఁడౌ ప్రజ్ఞాయశశ్శాలికిన్
కుశనాభుం డనుపుత్త్రుఁ డుండెవినయజ్ఞుం డైన యవ్వానికిన్
యశ మొప్పారెడు గాధి యన్న తనయుం డావిర్భవించెన్ గదే. 659

అతని కొడుకు విశ్వామిత్రుఁ డితఁడె యతఁడు
ఆతఁడును మహాతేజుఁడై యవని నేలె
చాలవేలేండ్లు నాతఁడు రాజ్యంబు చేసి
క్షోణి నక్షౌహిణీ సేనఁ గూడి తిరిగె. 660

వనముల్ రాష్ట్రము లాశ్రమాలు పురముల్ భవ్యాద్రులున్ దీర్ఘముల్
కనుచున్ జేరె, వసిష్ఠునాశ్రమము మార్గం బందువృక్షాలు చ
ల్లనిపై నీడల నీయ లేళ్ల కదుపుల్ మార్గాల కిర్వంకలన్
కనుచున్ నిల్వఁగ నగ్నిహోత్రహవిసుల్ ఘ్రాణంబులన్ దన్పఁగన్. 661

బ్రహ్మర్షు లొకచోట రాజర్షు లడిగెడి
యధ్యాత్మవిషయంబు లరసి చెప్ప
అగ్నికల్పులగు మహాత్ములు మిగులగ
సతతంబు తపములు సలుపుచుండ
బ్రహ్మకల్పు లగుధర్మాత్ము లెల్లెడ తాము
ద్విజతతులకు వేదవిద్య చెప్ప
జల భక్షు లనిలభక్షులు శీర్ణప
ర్ణాశనులు ఫలమూలభక్షులు దలిర్ప. 661

ఆఋషులు వాలఖిల్యులు నలరుచుండ
అన్యవైఖావసులు నిండి యచట వఱల
హోమ జప పరాయణులును నాగ్నినిగొలువ
ఆశ్రమం బది శాంతమై యలరుచుండె. 661

వసిష్ఠు నాశ్రమం బది, రెండవ బ్రహ్మలోకమై
యుండగ బిశ్వామిత్రుఁడు, వ్రతి శ్రేష్ఠుఁడు చూచెను. 665

—: విశ్వామిత్ర మహారాజునకు వసిష్ఠుఁ డాతిథ్య మిచ్చుట :—

సంతోషంబున నావసిష్ఠుఁ గని విశ్వామిత్రుఁ దుద్యత్బలుం
డెంతో భక్తిని మ్రొక్క స్వాగతము సంప్రీతిన్ సమర్పించి ధీ
మంతుండైన వసిష్ఠు డాసనము నాక్ష్మాభర్తముందుంచి యు
త్యంతప్రేమ ఫలాలు దుంపలును నర్ఘ్యం బిచ్చె పాద్యం బిడెన్. 666

ఆ వసిష్ఠుఁ డర్పించిన యతిథిపూజ
లను గ్రహించి విశ్వామిత్రు డాదరమున
శిష్యవృక్షాగ్ని హోత్రాల క్షేమ మడుగ
నావసిష్ఠుడును నృపు క్షేమాదు లడిగె. 667

సుఖముగఁ గూరుచున్న నృపుఁ జూచి జపించెడు వారిలోన స
న్ముఖుఁడు వసిష్ఠుఁ డయ్యెజునిపుత్రుఁడు ప్రశ్నము జేసె "భూవరా!
సుఖమె గదోయి నీకు ప్రజఁ జూచుచు ధర్మముతోడి వారికిన్
సుఖ మొనగూర్తువే గద సుశోభితవృత్తుల భృత్యు లుందురే. 668

ఎపుడును నీదునాజ్ఞ జరియింతురె భృత్యులు వైరి గెల్తువే
ఎపుడును ధర్మముల్ కుశలమే, ధనధాన్య సమస్త కోశముల్
ఎపుడు సమృద్ధి నున్నవియొ, యెప్పుడు మిత్రులు పుత్రపౌత్రులున్
విపుల శుభంబు లొందుదురె ప్రేమగ నందఱఁ జూతువే గదా. 669

అన నృపతి చెప్పె నెల్ల క్షేమాదికముల
ఒక రొకరిని ధర్మాత్ములు నొగిఁ జిరంబు
ఇటు వసిష్ఠవిశ్వామిత్రు లిరువు రపుడు
నెల్ల శుభమైన కథలు వచించుకొనిరి. 670

అవల భగవానుఁడు వసిష్ఠుఁ డలరి మిగుల
నిట్టు లనె నో విశ్వామిత్రు నిపుడు నీకు
సైన్యముల కాతిథ్యమున్ నే నొసంగఁ
దలఁచితిని స్వీకరింపు సత్కార మిదియు. 671

అప్రమేయుండవౌ నీవు నాదరమునఁ
గైకొనుము నీ వతిథివి క్ష్మావిభుఁడవు
కడు విశేషించి పూజనీయుఁడ వనంగ
"నీవు మర్యాద కడుఁ జేసినావు చాలు. 672

అనఘ ! నీయాశ్రమమ్మున నలరుచున్న
ఫలములును దుంప లిడితివి పాద్య మర్ఘ్య
మిచ్చితివిగ నీదర్శన మిపుడు నబ్బె
వెళ్లి వత్తు నంజలి నీకు ప్రేమఁ గనుమి. 673

అని పలుకు నృపున్ మతిమతి యటు మునీశు
డతిథి మర్యాద గైకొని యరుగు మనుచు
పనె, నుదారమనస్సుతో, వంత నృపతి
యటులె పూజ్యుల కెటు ప్రియం బటులె యవుత. 674

అన మహాతేజుఁడు జపించు ఘనులలోన
ఘనుఁ డగువసిష్ఠుఁ డంతటఁ గపిలగోవు
రాఁ బిలిచి ప్రీతితో బల్కె "రమ్మురమ్ము
అమ్మ ! శబల ! నామాటల నవధరింపు, 675

బలముతోఁగూడ రాజర్షి వరున కిపుడు
కడు మహార్హ భోజనపు సత్కార మియ
నిశ్చయించితి దానికిన్ నీవు తగిన
యటుల సర్వము సమకూర్చ నర్హ మవుదు. 676

ఎవరి కెవ్వరి కేది యేది యిష్ట మగునో
షడ్రసంబులతోఁగూడ సత్కరింపు
కామధేను ! యిదెల్ల శీఘ్రంబుగాను
నాకొఱ కయి వర్షింపుమి నయముమీఱ. 677

రసము గల యన్నపానంబులను నొసంగి
లేహ్య చోష్యములన్ గూడ లీల నీయు
అన్నముల రాసుల సృజింపు మమ్మ ! శబల !
త్వరపడుమి యిక నీవు సర్వంబు కూర్చు. 678

వ. ఇటు మహానుభావుఁ డగువసిష్ఠుడు వచింప నంత కామధేనువు శబల
సర్వకామములను ఎవరి కెవరి కేది యిష్టమో సృజించెను. 679

చెఱకురసాలు తేనియలు చెన్నగు చిత్రపు టాసనంబులన్
నవ రుచి పానకంబులు వెలల్ గల పెద్దవి పిండివంటలన్
చిఱు నులివెచ్చ యన్నములఁ జేరిన కొండలయంత రాసులున్
అరుదగు పాయసాన్నములు నాపెరుగుం జెఱువుల్ కడింది పప్పులన్. 680

రకరకంబు లగురసముల్ * పాడవములు
బెల్లపుం బిండివంటలు వేలకొలఁది
సిద్ధ మయ్యెను వానితో సేన లెల్ల
హృష్టమై పుష్టమై యెంతొ ప్రీతి నొందె. 681

ప్రమద మొందె విశ్వామిత్ర రాజఋషియు
అంతిపురియును మరి యుపాధ్యాయగణము
బ్రాహ్మణ పురోహితు లమాత్యవరులు మంత్రు
లెల్ల భృత్యులు పొంగి పోయిరి కరంబు. 682

* ఒక రకపు భక్ష్యములు.

అట వసిష్ఠు విశ్వామిత్రుఁ డరసె యనియె
బ్రహ్మ ! గౌరవించితి వర్చఁ బడసి తేను
వాగ్విదా ! చెప్పెదను నొక్కవాక్కు వినుము
వేల గోవు లిత్తు శబలన్ విప్ర ! యిమ్ము. 683

రత్న మిది పూజ్య ! రాజులో రత్నహరులు
శబల నిమ్ము ధర్మమున కీశబల నాదె
అనఁగ భగవానుఁడు వసిష్ఠ మునివరుండు
ఇట్టు లనెను విశ్వామిత్ర నృపతితోడ. 684

ఆత్మవంతునికి మహాయశస్సుపోలె
ఈ * శబల శాశ్వతముగ నాకీయఁబడియె
దీనిలో హవ్యకవ్యముల్ ప్రాణయాత్ర
అగ్నిహోత్రము బలి హోమ మున్ని నిలుచు. 685

ఓరాజర్షీ ! స్వాహా
కార వషట్కారములు సకల మగు విద్యల్
చేరి శబలమీదనె యా
ధారపడెను సంశయింపఁ దగ దిందేమీ. 686

నా సర్వస్వం బిదియే
నా సత్యమునకును తుష్టి నయముగ నిదియే
ఈసర్వ హేతువులచే
నే సేవింతు శబల విడ నే నెటు లైనన్. 687

* శబల=కామధేనువు.

ఇటు వసిష్ఠుడు చెప్ప వాక్పటుత మెఱయు
ఆగ్రహమున విశ్వామిత్రుఁ డనియె నంత
"పసిడి గొలుసులు పసిఁడి గ్రీవాభరణము
కలుగు పదునాల్గు వే లేనుఁగులను నిత్తు. 688

పసిఁడి మువ్వల భూషలఁ బరగి యున్న
నాలుగేసి తెల్లనివి యశ్వాలు గలుగు
బంగరు రథంబు లెనిమిదివంద లైన
నివ్వఁ గలవాఁడను శబల నిమ్ము మౌని. 689

ఉత్తమ కులానఁ బుట్టి మహౌజస మగు
పదునొకండు వేల హయాల నిదిగొ నిత్తు
రంగు రంగులు గలిగియుఁ బడుచు వగుచు
ప్రబలు కోటిగోవుల నిత్తు, శబల నిమ్ము. 690

లేక కోరుకో రత్నాలు లేక పసిఁడి
యెంత యైనను సరె శబల నిమ్ము మౌని
అనుచుఁ బలుక విశ్వామిత్రుఁ, డట వసిష్ఠుఁ
డనె "శబల నీయ రాజ ! యేమైన సరియె. 691

ఇదియే నారత్నము, ధన,
మిదియే సర్వస్వ మింక నిదె జీవితమున్
ఇదె దర్శపూర్ణమాసము,
లిదె దక్షిణ లున్న యజ్ఞ మిదియే క్రియలున్. 692

ఇదె క్రియ లన్నిటిమూలం
బిది నేనింతకును మించి యెట్లు వచింతున్
అది యిది యని వే గతులం
బదరను నీకామధేనుమాతను నీయన్. 693

### విశ్వామిత్రుఁడు కామధేనువును హరింప
### కామధేనువు రాజు బలములఁ గూల్చుట.

ఎపుడైతే ఋషి కామధేను వెటులే నీయంగలేదో కథం
బపుడే బల్మిని రాజు తీసికొనిపో నాగోవు దుఃఖంబుతో
నిపు డీరాజున కీమహర్షి యిడెనా యేమీ వసిష్ఠుండు స
ర్వపవిత్రుం డిటు నన్త్యజించెన యిదేలా పట్టి రీనన్ భటుల్. 694

ఇటులన్ దైన్యముతోడఁ జింతిలుచు నేనేమైన నీమౌనికే
యిటు నేరం బొనరింతు లేనియెడ నన్నేలా మహాత్ముండు తా
నిటు వీడన్గదా యంచు మిక్కిలి వగన్ భృత్యావళిన్ ద్రోచి ముం
గట నంభా యని మౌని కాళ్ల దరి దుఃఖం బుబ్బఁగా నిట్లనెన్. 695

భగవంతుండ! ననుం ద్యజించితివె విశ్వామిత్రభృత్యుల్ ననున్
బిగియం బట్టి బలాత్కరింతు రిటు నే నీకేమి కావించితిన్
తగ వాక్రుక్కవ్వ మనన్ వసిష్ఠుఁడు వ్యథార్తన్ జెల్లెలిన్ బోలెబా
గుగ వీక్షించి వచించె నిట్టు లొడలిన్ గోళ్ళుంచుచున్ దువ్వుచున్. 696

అపకారం బిసుమంత చేయవు నినున్ త్యాగంబు గావింపలే
దిపు డున్మత్తుఁడు సైన్యగర్వితుఁడు నిన్నీరీతి నానుండియే
స్వపురిన్ దీసుకపోవుచుండె శబలా! బాహాబలం బొప్పభూ
మిపతిన్ నేనెటు లేమిచేయఁగల నేమేన్ శక్తి నాకున్నదే. 697

ఇతఁడో భూపతి క్షత్రియుండు బలియుం డీతండు శూరాగ్యుఁడున్
ఇతఁ డక్షౌహిణీసేనకున్ బతి రథా లేన్గుల్ తురంగాలతో
నితఁ డేతెంచిన నేమి చేయగల మింతే నిన్ బలం బున్నదే
మతి నెల్లం గని చేతకాక యెదియున్, మైసోలి కూర్చుండితిన్. 698

వ. అని యిట్లు మహాత్ముండైన వసిష్ఠ మహామునిని పలుక వాక్యకోవిద యగు కామధేనువు అతులప్రభుం డగు బ్రహ్మర్షితో నిట్లనియె. 699

క్షత్రియుని శక్తియు సదాక్క శక్తి యొక్కొ
బ్రాహ్మణుని శక్తితో సమంబైన దేది
బ్రహ్మ ! బ్రాహ్మణ బలమె దివ్యంబును
బ్రాహ్మ మది క్షాత్రమున కంటె బలతరంబు. 700

అప్రమేయము నీకున్న యాబలంబు
ప్రోది నీకంటె బలవత్తరుండు లేడు
అధిక బలుఁడు విశ్వామిత్రుఁ డగునుగాక
నీదు తేజస్సొ సహియింపరాదు నిజము. 701

నను బంపించు త్వదీయ బ్రాహ్మబలసంతానిన్ మహాతేజ ! ఈ
క్షణమే యుట్టిదురాత్ము గర్వబలముల్ గాళ్లన్ దిగం ద్రొక్కెదన్
అని యాహోమపుఁ గామధేను వనగా నాబ్రహ్మ కీర్తించి యి
ట్లనె నట్లే సృజియించు శత్రుబలగర్వచ్ఛేది సైన్యం బనన్. 702

అపు డంబా యనుచున్ సృజింప శతసాహస్రంబులో పప్లవుల్
వపువున్ బెంచి యుడంచి రారిపుల విశ్వామిత్రుఁ డీక్షింపఁగా
నపు డారాజును నస్త్రశస్త్రములతో నాధేను సైన్యంబు న
ష్టపడన్ జేయఁగఁ గామధేనువు సృజించన్ సాగె సైన్యంబులన్. 703

ఆవు సృజియించిన శకులు యవను లంత
స్వర్ణ కింజల్క సమ బలప్రభలతోడ
అవనిఁ గప్పి పట్టిస ఖడ్గ హేమవస్త్ర
ములను దాల్చి కాల్చి రరుల జ్వాలను లట్లు. 704

అంత ఘనుఁడు విశ్వామిత్రుఁ డస్త్రములను
వైచి యవన కాంభోజ పహ్లవులఁ గూల్ప
కని మునీసు డనియె నిల్లు కామధేను !
యోగశక్తిఁ జూపుమి యూరకుందు వేల. 705

అన నంభాధ్వనిఁ బుట్టి రంత రవితుల్యోజస్వి కాంభోజు లిం
కను శస్త్రంబులు దాల్చి పెన్ పొదుగునన్ గై-సేసి రాపహ్లవుల్
తన గుహ్యంబుననుండి మ్లేచ్ఛులు శకృత్థానంబునందున్ శకుల్
ఘన రోమాల జనించి రంత యవనుల్ కైరాతకుల్ హారితుల్. 706

వడి వారంతటఁ గాల్చి రాసకల విశ్వామిత్ర సైన్యంబు, చే
పడు మత్తేభగణంబు కాల్బలము లశ్వంబుల్ రధంబుల్ త్రుటిన్
వడిగాఁ గూలిచి వైవ, నూరుగురు విశ్వామిత్రపుత్త్రుల్ పయిన్
బడి శస్త్రాస్త్రము లేయ బ్రహ్మఋషి హుంకారానఁ గాల్చెన్ వెసన్. 707

రథముల్ హస్తుల వాజులన్ సుతుల గాల్చంట్లన్ ముహూర్తంబులో
ప్రథితేజస్వి వసిష్ఠుఁ డప్పు డెదుటన్ భస్మంబు గావింపఁ బ్ర
వ్యథితుండై కడు సిగ్గుచేఁ గుమిలి విశ్వామిత్రుఁ డూర్కొన్న నీ
రథియై కోరలు వీడు పామయి గ్రహగ్రస్తార్కుఁ డయ్యెన్ వగన్. 708

తనయుల్ పోవఁగ రెక్కలున్ నఱకఁ గ్రిందంబడ్డ పక్షింబలెన్
తన యుత్సాహము శక్తి దర్పములు చన్నన్ వేగ నిర్వేదమున్
గని యాజిన్ హతశేషుఁ డైన తనయున్ రాజ్యంబు పాలింపఁగా
వినియోగించి తపస్సు చేయ వనికిన్ శీఘ్రంబ పోయెన్ బగన్. 709

అతఁడు కిన్నెర సేవితం బగుహిమాద్రి
చరియలను మహాదేవు ప్రసాదంబు కోరి
యా మహాతపస్వి తపస్సు లాచరింప
కొంత కాలంబునకుఁ గౌశికునికి మెచ్చి. 710

క్షితిప ! ఎందుకు తపములఁ జేయుచుంటి
వేమి కావలె నెది యిష్ట మిదిగొ నీకు
వరము నిచ్చెద వరదుండ వరము కోరు
మనఁగ మ్రొక్కి విశ్వామిత్రుఁ డనె తపస్వి. 711

అభవా ! సాంగ మపాంగ యుక్తి సరహస్యంబౌ ధనుర్వేదమున్
విభు ! నాకిప్పు డనుగ్రహింపు మిట సంప్రీతుండ వై తేని స్వ
ర్విభు గంధర్వమహర్షి రాక్షసుల నేవేవున్న వో యస్త్రముల్
శుభమౌ నట్టు లనుగ్రహింపు మిక గల్గుంగావుతన్ నీదయన్. 712

అట్లె ! యగుఁగాక యని రుద్రుఁ డని చనంగ
రాజఋషియు విశ్వామిత్రుఁ డోజ మెఱసి
అస్త్రములఁ బొంది యతిదర్ప మంది యపుడు
పర్వములను సముద్రుండువలెను పొంగి. 713

ఇంక ఋషి యోడినట్లుగా నెంచి మదిని
ఆవసిష్ఠు నాశ్రమమున కరిగి యంత
యస్త్రములను ప్రయోగించి యాశ్రమంబు
తగులఁ బెట్టెను కోపించి తత్క్షణంబు. 714

అటు యశస్వి విశ్వామిత్రుఁ డస్త్ర మేయ
మునులు మునిశిష్యులు విహంగములును పాతి
భయముచే నందఱును నెల్ల పార్శ్వములకు
పాఱి పోయిరి; మృగములు పాఱిపోయె. 715

ఆ వసిష్ఠు నాశ్రమము వృక్షాదులేవి
లేనటుల నిర్జనము శూన్య మైన దయ్యె
భయపడకుఁడు విశ్వామిత్రు బలము, మంచు
నటులఁ గూల్తు నని వసిష్ఠు డనినఁ గాని. 617

అప్పు డింక నూరకొనరా దని వసిష్ఠుఁ
డలిగి యిట్లు విశ్వామిత్రు ననియెసుబాధ!
ఎంత కాలమునుండియో యిట్లు వృద్ధి
గాంచు నీయాశ్రమంబు దగ్ధం బొనర్తె. 717

ఇంక నీవుండ వెటు దుష్టవృత్తి వైతి
వనుచు మిగులఁగోపంబుతో నపుడు వేగ
యముని దండమువలె నున్న దండ మెత్తి
పొగయె లేనట్టి కాలాగ్ని వోలె మండె. 718

వ. అపుడు మహాబలు డైనవిశ్వామిత్రుఁడు ఆగ్నేయాస్త్రమును పైకెత్తి "ఉండు ముండు" మనెను. అంత మరియొక కాలదండమువలె నున్న బ్రహ్మ దండము నెత్తి భగవానుఁడైన వసిష్ఠుఁ డిట్లనెను. ఓకౌశికా! క్షత్రియబంధూ! ఇదిగో ఇచ్చటనే నిలబడి యుంటిని నీబల మేదో చూపుము. ఇదిగో ఇపుడు నీదర్పమును నీశస్త్రముల దర్పమును నాశము చేయుదును. 719

ఎక్కడ నీ క్షత్రియబల
మెక్కడ నాబ్రహ్మబలము నిదిగో కనుమీ
యిక్కడ ననుచు, మునీశు
డక్కడనే బ్రహ్మదండ మపుడే నిలిపెన్. 720

వ. అంతట అక్కడ నిలిపిన బ్రహ్మదండముచేత గాధిపుత్త్రుఁ డైన విశ్వామిత్రుఁడు ప్రయోగించిన ఘోర మైన యాగ్నేయాస్త్రము నీటిచే అగ్ని వేగమువలె శాంతించెను. అంత విశ్వామిత్రుఁడు తపస్వులలో నుత్తము డైన మునీశునిపై ని వారుణాస్త్రమును రౌద్రమును ఐంద్రమును పాశుపతమును ఐషీకమును మానవమును మోహనమును గాంధర్వము స్వాపనము జృంభణము మాదనము సంతాపన విలాపనములను శోషణమును దారుణమును జయింపరాని వజ్రాస్త్రమును బ్రహ్మపాశమును కాలపాశమును వరుణపాశమును పైనాకాస్త్రమును దయిత మను శుష్కార్ద్రము లైన రెండు అశనులను

దండాస్త్రమును పైశాచమును క్రౌంచాస్త్రమును వాయువ్యమును మథనమును హయశిరోస్త్రమును ధర్మచక్రమును కాలచక్రమును విష్ణుచక్రమును రెండు శక్తులను కంకాలమును ముసలమును వైద్యాధర మహాస్త్రమును దారుణమైన కాలాస్త్రమును ఘోరమైన త్రిశూలాస్త్రమును కపాలమును కంకణమును అను ఈ యస్త్రము లన్నిటిని ఎడతెఱపి లేకుండ ప్రయోగించెను. రఘునందన! రామ! అంత బ్రహ్మసుతుఁడైన మునీశుడు బ్రహ్మదండముచేత వీని నన్నిటిని మ్రింగి వేయుచుండెను. ఇది యంతయు అద్భుతముగ నుండెను. ఇట్టు లాయస్త్రము లన్నియు శాంతింపఁగా గాధినందనుఁడైన విశ్వామిత్రుడు ఆమునీశునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. 721

అటు బ్రహ్మాస్త్రముఁ గౌశికుండు వదలన్ హాహాకృతుల్ చేయుచున్
పటుశక్తుల్ గల యగ్నియున్ సురలు దేవర్షుల్ పతంగోరగుల్
అటు గంధర్వులు నాదిగా త్రిభువనం బార్వన్ మునీశుండు ముం
గిటి యస్త్రంబును బ్రహ్మదండమున మ్రింగెన్ బ్రహ్మతేజస్సుచే. 722

అంత బ్రహ్మాస్త్రము నటు మహాత్ముఁడైన
యా మునీశుండు మ్రింగుచున్నంత నతని
రోమకూపంబులందును ధూమ మడరు
నర్చులు గల యగ్నికివలె నర్చు లలరె. 723

ఇది వీక్షించి తపోవరిష్ఠు వర బ్రహ్మిష్ఠుఁ వసిష్ఠున్ మునుల్
మది హర్షించి స్తుతించి రిగ్గతుల బ్రహ్మ! నీతపశ్శక్తి యీ
యు దమోఘుం, బిఁకఁ దేజు తేజముననే యంతర్భవింపందగున్
మది శాంతింపు మనుగ్రహింపు జగముల్ నష్టవ్యథం బయ్యెడున్. 724

వ. నీవు విశ్వామిత్రుని నిగ్రహించితివిగదా శాంతి పొందుమని మును లని విని మహాతేజుండు మహాతపుండు నగు మునీశుండు శాంతించె. అంత విశ్వామిత్రుఁ డిటు తిరస్కరింపబడి నిట్టూర్చి యిట్లని తలంచె. 725

చూడ నిసి ! క్షత్రియబలంబు కూడ బలమె
బ్రహ్మ తేజోబలమ్మె బలంబు సుమ్మి
ఒక్క బ్రహ్మదండముచేత నొక్క టేమి
యన్ని నాయస్త్రములుగూడ హతము లయ్యె. 726

చాల నిది యంత చూచి ప్రసన్న మైన
యింద్రియములు మనస్సు ధరించి యుండ
నింక బ్రహ్మత్వ మొందగ హేతు వైన
యామహాతపంబు నిపుడ యాచరింతు. 727

—: త్రిశంకువు బొందితో స్వర్గ మొందఁ గోరుట :—

పిదపఁ దన నిగ్రహము నెంచి హృదిఁ దపించి
వడి ననఘుఁడౌ వసిష్ఠుతో వైర మూని
దక్షిణముగ విశ్వామిత్రుఁ డాక్షణంబ
మరలె నిట్టూర్చి నిట్టూర్చి మహిషితోడ. 728

వ. ఆవిశ్వామిత్రుఁడు కడు దారుణం బగు తపంబు చేసె నంత కొంత కాలమునకు 729

కడు ఘనుఁ డగువిశ్వామి
త్రుఁడు కనె ధార్మికులు ననఘులు వగు హవిష్యం
ద్రుఁడును మధుస్యందుఁడు
దృఢ నేత్ర మహారథు లనుధీరుల సుతులన్. 730

అటు వెయ్యేడులు నిండ బ్రహ్మయును ప్రత్యక్షంబయై పల్కె నిం
తట రాజర్షి జగత్తు గెల్చితివి ధన్యాత్ముండ ! రాజర్షి వి
వ్పటి కైనా వని చెప్పి బ్రహ్మ చనఁ గోపం బొంది రాజర్షి ని
వ్పటికై నావ ! మతి యాతపంబునకు సాఫల్యం బిదా యింతియే. 731

వ. అని తలంచుచు మఱియు 732

దేవర్షులు వీరందఱు;
కామించిన తపమునకుఁ గలదే ఫలమున్
ఊహింపఁ దలఁచి యొనర్చెను
ఆ విశ్వామిత్రుఁ డింక నధిక తపంబున్. 733

మఱి నా నిప్పుడె సత్యవాదియును నిక్ష్వాకుప్రభుండున్ ధరా
వరుఁడైనట్టి త్రిశంకు ఇష్టి యొనరింపన్ బూని యాబొందితో
సుర లోకంబును బొందఁగా వలయు నంచున్ రా మునీశున్ గనన్
సరికా దియ్యది శక్య మంచు గురువున్ వాక్రుచ్చుచున్ పొమ్మనన్. 734

పొమ్మనిన యంత, దక్షిణముగను పోయి
యతడు స్వేష్ట సిద్ధికి గురుసుతులఁ జేరె
అనఘు లగునూర్వురు వసిష్ఠతనయు లెంతొ
తపము చేయుచుండిరి, వారి నపుడు చూచి. 735

మోడ్చి కేలు సిగ్గున నింత మోము వంచి
యనియె "శరణిచ్చు మీరు శరణందినాఁడ
ఆ మహాత్ముఁ డగుమునీశుఁ డరుగు మనుచు
త్రోసి వేసె మీరు శుభముల్ పొందుఁ డయ్య. 736

ఒక మహాయజ్ఞమును చేయనుంటి మీర
లనుమతింపుఁడు గురుపుత్త్రులైన మిమ్ము
చేతు లొగ్గి ప్రసాదింపఁ జేసికొందు
తపసు చేయు బ్రాహ్మణులు మీదరిని యుంటి. 737

మీరు ననుఁ గార్యసిద్ధికి మేలుకొల్పి
కాదనక యిష్టిచేయింత్రుగాక యిపుడె
బొందితో స్వర్గ మెట్టులు పొందువాఁడ
నట్లు మీరు చేయింప నగును జుండి. 738

ఆవసిష్ఠుఁడు నన్ను నిరాకరింప
ఓ మునులు ! గురుసుతులు ! మీరొకరు తక్క
ఇఁక మరి గతిలే, దిక్ష్వాకులకు పురోధ
నావ సుఁడి నావయిని మీర దైవతంబు. 739

అలుకతోఁ గూడిన త్రిశంకు పలుకు వినుచు
గురుసుతులు పల్కి రిటులోయి కుటిలబుద్ధి !
సత్యవాదియౌ గురు తిరస్కరణ చేసె
ఇంక నొక్కని గురువు గావింతు వోరి. 740

ఎల్ల యిక్ష్వాకులకు పురోహితుఁడె గురువు
అట్టి సత్యవాది పలుకు నెట్టరాదు
ఇది యశక్య మని మహాత్ముఁడీమునీశు
డనిన యది చేయగ సమర్థులౌదు మెటుల. 741

పార్థివా ! యజ్ఞుఁడవు నీవు స్వపురి కరుగు
క్ష్మాప ! భగవానుఁ డే త్రిలోకముల కేని
యజ్ఞములను జేయింప సమర్థుఁ డగును
ఇతని కవమాన మేము సహింప లేము. 742

నృపతి వారి యానుడి విని యిటుల పలికె
గురువుచే గురుసుతులచే నరుగు మనుచు
నే నిరాకరింపఁ బడితి నింక వేఱ
గతిని చూతును మీకు మేల్ గల్గుఁగాక. 743

గురుసుతులు రాజుమాటలు గూడ వినియు
నీవు చండాలుఁడవు కమ్ము యింక ననుచు
బహుళ కోపంబుతో నప్డు పలికి యంత
వారు మెల్లగఁ జేరిరి స్వాశ్రమములు. 744

వ. అపు డారాత్రి గడువఁగా రాజు చండాలత్వమును పొంది నీలవస్త్రములు శరీరముపై నుండ నల్లనివాడై పరుషత్వము గలిగి వెంట్రుకలు ధ్వస్తము కాఁగా శ్మశానమందలి మాల్యగంధాదులు పూని లోహాభరణుఁ డయ్యెను. ఆచండాలరూపములో నున్న రాజును చూచి అతని యనుగాములైన పౌరులును పరుగెత్తి పోయిరి. అపు డొంటరి వాడయి రాజు ధైర్యము వీడక రాత్రిం బగళ్ళు దుఃఖము తగులఁ బెట్టుచుండ మునీశునికి వైరియై తపస్సే ధనముగా గలిగిన విశ్వామిత్రుని చేరెను. 745

నృపు విఫలత విశ్వామిత్రుఁ డెంచి మిగుల
జాలిపడియు నానృపుని ఛండాలరూపు
గని యడిగె నయోధ్యాధిప ! ఘనుఁడ ! వచ్చి
తేం శాపాన నీవు ఛండాలుఁ డైతె ! 746

అనఁగ రాజు విశ్వామిత్రు కనియె నిట్లు
గురువుచే గురుసుతులచేఁ దఱుమఁ బడితి
కోరినవి కోరికలు పొంద కుంటగాక
పైగ శాపంబు పొందితి వారివలన. 747

పొందితోడ స్వర్గమునకుఁ బోవలె నని
సౌమ్య ! మతి గల్గినది నూఱు జన్మములను
గూడ నింతవఱకు చేసినాడఁజుమ్మి
[illegible] నేమియుఁ బడయులేదు. 748

అస్మృతం బెన్నడు నాడలేదె, యుఁక ముందైనన్ సరే యాడఁబో
వను క్లేశంబుల నైన సౌమ్య ! యొనరింపన్ లేదు, క్షాత్రంబుతో
డను నీతోడను నొట్టుపెట్టుకొనుదున్ డంబాలు కావివ్వి నే
జనులన్ ధర్మముతోడ నేలితిని పల్ జన్మంబులన్ జేసితిన్. 749

గురువుల్ మున్నిట శీలవృత్తములచేఁ గూడన్ గడున్ మోదమొం
దిరి ధర్మమునకై ప్రయత్నములు నెన్నో చేయు నాయందు మా
గురువుల్ తృప్తిని పొంది రిట్టి నపుడున్ గూడన్ ఫలం బొంద దీ
పురుషక్లేశము, దైవ మొక్కటియె యొప్పున్ జేయు సామ్రాజ్యముల్.
750

కడు నార్తుండ వనుగ్రహంబు మిగులన్ గాంక్షించుచున్నాఁడ ని
వ్వుడు దైవోపహతుండ నీకు శుభమౌ, బ్రోవంగ వాంఛింతు నె
వ్వడి నింకొక్కగతిన్ గనన్ శరణ మెవ్వా రైన లేరింక నా
రడ మొందన్ గని దైవమున్ బురుషకారం బొంద వర్తింపుమీ. 751

వ. అని యాత్రిశంకువు కోరఁగా కౌశికుఁడు జాలిపడి ఛండాలరూప
ముతో నున్న రాజును జూచి యిట్లనెను. 752

వత్స ! యైక్ష్వాక ! నీకిదే స్వాగతంబు
ఈవు ధర్మాత్ముఁడ వని నేనెఱిఁగియుంటి
నేను శరణిచ్చితిని భయంబేమి పడకు
ఋషుల సురలఁ బిల్చెదమ యజింపు హాయి. 753

గురువు శపియింప నేరూపు వచ్చె నీకు
సరిగ దానితో బొందితో స్వర్గ మేరదు
ఇట్లు కౌశికు శరణంది యెనెఁగి యుంట
క్షితిప ! నీకు స్వర్గం బఱచేతిలోదె. 754

ఋషులుపలికి మహాతేజుఁ డింక సుతుల
శిష్యుతుల యజ్ఞసామాగ్రి తేఁగఁ బనిచి
అన్యశిష్యుల కనెఁ బిల్చి నాశాసనమున
విజ్ఞుల ఋషి ఋత్విజుల రావింపుఁ డిటకు. 755

ఎవ్వరేని నావాక్య మాలించి యేమి
చెప్పిన, ననాదరించినఁ జెప్పుఁ డనఁగ
దేశికుని వాక్కు విని యెల్ల దిశల కేగి
బ్రహ్మవాముల నిటు పిల్చి వచ్చి యనిరి. 756

నీ పిలుపు విని ద్విజులు మన్నించినారు
ఆమహోదయుఁడే తక్క నరుగు దెంత్రు
ఆవసిష్ఠు నూర్గురు సుతు లనిన వాక్కు
లివ్విధయో విను మయ్య మౌనీశ ! యిపుడు. 757

యాజకుఁడ క్షత్రియుఁడు ? నింక యజ్ఞకర్త
నిట విశేషించి ఛండాలుఁ డేసగె నౌరా ?
అట్టి యజ్ఞములో హవిస్సంది కొనియు
ఎట్లు దేవతలు ఋషుల్ భుజింత్రా కాని. 758

బ్రాహ్మణులు మహాత్ములు గాని వచ్చి యిటకు
ఏమి ! ఛండాలు భోజనం బెటు భుజింత్రు
పరమమౌని విశ్వామిత్రు పాలితులయి
స్వర్గ మెటుగాంతురో చూడవలయు నిపుడు. 759

అనుచు పరుషంబుగ వసిష్ఠు తనయులెల్ల
ఈమహోదయుఁడును కను లెఱ్ఱవడఁగ
చెప్పి రన విని మిగుల రోషించి మౌని
అల్కఁ గనులెఱ్ఱ వడ నవ్వు డనియె నిట్లు. 760

ఉగ్రమౌ తపమును చేయుచున్న నన్ను
దోషములులేని నన్నిటు దుష్టుఁ గాఁగ
నిందచేయుచు నున్నార లిందుచేత
ఆ దురాత్ములు భస్మమై పోదు రింక. 761

ఇపుడు కాలపాశముచేత మృత్యుగృహము
పొంది యేడువందల జన్మ లందు వారు
శవములం దినుదురు గాక శ్వానమాంస
మెఱిగి నియత ముష్టికులు నిర్ఘృణులువగుచు. 762

వికృతులు విరూపులు నగుచు వెలయుచుంద్రు
ఆ మహోదయుండు కుబుద్ధి యపులు నన్ను
దుష్టుఁగా వనెఁగాన నాదుష్టుఁ డిపుడు
అ నిషాదజన్మను పొంద నడరుఁ గాక. 763

వ. మఱియు ప్రాణనాశనము చేయుటయం దాసక్తుఁడై నిర్దయుఁడై నాయులకవల్ల దీర్ఘకాలము దుర్గతిని పొందును. అని యింతవఱకు మహా తపసుఁ డగు విశ్వామిత్రుఁ డాఋషుల మధ్య పలికి విరమించెను. 764

## —: త్రిశంకు స్వర్గ ప్రాప్తి :—

వ. మఱియు మహాతేజుఁ డగు విశ్వామిత్రుడు మహోదయునితోఁగూడ వసిష్ఠపుత్రుల తపోబలహతులఁజేసి ఋషులనడుమ నిట్లనెను. 765

ఇక్ష్వా కిక్ష్వాకువంశ్యుడౌ నీత్రిశంకు
డనఘుఁడు వదాన్యుఁడ్తను శరణందె నన్ను
ఈశరీరముతో స్వర్గ మెనయుకొఱకు [illegible]
నందుకై యజ్ఞమును చేయఁ [illegible] 766

మౌను లెల్ల విశ్వామిత్రు మాటలు విని
ధర్మవిదులై కలసి యిట్లు తలచినారు
కుశికకులుఁ డైనముని మహాకోపి కాన
ఇతఁడు చెప్పిన యటు చేత మిపుడు మనము. 767

వ. ఒకవేళ మన మట్లు చేయకుందుమేని అగ్నికల్పుడు; భగవానుడు
విశ్వామిత్రుడు రోషముతో శాపమియ్యగలఁడు. కావున 768

దివ్య మైనవిశ్వామిత్ర తేజమునను
బొందితోడ నిక్ష్వాకుల పుత్రుఁ డెట్లు
స్వర్గ మొందునో యటు చేయవలెను యజ్ఞ
మిందుచే మీరు క్రియలు గావింపు డయ్య. 769

ఇటు లని మహర్షులు చేసి రెల్లక్రియలు
యాజకుఁడుగ విశ్వామిత్రుఁ డయ్యె నపుడు
ఋత్విజులు నానుపూర్విగ నెల్లకర్మ
లదె యథాకల్పముగ యథావిధి నొనర్చి. 770

అటఁ దపస్వి విశ్వామిత్రు డఖిల సురల
నమరి భాగాల కావాహ నమును జేయ
వారు వారు తమతమదు భాగమొంద
భువికి రారయ్యె ఛందాలు సవన మగుట. 771

అంత మౌని విశ్వామిత్రుఁ డలుకఁ బూని
స్రువము నెత్తి త్రిశంకుని జూచి పలికె
నిపుడె చూడు నేనార్జించు తపసుశక్తి
నిదిగో నృప ! నిన్ను స్వర్గ మొందింతు జుమ్మి. 772

ఈశరీరముతో నెవ్వ రేనయురాని
స్వర్గ మొందింతు నాదు నోజస్సుచేత
స్వార్జితము కొంత నాతపఃఫలము గలదు
కాన బొందితో దివికేగు దానిచేత. 773

అని ముని పలుక బొందితో జనవరుండు
మునులు చూచుచుండఁగ స్వర్గమునకుఁ జనియె
స్వర్గమునకు వచ్చు త్రిశంకు శక్రుఁ డరసి
సురలతోఁ గూడి పలికె భూవరునితోడ. 774

ఓ త్రిశంకు ! మరలిపోవు మోరి ! యింక
మూఢ ! గురుశాపహతుఁడవు భూమిమీద
నీవు తలక్రిందుగాఁబడి పోవు మిపుడు
అనఁగ తలక్రిందుఁగ త్రిశంకుఁ డపుడె పడెను. 775

అటు తలక్రిందుగ త్రిశంకుఁ డపుడె పడుచు
కావు కావని యేడ్చుచుఁ కౌశికునికి
నపుడు మొర పెట్టుకొన నాతఁ డాగు మాగు
మనుచు బహురోషమును పూని యనియె. 776

అపుడు ఋషిమధ్యఁ దేజస్వి యపరబ్రహ్మ
వలెను మరొక సప్తర్షి మండలముగూడ
దక్షిణదిశగను సృజించి త్వరితగతిని
ఇంక క్రొత్త విశ్వామిత్రసృష్టి చేసె. 777

చెలఁగి క్రోధంబుచేత మూర్ఛిల్లి మౌని
ఇంక నక్షత్రములు నిర్వదేడు మరల
దక్షిణముగ సృజించియు దేవతలు నిందుఁ
జేతు లేక లోక మునీంద్ర మౌత మనుచు. 778

ఎంచి దేవులన్ మౌని సృజింపసాగె
కరము కంగారుపడి సురాసురులు ఋషులు
యక్షులును కిన్నరులు సిద్ధు లామహాత్ముఁ
డైన మునిని విశ్వామిత్రు ననునయించి, 779

ఇటు లనిరి మహాభాగ ! యీత్రిశంకుఁ
డిపుడు గురుశాప హతుఁ డౌట నీతఁ డింక
బొందితో నెప్పటికి స్వర్గ మొందఁ దగఁడు
అనఁగ వారి మాటలు విని మౌని యనియె. 780

బొందితో స్వర్గమునకుఁ బంపుదు నటంచు
నీత్రిశంకునకును మాట యిచ్చి దాని
నసృత మొనరింపఁ గోరను నానృపతికి
శాశ్వతంబుగ బొందితో స్వర్గ మగుత. 781

కడఁగి నే సృజించినవి నక్షత్రములును
ధ్రువములై యుండుఁ గావుత దివముపై ని
నే సృజించినవి జగంబు లెంతవఱకు
నుండు, నందాఁకను ననుమతింపుఁడు సురలు ! 782

అనఁగ సుర లిటు పలికిరి మునివరేణ్య !
ఇట్ల యగుగాక శుభమౌత మిట్టి యెపుడు
దివిని వైశ్వానరజ్యోతి దిశకు వెలిగ
చాలచుక్కలుగల వందుఁ గ్రాలుఁగాక. 783

అట్టి నక్షత్రముల జ్యోతులందు వెలిగి
యీత్రిశంకువు తలక్రిందె యెసఁగు గాక
ఈత్రిశంకుని నీచుక్క లెనయుఁగాక
స్వర్గమందటు యశస్సహితుఁ డవుత. 784

అన సనఘుఁడు విశ్వామిత్రుఁ డట్లె యనుచు
ఋషులు సురలు స్తుతింప వచించె నంత
పరమ యజ్ఞంబు చివర దేవతలు ఋషులు
వంచఋను వచ్చినట్లుగ నరిగినారు. 785

## —: శునశ్శేపుని విశ్వామిత్రుఁడు బ్రతికించుట :—

వ. అంత మహాత్ముఁ డైన విశ్వామిత్రుఁడు బయలుదేఱిన వనవాసులైన ఋషులను జూచి యిట్లనెను. దక్షిణ దిశకు వచ్చి యున్న నాకు చాల విఘ్నము కలిగినది. కనుక ఇంకొక దిక్కుకు పోయి యక్కడ మహాతపము చేయుదు ననుకొనెను. అంతట విశాలమైన పడమర దిక్కున పుష్కరము లందుండి సుఖముగా తపము చేయుదును. అదే తపోవనము. అని తలఁచి యా మహా తేజుఁడు మూలములు పండ్లు ఆహారముగాఁ గొని ఉగ్రమును దురాధర్షము నైన తపముఁ జేసెను. 786

పరిగ నీకాలమునయందె యంబరీషుఁ
డను నయోధ్యాధిపతి యజ్ఞ మాచరించె
అప్పు డతని పశువు నింద్రుఁ డపహరించె
పశువు చన విప్రుఁడు పతితోఁ బలికె నిట్లు. 787

నృపతి ! నీయజ్ఞాగ్రత్తఁ బశు వపహృతంబు,
కావలేని రాజును దోషగణము చంపు
ఇందు గొప్ప ప్రాయశ్చిత్త మెవయు రాజ !
కర్మయుగులోన వరపశున్ కడకుఁ దెమ్ము. 788

అను నుపాధ్యాయు మాటలు వినియు రాజు
వేల గోవు లిచ్చియు నైన వెదకెఁ బశువు
జనపదములు పురములు దేశములు వనులు
వెలయు నాశ్రమంబులు రాజు వెదక సాగె. 789

అంత భృగుతటంబున భార్య యాత్మజులను
కలిసి కూరుచున్న ఋచీకుఁ గాంచి మ్రొక్కి
క్షేమ మడిగి ప్రసన్నుగఁ జేసికొనుచు
తపసుచే వెల్గు బ్రహ్మర్షి కపుడు చెప్పె. 790

నూఱువేల గోవులకుఁ దనూజు నొకనిఁ
బశువుగా విక్రయింతువే భార్గవాగ్ర్య
ఇంకఁ గృతార్థుఁడ నౌదు నెల్లెడల వెదకి
యజ్ఞపశువుఁ బొంద వెంకమ్మ సుతుని. 791

అన ఋచీకుఁ డనియె "జ్యేష్ఠు నమ్మ నేను
అనఁగ నామహాత్ముల మాత యనియె నిట్లు
అమ్మ నీజ్యేష్ఠు నసెఁ ఋజ్యుఁ డంత నాకు
ఈ కనిష్ఠుఁడు శునకుఁడు నెంతొ ప్రియుఁడు. 792

అందుచే నృపతి ! కనిష్ఠు నమ్మనేను
తఱచుగా జ్యేష్ఠ శిష్ఠులు తండ్రులకును
మాతలకుఁ గనిష్ఠులు నిష్టులై తనర్తు
కాన నేనీయను కనిష్ఠుఁ గాచికొందు. 793

అనుచు మునియును మునిపత్ని యనఁగ నపుడు
మధ్యముఁడు * శునశ్శేఫుడుఁ బలికె నిట్లు
జ్యేష్ఠుఁ బిత యమ్మ నసెను గనిష్ఠు నమ్మ
ననియె మాత, మధ్యముఁడ నన్గొనుము రాజ ! 794

---

* కులము నాశము గాకుండఁ బుత్రుని నమ్మవచ్చును. అది యజ్ఞము నకుఁ గాన ధర్మమని పూర్వులు.

* శునస్=నుఖమైన, శేఫః=కాంతి గలవాఁడు అని ఋగ్వేదమంత్రము లందర్థము చెప్పఁబడియె.

మధ్యముని నన్ను నమ్మిన మాడ్కి నెంచి
తీసికొని పొమ్ము నృప ! యన తృప్తిచెంది
రాజు కోట్లకొద్ది పసిండి రత్నరాశి
గోవు లిడి శునశ్శేపుని కొనియె నపుడు. 795

అటులఁ గొని యెంతొ ప్రీతితో నలరి యపుడు
యింక శునశ్శేపు రథము నెక్కించి కొనుచు
అరిగి యంబరీషుండు మధ్యాహ్నమందు
విమల పుష్కరతీర్థాన విశ్రమించె. 796

వ. అపుడు నృపతి యంబరీషుఁడు విశ్రమించుచుండఁ జూచి మహా
యశుఁ డగు శునశ్శేపుఁడు పుష్కరక్షేత్రమునకు వచ్చి ఋషులతోఁ గూడి
తపస్సుచేయు మేనమామ విశ్వామిత్రుని జూచి వివర్ణవదనుఁ డయి దప్పిక
చేతను మార్గశ్రమచేతను దీనుఁడయి ముని యెదుటనుండుఁ గూలబడి
యిట్లనెను. 797

తల్లియూ లేదు నాకింక తండ్రి లేడు
బంధువులును జ్ఞాతులు నింక నుందు రెటుల
నీవు ధర్మముఁ బట్టి నన్ గావఁదగుదు
సర్వులను బ్రోచువాఁడవు సాధకుఁడవు. 798

ఎటుల రాజు కృతార్థుఁడౌ, నెటుల నేను
నాశమును బొందక చిరాయునై సుఖింతు
ఎంతొ యధికతపము చేసి యెటుల స్వర్గ
మొందుదునో యట్లు నీవ చేయం దగుదువు. 799

ఉత్తమం బైన చిత్తము నొంది యిపుడు
దిక్కులేని నాకును నీవ దిక్కు వగుము
దయను ధర్మాత్మ ! పుత్రుని దండ్రివోలె
కలుషమువనుండి నీవు వన్ గావఁదగుదు. 800

అనఁ దపస్వి విశ్వామిత్రుఁ డాలకించి
యతని యెంతయు నూరార్చి సుతుల కనియె
ఎందుకై తండ్రులు సుతులన్ గందు రొకొ
అట్టి పరలోకహితము సంప్రాప్త మయ్యె. 801

ఇతఁడు మునిసుతుఁడు బాలుం
డితండు నన్ను శరణమ్ము నిప్పుడు పొందెన్
ఇతనికి సుతులారా ! జీ
వితమే యిడి చేయుఁ డయ్య ప్రియమౌ పనియున్. 802

మీరెల్లరు పుణ్యాత్ములు
మీరెల్లరు ధర్మపరులు మీరే యిపుడే
ఆరాజు యజ్ఞపశువై
కూరిమి నగ్నికిని తృప్తి కూర్పుఁడు త్వరగా. 803

శరణొందు శునశ్శేఫుఁడు
మరి యజ్ఞంబో యవిఘ్నమై యిఁక జరుగున్
సురలును తృప్తినిగాంతురు
మరి నామాటయును మీరు మన్నించుటయౌ. 804

అన మధుష్యందుఁడు మొదలౌ తనయులు నగి
పలికి రభిమానముగ, స్వపుత్రులఁ ద్యజించి
యితర సుతులఁ గావఁదలఁతు విది యకార్య
మనుకొనెదము శ్వమాంస భోజనమువోలె. 805

సుతుల మాటలు విని మౌనిపతియు మిగుల
నలుకఁ గనులెఱ్ఱవడ నిట్టు లనియె పిదప
పరుషమయి పులక లిడు నావాక్కు త్రోసె
భయము విడి ధర్మ నింద్యముల్ పలికితి రిట. 806

ఇఁక వసిష్ఠ పుత్త్రులటు వేయేండ్లు మీరు
కుక్క మాంసము తించుఁ దిర్గుదురుగాక"
అనుచుఁ బుత్త్రుల శపియించి మునియు నార్తు
నా శునశ్శేపుఁ గాచుట కటు వచించె. 807

"పావన కుశపాశంబుల బద్ధుఁడ వయి
రక్తవస్త్రాలు గంధమాల్యములు దాల్చి
విష్ణు దైవత యూపంబు వేగ నెక్కి
* నగ్ని నాగ్నేయమంత్రాల నభినుతింపు. 808

దేవతాశ్రేష్ఠుడౌ నిందుని దేవు విష్ణుఁ
** బొగడు, మీదివ్యగాథలఁ బొగడి పాడు
మంబరీషు నిష్టిని సిద్ధి నందఁగలవు"
అనుచు నపుడు విశ్వామిత్రుఁ డనియెఁ గరుణ. 809

---

* ఈ క్రిందివి యాగ్నేయ మంత్రములు.

** ఈ దివ్యగాథలు ఋగ్వేదములో నున్నవి.

శునశ్శేఫో హ్యహ్వద్గృభీత స్త్రి ష్వాదిత్యం దుపదేషు బద్ధః ।
అవైనం రాజా వరుణః ససృత్యా త్యాద్విద్వా అదబ్ధో మో క్తుపాశాన్॥
ఋగ్వేద. 2-4-13.

సంస్కృతము :-

త్రిషు స్తంభేషు సంబద్ధః శునశ్శేఫోఽథ రక్షితుంవై ఆహూతవాన్, రాజానం, వరుణ మదితిపుత్రకం, విమోచనో పాయ వేదీ, రాజా వరుణ ఏవహి। అప్రతిహత శక్తిశ్చ, శునశ్శేఫం విముంచతు॥

మూడు స్తంభాల బద్ధుఁడౌ శునశ్శేపుఁడు రక్షకై, రాజు నదితు పుత్త్రి వరుణు నంత బల్కెను. మోచనోపాయం బెఱుంగు, రాజు వరుణుం, డిప్పుడే అప్రతిహతశక్తియై, శునశ్శేపు వదల్చుతన్. (నా ఋగ్వేదానువాదము నుండి)

ఇది వేదోప బృంహణము. వేద వాక్యములను వివరించు కథాభాగము.

పెలఁగి భక్తి శ్రద్ధను శునశ్శేపుఁ డపుడు
రెండు గాథల గ్రహియించి నృపతియైన
యంబరీషుతోఁ బల్కెను నలరి యిటుల
తాను రక్షింపఁబడి నటు తలఁచి మదిని. 810

"రాజవర ! మహాసత్త్వ ! శీఘ్రంబె సభకు
పోవుదము యజ్ఞ మొనరింపు, పూను దీక్ష"
అనఁగ యజ్ఞవాటిక చేరి జనవిభుండు
యజ్ఞమును చేయఁ బొడగెను నధికభక్తి. 811

ఆఋషి సుతుని వాక్యంబు లాలకించి
యజ్ఞవాటికఁ గని సదస్యాజ్ఞ పొంది
రాజు నరపశున్ రక్తవస్త్రధరుఁ జేసి
దర్భలను గట్టి యూపాన బద్ధుఁ జేసె. 812

అతఁడు బద్ధుఁడై మంత్రవాక్యములచేత
ఇంద్రు విష్ణున్ యథావిధి నీఁక స్తుతింప
ఇంద్రుఁడు రహస్యనుతులచే తృప్తి గాంచి
ఆ శునశ్శేపునకును దీర్ఘాయు విచ్చె. 813

అంత నంబరీషుఁడు సహస్రాక్షు దయను
బహుగుణం బగు యజ్ఞపు ఫలము పొందె
అనఘుఁడైన విశ్వామిత్రుఁ డవల వేయి
యేండ్లు పుష్కరభూమిఁ గావించెఁ దపము. 814

### —: విశ్వామిత్రుఁడు మేనకావ్యామోహమునఁ బడుట :—

అతఁడు వేయేండ్లు నిండఁగ వ్రతము పూర్తి
చేసి యవభృథ స్నానంబు చేసి కొనఁగ
వరముని దరిఁ జేరి సురల్ తపఃఫలంబు
నీయఁ గోరి రంతట బ్రహ్మ యిటుల పలికె. 815

స్వార్జితం బగు తపములవలన నిపుడు
నీవు ఋషి వైతివి నీకు నెసఁగు శుభము
అని పలికి బ్రహ్మ త్రిదివము చనఁగ నపుడు
నింకఁ జేసె విశ్వామిత్రుఁ డెంతొ తపము. 816

చాల కాల మిట్లేగ పుష్కరములందు
అప్సరస మేనకయె స్నాన మాడ రాఁగ
నీలిమబ్బులోన మెఱపువోలె మెఱసి
సాటిలేని సొంపులు గుల్కు బోటిఁ జూచి. 817

మనసు చలియింప మౌని యామగువ కనియె
అప్సరస ! స్వాగతమ్ము నాయాశ్రమమున
నుండి మోహ మొందిన నన్ననుగ్రహింపు
నీకు శుభ మగునన నట్లె నిలిచె నామె. 818

ఇటులు కౌశికు తపమున కెంతొ విఘ్న
మొదవె, నటులామె యటనుండఁ బదియునేండ్లు
హాయిగా నాశ్రమంబున నపుడు గడవ
చింతఁ గుమిలి కౌశికుఁ డెంతొ సిగ్గుపడియె. 819

అంత ముని దేవతల కల్గి యనుకొనియెను
అరరె ! యీతపోవిఘ్నము సురల పనియ
ఇటు లహోరాత్రములఁ బదియేండ్లు గడచె
మోహమునఁ బడి, నను నేనె ముంచికొంటి. 820

అనుచు మౌని పశ్చాత్తాప మంది యూర్చి
యపుడె భయపడి వణఁకుచు నంజలించు
మేనకను జూచి యామెను తీయనైన
పలుకు లాడుచు వీడ్కొల్పి పంపివైచె. 821

అవల రామ ! విశ్వామిత్రు డచటినుండి
యు త్తరముగఁ బోయి మనస్సు నొగి జయింప
నిష్ఠతోఁ గౌశికీతటిన్ దీక్షఁ బూని
దారుణంబుగ పెయ్యేండ్లు తపము చేసె. 822

ఇటులు ఘోరతపము లాచరించుచుండ
భయముపడి దేవతలు ఋషుల్ పలికి రిట్లు
ఇదిగొ కౌశికుఁడు మహర్షి పదవి నిపుడు
పడయుఁగావుత మని యటు నుడివినంత. 823

దేవతల వాక్కు విని బ్రహ్మదేవుఁ డనియె
వత్స ! ఓమహర్షి ! నీకు స్వాగతంబు
నీమహోగ్రతపస్సుచే నే మరింత
హర్ష మొందితి నింక మహర్షి వైతి. 824

అనఁగ నాబ్రహ్మవాక్కును విని మునీశుఁ
డంజలి యిడి యాబ్రహ్మతో ననియె నిటులు
స్వార్జితం బగుక్రియల బ్రహ్మర్షిపదవి
నిచ్చితివ యేని నవుదుఁ జితేంద్రియుఁడను. 825

అనఁగ బ్రహ్మ యనె జితేంద్రియత్వ మింక
నీకు లేదు జయం బగు నేనరిగెద
ననుచుఁ లోకపితామహుఁ డంత త్వరగ
బ్రహ్మలోక మేగ నింక దేవతలుఁ జనిరి. 826

చనఁగా దేవత, లూర్ధ్వబాహు వయి విశ్వామిత్రుఁ డాధార మె
ల్లను వర్జించియు వాయుభక్షుఁ డయి ఘోరంబౌ తపం బూనె, నెం
డను గ్రీష్మంబులఁ బంచవహ్నులవి మండన్ మధ్యగా నిల్చె వా
నను వర్షంబులబైట నిల్చి చలిలోనన్ నీళ్ల నిల్చుండియున్. 827

పగలున్ రాత్రియు నేకధాటిగఁ దపం బత్యంతమున్ దారుణం
బుగ నెద్యోడులు చేయుచుండ దివిపై భూమ్యంతరిక్షంబులన్
మిగులన్ గందరగోళ మయ్యె సురలున్ దేవేంద్రుఁడున్ సంభ్రమం
బుగ రంభన్ గని పల్కె రాత్మకు హితంబున్ మౌని కప్రీతిగాన్. 828

## —: విశ్వామిత్రుఁడు రంభను శపించుట :—

సురకార్యం బిది రంభ ! గొప్ప దిదియే సుమ్మీవు నీరోజునే
త్వరగానే చని హావభావముల విశ్వామిత్రు మోహంబులోఁ
జొరఁ గామంబులమంచిచేయు మనఁగన్ జూపుల్ ధరన్ నిల్పియున్
శిరమున్ వాలిచి సిగ్గుతో వణఁకుచున్ గేల్మోడ్చి పల్కెన్ వగన్. 829

సరె కానీ బహుదారుణుం డయిన విశ్వామిత్రమౌనీశుఁ డో
సురరాజా ! కడు నాపయిన్ గినుక చిచ్చుల్ చిమ్మి వర్షించు నే
వరుగంజాల వనుగ్రహింపు భయమనో నంచున్ వచింపంగ న
త్తరి దేవేంద్రుఁడు మ్రొక్కి పల్కు సురకాంతన్ జూచి తా నిట్లనెన్. 830

నీవు నాయాజ్ఞ నెరవేర్పు నేనుగూడ
మరువు తరువుల విరుల వసంతుఁ డరయ
సకుఁడు స్మరుతోడ హృదిలాగు పికము నగుచు
నీకు సాయంబుగా నుందు నీవు దరిని. 831

వ. అని దేవేంద్రుడు ఆజ్ఞాపించగా అపుడు రంభ సాటిలేనిరూపముధరించి శుభ్ర మైన నవ్వులతో నందమై విశ్వామిత్రుని లోభపెట్టసాగెను. కోయిల కూడ మధురముగాఁ గూయుచుండెను. అపుడు విశ్వామిత్రుడు సంతసించిన మన స్సుతో ఆమెను పై కిఁ జూచి ఆమె మధురగీతములచేతను ఆకోయిల మధుర స్వరముచేతను రంభరూపముచేతను ముని సందేహించి ఇదంతయు ఫ్రహ్మ

ప్రాప్తుఁ డయిన యింద్రుని పనిగా తలఁచి క్రోధముతో రంభను శపించెను. ఓరంభా ! దుష్టురాలా ! కామక్రోధముల జయింపఁ గోరు నన్ను లోభపెట్టు చున్నావు కనుక, నీవు పదివేలయేండ్లు రాతిబొమ్మగా ఉందువుగాక, తపో బలము కలవాఁడును మహాతేజస్వియు నగు బ్రహ్మపుత్త్రుఁడు నాక్రోధముచేఁ గలుషము నొందిన నిన్ను ఉద్ధరింపఁగలఁడు లెమ్ము అని పలికి విశ్వా మిత్రుఁడు క్రోధ మాపు కొనలేక యుని యంతలో పశ్చాత్తాపము పొందెను. ఆమహా కోపముచే శపింపబడిన రంభ రాతిబొమ్మ యయి పోయెను. ఆకోపో క్తులు విని స్మరుఁడు అక్కడనుండి వెడలిపోయెను. అంత ఆమహాతేజస్వి యగు విశ్వామిత్రుఁడు తనతప మంతయు వ్యర్థమయిపోగా ఇంద్రియములకు లొంగి ఆత్మశాంతి పొందలేక యిటులు చింతించెను. 832

ఇఁకఁ గోపంబును జెందఁ గొంచెమును నేమీపల్కనే పల్క నెం
దుకు నుచ్ఛ్వాసము వందయేండ్లయిన నెందున్ దీయనే తీయ, ముం
దిఁక సర్వేంద్రియముల్ జయించుటకు నన్నొండింపఁజేతున్ మరే
లకు బ్రాహ్మణ్యము పొందుదాఁకఁ దినఁ బిల్చిన్ నేనిటే యుండెదన్.
833

నేనిటుల తవంబుల నాచరించుచుండ
నాయవయవంబులు క్షయంబు నంద నెపుడు
అని యటులను వేయేండ్లు దీక్షను వహించి
అవ్రతిమ మయినప్రతిజ్ఞ నతఁడు పూనె. 834

## —: విశ్వామిత్రునికి బ్రహ్మర్షిత్వము సిద్ధించుట :—

అంత ను త్తరదిశ వీడి యామునీశుఁ
డవలఁ దూర్పుగఁ బోయి యత్యంత ఘోర
మైన తపమును గావించె మౌన మూని
మౌనమును వేయియేండ్లను పూని యుండె. 835

అటు వేయేండ్లు తపంబు చేయు ముని హస్తాకారుండై పోయె నెం
తటివిఘ్నంబులు వచ్చినన్ మునియు క్రోధం బూనఁడింతేని, న
చ్చట దీక్షం గొన నిశ్చయించి యతికష్టం బౌతవం బూనె నం
తట వెయ్యేడులు నిండగా వ్రతము పూర్ణం బౌట నామౌనియున్. 836

అన్నము భుజింప సాగిన నప్పు డింద్రుఁ
డొక్క ద్విజుఁ డయి వచ్చి యందున్న యన్న
మడుగ మాఱు మాటాడక యన్న మంత
నిడుచు తినకె మౌనమున నుండె జడంధారి. 837

అటు వెయ్యేడులు శ్వాస తీయకయె యున్నంతన్ మునిశ్రేష్ఠముం
దట శీర్షంబున ధూమముల్ వెడలె నాత్మై త్రిలోక్య ముత్తప్తమై
యట సంభ్రాంతము కాఁగ దేవగణముల్ వ్యామోహముంబొంది త
త్పటు తేజస్సున మందులై పడి యిటుల్ వాక్రుచ్చి రాబ్రహ్మతో. 838

అన్ని గతుల విశ్వామిత్రు నరసినాము
కోప పెట్టి లోభము పెట్టి చూపినాము
కాని తపము వృద్ధినిపొందు, వీని కింత
స్వల్పదోషమున్ గూడచూపట్టలేదు. 839

ఇతనికే కనుక నభీష్ట మిడక యున్న
తపసుచేఁ ద్రిలోకములు కాల్చి యిపుడె యణచు
దిశలు వ్యాకులం బయ్యె నేదియును వెలుగ
దంబుధులు క్షోభపడుఁ గొండ లగిలి పోవు. 840

పృథివి కంపించె గాలి స్తంభించిపోయె
బ్రహ్మ! యెఱుఁగు నాస్తికులయి ప్రజ లవుదురు
మూఁడు లోకాలు సంక్షోభమున మునింగె
ఆ మహర్షి తేజస్సులో వరుసఁ దడఁగె. 841

ముని జగన్నాశమునఁ బూనుకొనక ముంది
అగ్నిసము నను గ్రహ మిపుడండఁ దగును
అతఁడు త్రిలోకిఁగాల్చుఁ గాలాగ్నివోలె
స్వర్గరాజ్యము కోరి నప్పటికి నిడుము. 842

వ. అని పలుకుచు బ్రహ్మదిదేవతలందఱు కలసి మునితో నిట్లనిరి. 843

ఓయి బ్రహ్మర్షి ! తపసుచే నొదవె ముదము
స్వాగతమునీకు ! నుగ్రతపంబుచేత
బ్రాహ్మణత్వ మొందితివి దీర్ఘాయు వగుము
స్వస్తి యగు నీకు శుభమౌతఁ జనుము హాయి. 844

అని బ్రహ్మదిసురల్ వచింప ముని యత్యానందముం జెంది మో
మునఁ గేల్మోడిచి శ్రద్ధ భక్తి వినయంబుల్ తోఁప నీరీతిఁ బ
ల్కెను బ్రాహ్మణ్యము దీర్ఘ మాయువును సంప్రీతిన్ సమర్పింపఁగా
నను నోంకారవషట్కృతుల్ శ్రుతులు సన్మానింప నేతెంచుతన్. 845

బ్రహ్మక్షత్రియ వేద వేత్తృగణ సర్వశ్రేష్ఠుడున్ శిష్టుడున్
బ్రహ్మిష్ఠుం డగునా వసిష్ఠుఁడె ననున్ బ్రహ్మర్షివీవన్నచో
బ్రహ్మేంద్రాదివరిష్ఠులార ! యిఁకఁ బూర్ణంబౌ మదిష్టం, బనన్
బ్రహ్మమల్ సరె యంచు నేగికని రంతన్ తద్వసిష్ఠానృతిన్. 846

ఇఁక బ్రహ్మర్షి వసిష్ఠుఁడంత సరె యట్లే యంచు వాక్రుచ్చిమన్నించెఁ గౌ
శికు బ్రహ్మర్షివ, యైతి నీదుప్రియముల్ సిద్ధించె సందేహ మెం
దుకు నీయందు సమస్తమౌ విషయమున్ శోభించి సంపన్నమొం
దకయౌనే యని వచ్చినట్లు సుర లంతర్ధానమై రంతటన్. 847

వ. అనంతరము ధర్మాత్ముడైన విశ్వామిత్రుడును ఉత్తమ మగు బ్రాహ్మణ్యమును పొంది బ్రహ్మర్షియగు వసిష్ఠుని పూజించి కృతార్థుఁడై సర్వ

మహీమండలమును తపస్సులోనుండియె సంచరించెను. రామ! మహాత్ముఁ
డీత డిట్లు బ్రాహ్మణ్యమును పొందెను. 848

ఈతఁడు మౌనులందు ఘనుఁ డీతఁడు మహార్తిని గొన్న సత్తపం
బీతఁడు నిత్యధర్మపరుఁ డీతఁడు వీర్యనిధానమే సుమీ
ఈతఁడు నిట్టు లింద్రియము లెల్ల జయించిన ధీరచిత్తుఁడౌ
ఈతని శక్తి దానవ మునీశ సురాదు లెఱుంగ రెవ్వరున్. 849

వ. అని పలికి ద్విజోత్తముఁడు ముగింప రామలక్ష్మణ సన్నిధిని శతా
నందుని వాక్యము లాలకించి ప్రాంజలియయి జనకమహారాజు విశ్వామిత్రు
నితో నిట్లనియె. 850

ఈకకుత్స్థ వంశ్యులతోడ నిచట నేను
చేయు యజ్ఞంబునకు వచ్చితివి గాన
ఎంతొ ధన్యుఁడనైతి ననుగ్రహింపఁబడితి
బ్రహ్మ! నీదర్శనమునఁ బావనుఁడ నైతి. 851

ఓమహాభాగ! బ్రహ్మర్షి వుత్తముఁడవు
నినుఁ గనుంగొనుటను జాలగుణము లబ్బె
బ్రహ్మ! విస్తరంబుగ నీదు పరమతపము
పొగడఁ బడఁగ వింటి మిట రాముఁడును నేను. 852

నా సదస్సున కేతెంచినట్టివారు
నీమహాగుణంబు లభినందించినారు
నీతపం బప్రమేయము నీబలమ్ము
నీగుణంబు లప్రమేయముల్ నిత్య మనఘ! 853

నీదు నాశ్చర్యకథ కంతులేదు ప్రభువ!
కర్మలకుఁ గాల మయ్యెను కర్మనిరత!
అదిగొ సూర్యమండలము ప్రేలాడు చుండె
నుదయమే మహాతేజ! చూచెదముగాక. ౮౫౪

నీకు స్వాగతము తపస్వి లోకమాన్య!
త్వరగ నాకాజ్ఞ యిడు పోయివత్తు నింక
అన మునివరుండు నాపురుషాగ్ర్యు మెచ్చి
ప్రీత చిత్తుఁడౌ జనకుని వీడుకొలిపె. ౮౫౫

అంత మిథిలాధిపతి తాపసాధిపతికి
బంధువులతో నుపాధ్యాయప్రతతితోడ
నికఁ బ్రదక్షిణ మొనరించె, ఋషులు గొలువఁ
జనిరి ముని రామలక్ష్మణుల్ సవన కుటికి. ౮౫౬

—: శివధనుస్సును గూర్చి జనకుఁడు తెలుపుట :—

పెదవఁ దేటగా తెలవారి నుషఃసుకృత్య
మెల్ల నెఱవేర్చి మునిని దర్శించి శ్రద్ధ
నర్ఘ్య పాద్యాదు లిడి కొల్చి యనఘులైన
రాఘవులు వినన్ మునితోడ రాజు పలికె. ౮౫౭

స్వాగతము నీకు భగవంత! స్వాగతంబు
ఏమి నీకుఁ జేయుదు నాజ్ఞ యిడెదుగాక
ధన్యచరిత! నన్ శాసింపఁ దగుదువీవు
అనఁగ రాజుతో విశ్వామిత్ర ముని పలికె. ౮౫౮

వీరు దశరథపుత్త్రులు వీరవరులు
క్షత్త్రియులును విశ్రుతులు నీకడనె యున్న
ధనువు కనఁ గోరుచున్నారు కనఁబఱుపుము
నీకు శుభమౌఁ గని యొవర్త్రి నేర్చివటుల. 859

అని పలుక మునీశున కనె జనకుఁ డపుడు
ఎందుకై యీధనుస్సిట నెసఁగె వినుము
నిమికి నాఱవవాఁడైన నృపతి గలఁడు
దేవరాతుఁ డనంగ ఖ్యాతిని గడించె. 860

ఆ మహాత్ముడౌ రుద్రుఁడె యతని దరిని
దాఁచఁ బెట్టెను భగవంత ! ధనువు నెపుడొ
దక్ష యజ్ఞ నాశమునందు ధనువు నెత్తి
మునుపు రుద్రుఁడు సురలతో ననియె నిట్లు. 861

పోక యజ్ఞ భాగము కోరు నాకు మీరు
యజ్ఞ భాగము కల్పింప రైరి కావ
ధనువుచే మీశిరస్సులు దునిమి వైతు
అనఁగ బ్రతిమాలుకొనిరి దైన్యమున సురలు. 862

అపుడు వారికిఁ బ్రీతుఁడై హరుఁడు కరుణ
ఆ మహాత్ములౌ సురలకు నాధనుస్సు
కాను కీయగ మాకు ప్రాచీనుడైన
దేవరాతున కిచ్చిరి దేవు లపుడు. 863

అన్ని యిటులుండ నేభూమి దున్నుచుండ
పొలము శోధించు నప్పుడు హలమునుండి
పైకి లేచెను నొక బిడ్డ; ప్రజలలోన
అదియు సీత యనంగఁ బ్రఖ్యాతి గాంచె. 864

భూతలమునుండి పుటి యాబోటి పెరిగె
అయయోనిజ కేను వీర్యంబె కట్న
మని స్థిరంబు చేసితినంత నఖిల నృపులు
మెచ్చి పెండ్లి యాడుదు మని వచ్చినారు. 865

చూచి యామెకు వీర్యంబె శుల్క మనుచు
నేగుదెంచిన వారల కేను నిడను
అంత వారలు మిథిలకు నరుగుదెంచి
యేది వీర్యమో తెలిసికో నెంచినారు. 866

అపుడు వారిముం దుత్తమ మైనధనుసు
పెట్టితిని వారొ యది యెక్కు పెట్టలేదు
వారి వీర్యము చాలస్వల్పంబ యనుచు
నెంచి వారలను నిరాకరించినాను. 867

వ. అపుడు వారు మిగుల కోపముతో వచ్చి. 868

వారలను నేను నవమానపఱచితి నని
మిథిలపై కి దండెత్తి యామిథిల పాడు
చేసి రటులొక్క యేడేగ నానసుత్త
సాధనములు నాశము కాఁగ బాధపొంది. 869

ఏఁ దపసుచే సురల ప్రసాదింపఁ జేయు
వారు కడు ప్రీతిఁ జతురంగబలము లిడిరి
అంత రాజులు పరువెత్తి హతులై యగుచు
వీర్యమును చెడ నా ఖలుల్ వెడలిచనిరి. 870

ఓయి మునిచంద్ర ! భాస్వరమై యెసఁగు
ప్రథిత ధనుసు చూపెద రామలక్ష్మణులకు
ఈ ధనుస్సును రాముఁడె యెత్తెనేని
మఱి యయోనిజ సీత దాశరథి కిత్తు. 871

—: రాముఁడు శివధనున్సు నెత్తి విఱచుట :—

అధిపు వాక్కు విశ్వామిత్రుఁ డాలకించి
రామునికిఁ జూపు ధను వని రాజుఁ బలుక
తిరిగి సచివుల శాసించె దివ్యధనువు
మెండు గంధమాల్యము లుంచి తెండటంచు. 872

జనకుఁ డాజ్ఞ యీయఁగ నెల్ల సచివు లపుడు
యజ్ఞవాటినుండి పురికి నరుగుదెంచి
ధనువు ముందుంచికొని యావతలకు వచ్చి
భృత్యులను నియోగించిరి విల్లుతేఁగ. 873

అయిదువేల మంది జనులు నాధనుస్సు
నిడిన యెనిమిది చక్రాల యినుప పెట్టె
ఎట్టులో లాగి కొని వచ్చి నృపతి కనిరి
నృపతి ! యిదె విల్లు తెచ్చితి మదిగొ చూపు. 874

అనఁగ రాజు విశ్వామిత్రు నధిపసుతుల
నరసి యిట్లనె బ్రహ్మ ! యీవరధనుస్సు
జనకకులులచే నృపులచే సత్కృతంబు
ఇది యసుర సుర యక్షులు నెత్తలేదు. 875

ఇంక మనుజుల సంగతి యేమి చెప్ప
ఎత్తుటయె కాదు కదపుట, హత్తుకొనుట,
ఏదియును చేయజాలర యట్టి ధనువు
రామలక్ష్మణులకుఁ జూపు మోముద్రీశ ! 876

* విజ్ఞుఁడు జనకుఁడిటులన వినియు ధర్మ
మూర్తి యయిన విశ్వామిత్ర మునివరుండు
నాయనా ! వత్స ! యోరామ యీయపూర్వ
ధనువుఁ జూడు మటంచును ననియెఁ బ్రీతి. 877

వ. అంత మహర్షి మాటలు విని రాముడు ఆ ధనుస్సున్న యునపపెట్టెను తెఱచి ధనుస్సును చూచి యిట్లనెను. ఓ బ్రహ్మ ! ఈ వరధనుస్సును చేతితో తాకెదను. ఎత్తుటకును ఎక్కు పెట్టుటకును ప్రయత్నించెదను అనఁగ "మంచి దట్లే" అని ముని యనఁగా నపుడు. 878

జనముల్ వేలకొలందిమంది కన విశ్వామిత్రు వాక్యంబుచే
ధనువున్ మధ్యగ లీలఁ బట్టుకొని యాధర్మాత్ముఁడౌ రాముఁ డా
ధనువున్ పైకిడి యెక్కుపెట్టదొడఁగెన్ తత్కాలమం దిట్టె పెన్
ధనువున్ మధ్యగ భగ్న మయ్యె పిడుగున్ పడ్డట్లు పెన్ ఘోషతో. 879

పృధివి కంపించె కొండలు వ్రీల్చినట్లు
గొప్పధ్వని యయ్యె దారుణ ఘోషతోడ
మోహితు లయి జనంబులు మూర్ఛపడిరి
మునియు రాజును రామలక్ష్మణులుతక్క. 880

జనము లాశ్వాసమును పొంద సాధ్వసంబు
లేక జనకుండు కడు నంజలించి యనియె
ఓయి భగవంత ! రాముని యుగ్రబలము
అద్భుత మచింత్య మిట్టిది యనఁగ రాదు. 881

---

* "వి" అన్నది గాయత్రి మంత్రములోని మూడవ అక్షరము. మూడవ వేయి శ్లోకముల కిది మొదటిది.

దాశరథి రాము భర్తగాఁ దనయ సీత
కాంచి జనకుల కులమున ఖ్యాతి దెచ్చె
నాప్రతిజ్ఞయు బలమొ కట్నముగఁ గలదు
సీత నాప్రాణ మిఁక రాముచేత నిడుదు. 882

నీయనుజ్ఞను పొంది మంత్రివ్రజంబు
కౌశిక ! యయోధ్యకును పోవఁ గలరు నేఁడ
నీకు శుభవార్త నరపతిన్ విన్నవింత్రు
వీర్య శుల్క ప్రదానమున్ వేడ్కఁ దెలిపి. 883

రాఘవులను సుఖులు మౌని రక్షణమున
అనియు వెఱిఁగింత్రుగాక రాజునకు నిపుడె
ప్రీతుఁ డగురాజు నిటకు రావింత్రుగాక
అన జనకుఁడు, విశ్వామిత్రుఁ డట్లె యనఁగ. 884

శ్లాఘ్యముగ జనకుఁడు మంత్రులకుఁ జెప్పె
ఇచట జరిగినయది విన్నవించుటకును
నృపతిఁ బరివార సహితు రావించుటకును
పంపెను యయోధ్య కాజ్ఞానువర్తిజనుల. 885

**:– దశరథుని రప్పింప జనకుఁడు మంత్రులఁ బంపుట :–**

జనక నృపతి యాజ్ఞాపింప వినయ మార
గుఱ్ఱము లలసి పోయినఁగూడ నేగి
మార్గమున మూఁడు నిశలుండి మంత్రు లపుడు
దూతలై యయోధ్యాపురిఁ దొరగఁ జనిరి. 886

రాజు ననుమతి పొంది యారాజు గృహము
ద్వారపాలురును ప్రవేశపఱచఁ జొచ్చి
దేవసమువృద్ధు దశరథుఁ దేఱి చూచి
పలికి రిటు దోసిల్యొగ్గి సాధ్వసములేక. 887

అతఁడు జనకుండు మిథిలా
పతి యగ్ని ని ముం దునిచి యుపాధ్యాయ పురో
హితయుతు నిను స్నేహ మధుర
మతిఁ గుశలాదికంబు మఱిమఱి యడిగెన్. 888

"మిథిలాపతి వైదేహుఁడు
యథావిధిగ కుశల మడిగి యవ్యగ్రముగా
ప్రథితుఁడు విశ్వామిత్రుని
యథానుమతి నీకు నిట్టు లనె వినయముతో. 889

మును పెపుడొ వీర్యశుల్కగ
తనయనిడఁ బ్రతిజ్ఞ చేసి తనరుట యది తె
ల్సినదే నిర్వీర్యులవై
చనిరి నృపు లమర్షమునను స్వపురంబులకున్. 890

తనయ యిది ఓనృపాలా!
యనుకొనకుండఁగనె యిటకు నరుదెంచిన యా
మునివర విశ్వామిత్రుఁడు
మనువగు నీసుతులచేత భువి జితయయ్యెన్. 891

ఆ దివ్యధనస్సొ నృప!
నీదుసుతుడు రాముచేత నృవరులు కనఁగా
భేధింపంబడె మధ్యకు
నాదు మహాసభకు మధ్య వై పుఱితోడన్. 892

నాదు ప్రతిజ్ఞను దాటగ
నీదు ననుజ్ఞను సుత నిడ నేఁ గాంక్షింతున్
నీదు నుపాధ్యాయుపు
రోధస్సులతోడ వచ్చి తుష్టిఁ గను సుతులన్. 893

నీకు శుభము నాకును ప్రీతి నెఱయఁ గూర్చు
పుత్త్రి లిరువరప్రియు మీవుఁ బొందఁగలవు
అని జనకుఁడు విశ్వామిత్రుఁ డాజ్ఞయీయ
అశతానందు మతిఁ బ్రియం బారఁ బలికె." 894

అనెడి దూతల వాక్యముల్ వినియు రాజు
బహుళ హర్ష మొంది వసిష్ఠు వామదేవు
నితర మంత్రులఁ గూడ రావించి యటకు
నెంతొ యానందమునఁ బొంగి యిట్టులనియె. 895

ఎపుఁడు గౌసల్య కానంద మిచ్చురాముఁ
డిపుడు గాచి విశ్వామిత్రుఁ డెల్ల విధుల
తను నిరీక్షించు చుండ, లక్ష్మణునితోడ
అట విదేహాల నున్న వాఁడట వినుండు. 896

ఆ మహితజనకుఁడు మనరాము వీర్య
మెంచి తనపుత్త్రి రాముని కీయఁ దలఁచె
ఈ మహాత్ము నాశయము మీ కిష్టమేని
మిథిలకును పోవుదమ వేళ మించకుండ. 897

అనఁగ విని మంత్రులు మహర్షు లట్లె యనిరి
అధిక ముద మొంది పతిరేపె యాత్ర యనియె
మంత్రు లానంద మొంది యాజ్ఞాపుతోడ
నుత్తమ గుణులై యారాత్రి యుండినారు. 898

వ. అంత రాత్రి గడచిపోవ ఉపాధ్యాయులు బంధువులతోఁ గూడి, దశరథ మహారాజు సుమంత్రుని కిట్లనిరి. ఇపుడు కోశాధ్యక్షులు ధనమును పుష్కలముగాఁ దీసికొని నానారత్నములతోఁగూడ సువిహితులై ముందుగా వెళ్ళుదురు గాక! అంతట శీఘ్రముగా చతురంగ బలమును వాహనములు గుఱ్ఱములను నాయాజ్ఞతో వెళ్ళునుగాక. వసిష్ఠుడు వామదేవుడు జాబాలి కాశ్యపుడు మార్కండేయుడు సుదీర్ఘాయువు కాత్యాయనఋషి మొదలైన ద్విజులు అగ్రమున పోదురుగాక. నన్ని దూతలు తొందర చేయుచున్నారు అన అప్పుడు రాజు మాట వలన చతురంగసేన ఋషులతోఁ బోవుచున్న రాజునకు వెనుకగా అనుసరించి వెళ్ళెను. ఇట్లు నాలుగు రోజులు ప్రయాణముచేసి రాజు సపరివారముగా విదేహ దేశములు చేరెను. అట్లు దశరథ మహారాజు వచ్చినట్లు విని శ్రీమంతుడైన జనకుడు వారిని గౌరవించెను. పిదప వృద్ధుడైన దశరథ మహారాజును సమీపించి ముదితుఁడైన జనకుఁడు మిక్కిలి సంతోషము పొందెను. అంత ఈ నరశ్రేష్ఠుడు ఆ నరశ్రేష్ఠునితో నిట్లనెను. 899

స్వాగతము నీకు మహారాజ! స్వాగతంబు
మా యదృష్టముచే నీవు మాపురికిని
వచ్చితి సుతుల వీర్యమువలన నిపుడు
ప్రాప్తమగు ప్రీతి పొందిన వాఁడ వగుచు. 900

మా యదృష్టముచేత బ్రాహ్మణులతోడ
దేవతలతోడ దేవేంద్రు డీవి నిటకు
వర మహాతేజుఁడును భగవంతుఁడైన
యా వసిష్ఠ మహర్షియు నరుగు దెంచె. 901

వీర్యమున శ్రేష్ఠులు మహాత్ము లార్యులైన
రాఘవులతోడి సంబంధ లబ్ధివలన
ఆ యదృష్టాన విఘ్నజయంబు కలిగె
మా కులంబును పూజితంబై వెలింగె. 902

రేపు ప్రొద్దుట మనుజేంద్ర ఋషుల పతిని
సుష్ఠుగ వివాహము జరుప శుభమయ్యగును
యజ్ఞము తుదిఁ బెండ్లిని జేయ నర్హుడవుదు
వని జనకుఁ డన ఋషి మధ్యననియె రాజు. 903

కన్య మొదలైన యవి ప్రతిగ్రహముచేత
దాత యిష్టముఁ బట్టియె దనరుచుండు
అనుచు మును వింటి మీరెట్టులనిన నటులె
మేము చేయుదు మనిరాజు మేలుచెప్ప. 904

ధర్మయుక్తము కీర్తి ప్రదంబు నైన
సత్యవాది వాక్యము విని యాజనకుఁ డెంతొ
విస్మయము బొందె ఋషులు వీరు వారు
బందొరులు కల్పికొని రాత్రి యుండి రెలమి. 905

నృపతియును రాఘవులఁ జూచి యెంతొ పొంగి
జనకుచేఁ బూజితుండయి తనరె వటనె
జనకుఁడును తత్త్వవేత్తయై జన్నమునకు
కర్మల సుతులతోఁ జేసి గడిపె నిశను. 906

—: సూర్యవంశ క్రమమును వసిష్ఠుడు చెప్పుట :—

తెల్లవారఁగ దినకృత్య మెల్లఁ జేసి
ఆ శతానందుడు పురోధ కనియె రాజు
ధార్మికుఁ డగు తమ్ముఁడు కుశధ్వజు డనంగ
ఖ్యాతి పొందిన వాడటఁగలడు సుండి. 907

అతఁడు దుర్గమున్ యంత్రము లలరియుండి
తమిఁ గుబేరు పుష్పక విమానమును బోలు
పుణ్యసంకాశ సాంకాశ్య పురిని నిలిచి
ఇక్షు మతి నదీ జల మూని యెసఁగె నట౦ె. 908

వ. అతనిని జూడవలె ననుకొనుచున్నాను. నాతోపాటు ఆ మహాతేజుఁడు ప్రీతిని బొందగలడు. అని నరేంద్రుఁడు శాసింప ఇంద్రుని యాజ్ఞచే విష్ణుని బోలె ఆ కుశధ్వజుని రప్పింప శీఘ్రముగా బోవు గుఱ్ఱముల నెక్కి జనులువెళ్ళి ఆ కుశధ్వజుని తీసుకొని రాగా అతఁడు మహాత్ముఁడైన జనకుని జూచి శతానందునికి రాజునకు నమస్కరించి రాజార్హమగు దివ్యాసనము నలంకరించెను. అపుడా సోదరు లిద్దఱు కూర్చుండి శీఘ్రముగా కుమారులతో పాటు ఇక్ష్వాకు వంశస్థుఁడైన దశరథుని రప్పించుట కై మంత్రిశ్రేష్ఠుడైన సుదామఁ డను వానిని పంపిరి. అప్పు డతఁడు దశరథుని శిబిర సన్నివేశమునఁ జేరి శిరసు వంచి నమస్కరించి రఘుకుల వర్ధనునితో నిట్లనెను. 909

అతఁడు జనకుం డయోధ్యా
పతి! యిప్పుడె నిన్ను చట నుపాధ్యాయు పురో
హిత యుతుఁ గనగోరె ననగ
అతఁడు దశరథుఁ డరుదెంచి యనె జనకునితో. 910

అనఘుం డౌ విశ్వామిత్రుని
యనుమతి బొందితిమి సకల మహర్షులతోడన్
అనఘుండు వసిష్ఠుఁడుచె
ప్పును వరుసగ నన నృపుఁ డనె ముని జనకునితో. 911

వ. అవ్యక్త ప్రభవుఁడును శాశ్వతుఁడు నిత్యుఁడు అవ్యయుఁడును నగు బ్రహ్మ కలఁడు. అతనికి ప్రజాపతులు పదిమందిలో నొకఁడైన మరీచి పుట్టెను. ఆ మరీచికి కాశ్యపుఁడును ఆ కాశ్యపునికి వివస్వంతుఁడును అతనికి వైవస్వతుఁ డను పేరు గల మనుప్రజాపతియును అతనికి ఇక్ష్వాకువును పుట్టిరి.

ధరలో పూర్వము నాదివంశ శుచులున్ ధర్మాత్ము లిక్ష్వాకుసా
గర రాజేంద్రులు సత్యవాదులు సహస్రకపుత్రాజితోత్కృష్టసం
గరులౌ వీరులు రామలక్ష్మణులకై కాంక్షింతు నీకన్యలన్
వరులౌ యోగ్యులకై సుయోగ్య సుతులన్ రాజేంద్ర నీవీయఁగన్. 913

## —: జనకుడు నిమివంశమును జెప్పుట :—

వ. ఇట్లు పలుకుచున్న వసిష్ఠుని జూచి జనకుడు కృతాంజలియై పలికెను నీకు శుభమగు గాక! కీర్తించుచున్న మా కులమును గూడ వినఁ దగుదువు. ఓ నరశ్రేష్ఠా! కులీనుండైన వారు నిశ్శేషముగఁ దనగులము కన్యాప్రధాన సమయమునఁ జెప్పఁదగియున్నది. ఓ మహామునీ! యాలకింపుము. మూఁడు లోకములందు తనకర్మచేత ప్రఖ్యాతిని పొందిన వాఁడును ధర్మాత్ముడును సర్వసత్త్వవంతులలో నుత్తముఁడునైన నిమి యను రాజు గలఁడు. అతనికి మిధి అను కుమారుడు కలిగెను. ఆ మిథిచే నిర్మితమై యుండుటచే ఈ పురి మిథిల యనఁబడినది. ఆ మిథికి జనకుఁడును జనకునికి ఉదావసువును ఉదావసువునకు ధర్మాత్ముఁడైన నందివర్ధనుఁడును ఆ నందివర్ధనునికి సుకేతువును సుకేతువునకు ధర్మాత్ముఁడైన దేవరాతుడును దేవరాత రాజర్షికి బృహద్రథుఁడును బృహద్రథునికి మహావీరుఁడును మహావీరునికి సత్యవిక్రముఁడైన సుధృతియును సుధృతికి ధార్మికుడైన ధృష్టకేతువును ధృష్టకేతు రాజర్షికి హర్యశ్వుఁడును హర్యశ్వునికి మరువును మరునికి ప్రతింధకుఁడును ప్రతింధకునికి కీర్తిరథుఁడును కీర్తిరథునికి దేవమీఢుడును దేవమీఢునకు విబుధుఁడు విబుధునికి మహీధ్రకుఁడును మహీధ్రకునికి కీర్తిరాతుఁడును కీర్తిరాత రాజర్షికి మహారోముడును మహారోమ రాజర్షికి హ్రస్వరోముఁడును హ్రస్వరోమునికి ఇద్దరుపుత్త్రులు పుట్టిరి. జ్యేష్ఠుఁడను నేను, నాయనుజుఁడు ఈ కుశధ్వజుఁడు. 914

కని జ్యేష్ఠున్ నను రాజ్యమందు నభిషేకంబంతఁ గావించి యి
కను నాపై ధరణిన్ గుశధ్వజున్ వేగన్ నిల్పి మాతండ్రి తా

వనికిన్ బోయి మృతిన్ గనన్ ధనను నేభద్రంబుగా నేలి భ్రా
తను ప్రేమన్ గనుచుండఁ బంపె మిథిలన్ దండుల్ సుధన్వుఁడొగిన్. 915

వ. అట్లు సుధన్వుఁడు సాంకాశ్యనగరంబునుండి వచ్చి తన సైన్యమును మిథిలపైకిఁ బంపి యిట్లు నాకు కబురంపెను.

"గొప్పదగు శివధనుసును కుపలయాక్షి
సీతఁ గన్యను నాకప్పజెప్పుఁమనుచు
దాని నీయకుండుటను యుద్ధంబు జరిగె
నట సుధన్వుండు నాచేత హతుఁడ యయ్యె. 917

మౌనివర! సుధన్వ నృపతిన్ నేను చంపి
ఘనుఁ గుశధ్వజున్ భ్రాత సాంకాశ్యమందు
పట్టమును గట్టితిని పెద్దవాడ నేను
పరిగ నాకుఁ దమ్ముఁ డగు నీకుశధ్వజుండు. 918

దేవకన్యఁ బోలిన సీత దేవి సుతను
వీర్యశుల్కను, రెండవ బిడ్డయైన
ఊర్మిళను గూడ నిదె యథాయోగ్యముగను
నిడుదు ముమ్మాటికిని సంశయింపవలదు. 919

రాజ! *గోదానక్రియ రామలక్ష్మణులకు
అమరఁ జేయించు నాంది శ్రాద్ధమును గూడ;
నీకు శుభమౌత ఆపైని నిపుణ భంగి
జరపుము వివాహ శుభ కార్య ధరణినాథ. 920

* గో=కేశ, దానకర్మ=ఖండనకర్మ (సమావర్తనము)

—: కన్యా వరణము :—

నేఁడు మఘ మూఁడవ దినంబునాడు నీవు
రాజ యుత్తరఫల్గుని లగ్నమందు
జరపుము వివాహ శుభకర్మ క్ష్మాప! రామ
లక్ష్మణులకు సౌఖ్యముగ ధర్మములఁ జేయు 921

జనకుం డిట్లన నావసిష్ఠుఁడును విశ్వామిత్రుఁడున్ గూడ ని
ట్లని, రిక్ష్వాకు విదేహవంశము లచింత్యం బప్రమేయంబు లెం
చను నివ్వానికిఁ దుల్యమైన వెవియున్ జూడంగఁ బోమందమం
చును తుల్యంబులై ధర్మమందు సమముల్ తుల్యంబు శీలంబులన్.
922

ఊర్వ్యశ్రీశీలముల సీత యూర్మిళయును
రామలక్ష్మణులకు నెందు రాజ! తీసి
పోరు, రూపాన ధర్మాన, పుణ్యవిధుల
నొక్కరొక్కరికి దుల్యలై యుంద్రుసుమ్మి 923

ఇఁకను జెప్పదగ్గది యున్న దిటులు వినుము
జనపతీ! పిన్నవాఁడీ కుశధ్వజుండు
ధర్మపరుఁ డగు నీతని తనయు లిర్వు
రందమున సాటి లేకుండ నలరుచుంద్రు 924

భరతసుతునకు శత్రుఘ్నపరమమతికి
ఈ తనయ లిద్దఱను వరింతు మధిప
వీరు దశరథపుత్త్రులు విబుధ సములు
రూప యౌవనుల్ లోకపాలోపములును 925

పావన మగు మీకులము నిక్ష్వాకు కులము
నివియు సంబంధములను బంధింపఁ బడుత
ఈ విధముగ విశ్వామిత్రుఁ డావసిష్ఠు
డనువుగాఁ జెప్పఁ గేల్మోడ్చి జనకుఁ డనియె. 923

తాపస వరేణ్యులగుమీరు తగిన రీతి
నర్థ సంబంధములఁ జెప్పినందువల్ల
మాకులము ధన్య మయ్యెను మహితగతిని
ఇట్ల యగుగాక శుభము మీకెసఁగుగాక. 927

భరత శత్రుఘ్ను లిర్వురు భద్రలైన
పత్ను పొందు తమ గుశధ్వజుని సుతల
రాజు సుతులు నల్గురు నొక్కరోజునందె
నృపతి సుతల నల్గురికేల్ గ్రహింత్రుగాక. 928

రమ్య ఫల్గునీ నక్షత్ర లగ్నమందు
భగుఁడును ప్రజాపతిగ నున్న తగినవేళ
ఉత్తర దినమున వివాహము త్తమమని,
పెద్దలు ప్రశంసగావింత్రు విహిత రీతి. 929

ఇటుల సౌమ్యముగ వచింప నృపతి లేచి
ప్రాంజలియయి మౌనివరుల కనియె నిట్లు
పరమధర్మంబు గావింపబడియె నాకు
మీకు శిష్యుఁడ నై సదా మెలగుచుందు. 920

ఈ వరాసనము లలంకరింపుఁ డిపుడు
మిథిల యయ్యది యా దశరథుని కెట్లొ
అట్లె నాకయోధ్య, ప్రభుత్వమందు సంశ
యింపకుఁడు మీరు స్వేచ్ఛ గావింపవచ్చు. 931

ఇటు విదేహ జనకుండు వచింపనలరి
ఆదశరథమహారాజు ననియె నిట్లు
మీర లగణితగుణు లనుజుల్ మిథిల ప్రతులు
ఋషులు రాజులు మీచే భజింపఁబడిరి. 932

స్వస్తి యగుగాక భద్రమౌ; వసతి కరిగి
ఎల్ల శ్రాద్ధ కర్మలను గావింతుననుచు
నృపతి సెలవంది దశరథనృపతి పిదవ
మునుల ముందుంచి విడిదికిఁ జనియె వేగ. 933

చని యథావిధి శ్రాద్ధంబు సలిపి యపుడు
రేపకడ వర గోదాన క్రియల కొఱకు
రాజు సుతుల నుద్దేశించి బ్రాహ్మణులకు
నూఱువేల గోవులు, ధర్మ మార్గ జేసె. 934

పసిడికొమ్ములు కంచుకుంభములు దూడ
లున్న నూఱువేలావులు, నొసఁగి వెలిగె
క్షితిపతి కృత గోదానులౌ సుతులతోడ
నరిగ లోకపాలురతో ప్రజాపతివలె. 935

## —: సీత ఊర్మిళ మాండవి శ్రుతకీర్తులకు వివాహము :—

ఏ దినమున గోదానము నృపతి చేసె
ఆ దినమె యుధాజిత్తును నరుగు దెంచె
అతఁడు కేకయ సుతుఁడు భరతుని మామ
అతఁడు రాజు క్షేమ మడిగి యడిగి యనియె. 936

కేకయాధిపతియు నీదు క్షేమ మడిగె
ఎవరి క్షేమము నీవు కాంక్షింతు వారొక్క
వారు క్షేమంబుగా నున్నవారు సుమ్మి
నాదు మేనల్లు రాజు కనంగఁ గోరె. 937

అందుకై యయోధ్యకు నేను నరుగుదేఱ
నీవు మిథిలకు సుతుల పెండ్లికిని వేగ
వచ్చి నటు విని నేనును వచ్చినాఁడ
నాదు మేనల్లు భరతుఁ గనంగఁ గోరి. 938

పిదప రాజు దశరథుఁడు ప్రియుని నతిథి
నఖిల సత్కారములతోడ నర్చచేసె
అంత నా రాత్రి సుతులతో నటనె యుండి
యుదయమే కర్మలను యథావిధిగఁ జేసె. 939

వ. మఱియు నాదశరథుఁడు ఋషులను ముందుంచుకొని యజ్ఞవాటికి వచ్చెను. అంత యుక్తమైన విజయ ముహూర్తమందు సకలాభరణ భూషితులైన తమ్ములతోఁ గూడి కౌతుక మంగళములు చేసి వసిష్ఠుని నితర మహర్షులను ముందుంచుకొని రాఁగా భగవానుఁడైన వసిష్ఠుడు విదేహాధిపతి జనకుని కిట్లనియెను. 940

నృప దశరథ మహారాజు నెల్ల శుభము
లాచరించిన సుతులతో నాదరముగఁ
జేరి నిన్నుఁ గన్యాదాతఁ గోరి యిపుడు
తా నిరీక్షించుచుండెను ధరణినాథ. 941

దాతవలన మఱి ప్రతిగ్రహీతవలన
దాన ధర్మములు సకలార్థములు పుట్టు
కాన నుత్తమము వివాహ కర్మ జరిపి
నీదు ధర్మము పొందుము నృపతివర్య. 942

వ. అని మహాత్ముడగు వసిష్ఠుఁడు తెలుపగా పరమోదారుడు మహాతేజః పుఁడు పరమధర్మవేత్తయు నగు జనకుఁడిట్లు పలికెను. 943

కం॥ డే యే ప్రతిహారియే వెవరి యాజ్ఞన్ మీరు వీక్షింపఁగా
వలె, మీయింట విచార మేది, యిది మీస్వారాజ్యమే, సర్వమం
గళకార్యంబులు చేసి వేది దరి నాకన్యల్ శుఖాగ్నిచ్ఛటల్
వలె నున్నారలు నేఁడు వేదిదరి మీరాకన్ గాంతు సజ్జుండనై. 944

వ. రాజు వివాహకార్యము అవిఘ్నముగా జరుపునుగాక యెందు క్రియాలస్యము అని జనకుండు పలుకఁగా విని దశరథుఁడు తన కుమారులను సకల ఋషిగణములను మండపమునఁ బ్రవేశపెట్టెను. అపుడు విదేహాధిపతి యిట్లనెను. ఓ ఋషీ ! సర్వఋషులతోడ లోకాభిరాముఁడైన రాముని వివాహమును జరుపుము అని. అపుడు భగవానుఁడైన వసిష్ఠుడట్లే యని విశ్వామిత్రుని ధార్మికుఁడైన శతానందుని ముందుంచికొని యజ్ఞశాలకు మధ్య యథావిధిగా వేదిని సుందరముగ గంధపుష్పములతో నలంకరించెను. 945

అంకురములు గలస్వర్ణ పాలికలతో
స్వర్ణమయమగు కుంభములతోడ
అంకురములు మొలచు నామపాకుడులతోడ
నగురు పొగల గుగుడు కుండ్లతోడ
సకలార్ఘ్యములు నిండు శంఖపాత్రలతోడ
నమరు స్రుక్స్రువపుఁ బాత్రములతోడ
పసు పోరుపేలాల పసిడి పాత్రికలతో
నక్షతల్ మెలయు పళ్యాలతోడ 946

పూత సమిధలతో దర్భముడులతోడఁ
దనరి సొంపైన యగ్నిహోత్రంబు చుట్టు
దర్భపోచలఁ బఱచి మంత్రములతోడ
వేదివహ్నిన్ వసిష్ఠుఁడు వేల్చెనపుడు. 947

అవల సకలాభరణ భూషితాంగి సీత
నచ్చటకుఁ దెచ్చి రాముని కభిముఖముగ
మంచి యగ్నికి నెదుటఁ గూర్చుండఁబెట్టి
జనకుఁ డనెను కౌసల్యానందనునితోడ. 948

"ఈసీత నాదు పుత్త్రిక
నీ సహధర్మచరి యౌచు నెగడుచు నుండున్
ఈసీతను గైకొను మెం
తో శుభము, గ్రహింపుము పాణితోడన్ పాణిన్. 949

ఈమె పతివ్రత యనఘాయు
నీమెయి నీడవలె ననుసరించును నిన్నున్
రామ ! గ్రహింపని జనకుడు
రాము కరమున నిడె మంత్రరక్షాజలమున్. 950

కని దివి దేవులు మేల్ మే
లని, ఇలపై సాధు సాధు యనిరి మహర్షుల్
వినువీధిన్ దుందుభులను
వెను మ్రోత లిడె, దివిఁ బుష్పవృష్టియుఁ గురిసెన్. 951

వ. అపుడు జనకుఁడు సీతను మంత్రోదక పూర్వకముగా నర్పించి ఆనంద బాష్పములు రాల లక్ష్మణునితో నిట్లనియె. 952

ఈమెయె యూర్మిళ నాసుత
ఈమెయె సహధర్మచరిగ నెపు డగు నీకున్
ఈమెఁ గొను లక్ష్మణ ! క్రమం
బామించకు, పాణితోడఁ బాణిని గొనుమీ. 953

వ. అనుచు పిదప భరతశత్రుఘ్నులతోగూడ నిట్లనియె. 954

ఈమెయె మాండవి నాసుత
ఈమెయె సహధర్మచరిగ నెపు డగు నీకున్
ఈమె గొనుము భరత ! క్రమం
బామించకు పాణితోడఁ బాణిని గొనుమీ. 955

ఈమె శ్రుతకీర్తి నాసుత
ఈమెయె సహధర్మచరిగ నెపు డగుఁ గొనుమీ
ఈమెను శత్రుఘ్న ! క్రమం
బామించకు పాణితోడఁ బాణిని గొనుమీ. 956

అందఱు మీరలు సౌమ్యులు
అందఱు మీరలు వ్రతంబు లార్జించిరిగా
అందఱు పత్నులతోడుత
నుందురుగాక సుఖము ముద నొగి మీరకుఁడీ. 957

జనకు పలుకులు విని కరము
లను కరములతో స్పృశించి రాజిలిరి, వా
రిని నల్గురను నలుగురును
ననువుగ చూచిరి వసిష్ఠు ననుమతితోడన్. 958

అగ్నిని ప్రదక్షిణము చేసి యనల వేది
నరపతిని ఋషులఁ బ్రదక్షిణంబు చేసి
భార్యలను గూడి యారఘువరులు పిదప
పెండ్లి యాడి రటుల యథావిధిగ నపుడు. 959

కురిసెను దివి విరివానలు
మొరసెను దివ్యంపు దుందుభులు, నృత్యముచే
సిరి యప్సరసలు, సురకి
న్నరులును గీతాలుపాడ నద్భుత మయ్యెన్. 960

ఇటు వాద్యమ్ము లడర ను
త్కట మగు నుత్సాహ మొప్పఁ దద్దాఘవులున్
అటు నగ్నికిని ప్రదక్షిణ
మటు ముమ్మారులును చేసి రర్థాంగులతో. 961

అంత రఘునందనులు భార్య లనుసరింప
తమదు విడిదులకును బోయి రాత్మ పొంగ
ఋషులు బాంధవులును కూడ నేగుదేర
అధిపుఁడునుగూడ వారల ననుసరించె. 962

## —: పరశురాముఁడు రాముని ఎదుర్కొనుట :—

తెల్లవాఱ విశ్వామిత్రుఁ డల్లలేచి
పృధివిపతిని రాకొమరుల వీడుకొలిపి
యజ్ఞ కార్యాదికములు సమాప్తిఁ జెంద
ఉత్తరాద్రిపై పుగఁ బోయె సత్తముండు. 963

ఇటుల నట్టివిశ్వామిత్రుఁ డేగ రాజు
జనకు మిధిలేశు పై దేహు ననుమ తడిగి
మరి దశరథమహారాజు త్వరగ పురికి
బంధు పరివారములు రాఁగ బయలు దేఱె. 964

ననుపౌ గోవులు నూఱువేల్, జిలుగురత్నాల్ చెక్కు కంబళ్ళు ను
న్నని క్షౌమంబులు కోట్లు దుప్పటులవ లెన్నం డగ్గ గుఱ్ఱాలు చ
క్కని యేన్గుల్ రధపంక్తి కాల్బలము లింకన్ దాసదాసీలు త
గ్గని బంగారము వెండి పల్పవడముల్ కన్యాధనాల్ రాజిడెన్. 965

ఇట్లు పెక్కు కన్యాధనం బిచ్చి జనకుఁ
డాయయోధ్య పతి యనుజ్ఞ  అందె; పిదప
కనుల నీరూన సుతలును జనకు లెంతొ
ఒక రొకరి పీడ లేక యిండ్లకును జనిరి. 966

ఇక నయోధ్యాధిపతి పుత్త్రి లేగుదేఱ
ఋషుల ముందుంచికొని బయల్దేఱ నంత
అభ్రమున ఘోరముగఁ బక్షు లఱచుచుండె
క్రింద మృగముల్ ప్రదక్షిణల్ చేయుచుండె. 967

వానిఁ జూచి రాజు వసిష్ఠుఁ బ్రశ్న చేసె
"పక్షులో యసౌమ్యముగఁ గ్రూరభంగి నఱచె
మృగములో ప్రదక్షిణ చేసి ప్రీతివరలె
హృదిని కంపించు నిది యేమి, హృదియె పగచు. 968

దశరథుని వాక్కులు విని శాంతముగ మౌని
యనియె వీని ఫలంబులు వినుము రాజ !
పక్షిరుతములు ఘోరమౌ భయముఁ దెలుపు
మృగములో భయ శాంతి దెలుపు వగను విడుము. 969

వ. అని వారు వలుకుచుండగ. 970

క్షమ కంపింపఁగఁ జెట్లు కూలి పడ ఝంఝూవాయువుల్ వీచె న
భ్రముపై సూర్యుఁదమంబు గప్పె, దిశ లెల్లన్ వెల్గులేకుండె, స
ర్వము భస్మంబులు నావరించె, బల మెల్లన్ మూర్ఛ నొందెన్ ఋషుల్
కొమరుల్ రాజు వసిష్ఠుడున్ మిగులఁ దక్కన్ సేన పీడెన్ స్మృతిన్.
971

వ. అపుడు సేన తమసుచేఁ గప్పఁబడి ఖూడిదచేఁ గప్పఁబడి నదివలె
నయ్యెను. అపుడు 972

జడల గుంపును దాల్చి కడుభయుం కరుండయి
రుద్రుండువలె భయరూప మొంది
కైలాస మట్టులు కదియుగా రాకుండి
కాలాగ్నివలె సైచ వీలుకాక
మండుచున్నటు జ్యోతిమండలములచేత
పామరులకుం జూడ వలనుగాక
రాజరాజులను నిర్వది యొక్కమారులు
మర్దించిన బలంబు మహిమ పొంద

భుజమునన్ గండ్రగొడ్డలి మొనను నిల్పి
మెఱపుంబుంజమువలె ధను స్సరయుం దాల్చి
అమ్ముచేతం బూనిన త్రిపురారిం బోలు
పరశురాము వసిష్ఠాదు లరసిరపుడు. 873

వ. అంత వారిట్లు తమలో తాము తలచిరి. ఈపరశురాముండు తండ్రి వధచేం గోపించి క్షత్త్రి జాతినే నశింపంజేయుండుగదా. ఇదిపరకు క్షత్రియుల వధచేసి మన్యువును పోగొట్టుకొనెనుగదా. బహుశా ఇపుడు క్షత్రజాతిని నశింపంజేయుడు. ఇది యతని యభిలాష అయి యుండదు. అని యిట్లు వారాలోచించి యర్ఘ్యమును గైకొని భయంకరదర్శనముగ రాముని రామ రామ అని వలుకుచు సమీపించిరి. అంత ఆ యర్ఘ్యమునుగైకొని ఋషులుచేసిన పూజను గ్రహించి జమదగ్ని కుమారుండైన రాముండు దశరథుని కుమారుండైన రామునితో నిట్లనెను. 874

## —: వైష్ణవ ధనుః ప్రశంస :—

రామ ! దాశరథీ ! నీ పరాక్రమంబు
అద్భుతంబుగ వినంబడె నాధనుస్సు
విఱచు టాదివృత్తము లెల్ల వినియె ధనుసు
దాల్చి వచ్చితి నది యచింత్యాద్భుతంబు. 875

ఈవు జామదగ్న్యము పోర మీఘనుసు
శరముతో నెక్కుపెట్టి నీశక్తి చూపు
చాప మెక్కుపెట్టుతటి నీశక్తి చూచి
యోధులను మెచ్చుకొను ద్వంద్వయుద్ధ మిపుడు. 976

వ. అనఁగా విని వదనమున విషాదము తోఁపగా దీనుఁడై ప్రాంజ
లియై దశరథుం డిట్లు పలికెను. 977

క్షత్రియులన్ పగన్ విడిచి శాంతుఁడ వై తివి బ్రాహ్మణుండ వీ
పుత్త్రులబాలురి వధ నుఘున్ దయచేయుఁగఁ దగ్గ వాఁడవున్
పౌత్త్రుఁడవున్ శ్రుతిప్రవణ భార్గవవంశ్యుఁడ వట్టి నీవు మీ
పితృభివాంఛ నస్త్రములు వీడిన వాఁడవు ధార్మికుండవున్. 978

వరకశ్యపునకును వసుం
ధర నిడి; యుంటివి మహేంద్ర ధరణీంద్రముపై;
మరణమె నాకులశరణము
మరణింపఁగ రాముఁ డేమి మరణింతుముగా. 979

వ. అని దశరథుండు అనునయించుచున్నను వాని నాదరింపక ప్రతాప
వంతుఁడైన జామదగ్న్యుఁడు రాముని దగ్గఱకు వచ్చి యిట్లనెను. 980

ఇవి రెండు శ్రేష్ఠధనువుల
యివి దివ్యంబులు, జగముల నివి విశ్రుతముల్
ఇవి దృఢములు బలయుతములె
యివి ముఖ్యము విశ్వకర్మ యిట నిర్మించెన్. 981

ఏది నీవు రామ! విఱిచితి
వది సురలిడగఁ త్రిపురముల హరుఁడు జయించెన్
ఇది రెండవ వైష్ణవ ధను
విది హరుని ధనస్సుతోడ నెన యగు ధనుసే. 982

అపుడే దేవత లెల్లరున్ హరుని సామర్ధ్యంబు నావిష్ణుశ
క్తి పరీక్షింపగ గోరి బ్రహ్మ నడుగన్ దేవాశయం బెంచి తా
నపుడే బ్రహ్మయు రుద్రవిష్ణులకుఁ బోరాటంబు గల్పింపఁగా
నపుడో చేసిరి రుద్రవిష్ణులు మహోగ్రాశ్చర్యమౌ యుద్ధమున్. 98

అపుడు విష్ణు హుంకారాన హరు ధనుస్సు
జృంభితంబయ్యె హరుఁడు స్తంభింపఁబడియె
అపుడు ఋషులు దేవులు వచ్చి ప్రార్థనంబు
సెఱప రుద్రవిష్ణువులు శాంతించినారు. 98

విష్ణు విక్రమంబున రుద్రు విక్రమంబు
జృంభితం బౌటచే దేవు లెల్ల రంత
విష్ణువే గొప్పవాఁడని విశ్వసించి
రపుడు హరుఁడల్గి విలు దేవరాతున కిడె. 98

రామ ! యీవిష్ణు ధనుస్సు పురంజయుంబు
భార్గవ ఋచీకునకు న్యాసభంగి నిచ్చె
ఆఋచీకుఁడు ప్రతికర్మ యరయు నట్టి
నాపిత జమదగ్ని మహాత్ము కప్పగించె. 98

ఘన తపోబలము గలుగు జనకుఁ డంత
నస్త్రమును వీడఁ గార్తవీర్యార్జునుండు
పాపరుం డయి తండ్రిఁ జంపంగఁ, దగని
దారుణంబైన తండ్రివధంబు వినియు. 987

పుట్టు నట్టి క్షత్రియజాతి పూర్ణముఁగను
చంపుచును సర్వభూమిని సంచరించి
హనన యజ్ఞ దీక్ష చివర ననఘుఁడైన
కశ్యపుని కిచ్చితి సకలక్ష్మాతలంబు. 988

వ. అట్లు ఇచ్చి మహేంద్రపర్వతనిలయమున కేగి యుంటిని. ఇంతలో ధనుర్భంగమును విని శీఘ్రముగ వచ్చితిని. రామా! ఈవైష్ణవధనుస్సు తండ్రి తాతలనుండి వచ్చినది. నీవు క్షత్రియ ధర్మమును పురస్కరించుకొని గ్రహింపుము. ఈధనుశ్శ్రేష్ఠమందు శరమును కూర్పుము. ఇందులో నీవు సమర్థుండవైనచో ద్వంద్వయుద్ధమును నీకు ప్రదానము చేయుదును. 989

—: పరశురాముని గర్వభంగము :—

పరశురాము వాక్కు విని దాశరథి యపుడు
జనకు గౌరవాన వినయమున వచించె
ఎట్టి కర్మల నీవు గావించినావొ
వాని వింటిఁ బిత్రాజ్ఞముఁ దీర్పగఁ దలఁతు. 990

విక్రమము లేక క్షాత్రమున్ వీడినట్లు
నన్ను నవమానపఱచు చున్నవాఁడ
విదిగొ చూడుము నాతేజ మిదిగొ చూడు
నా పరాక్రమ మెట్టిదో చూపువాఁడ. 991

అనుచు కోపాన రాఘవుఁడు వేగ
పరశురాముని ధనువును శరముఁ గూడ
అతని చేతినుండియు లాగి హస్తలఘుత
వింటి నెక్కిడి యమ్ముంచి వినిచె నల్గి. 992

బ్రాహ్మణుఁడవు విశ్వామిత్రుఁ బట్టి నీవు
పూజ్యుఁడవు ప్రాణహర బాణములను బూన్చ
కుంటి, నిదె నీగమనమునా కొట్టిపైతు
లేక తపసుచే నార్జించు లోకములన. 993

ధనువున్ దాల్చి శరంబు కూర్చి విడువన్ దచ్చాడు రామున్ ఋషుల్
మునులున్ దేవులు కిన్నరాప్సరసలున్ ముందుంది యాబ్రహ్మ నీ
ఘనమౌ చిత్రము చూడ నిల్వ దివిలోకం బెల్ల మూర్ఛిల్లఁ గాం
చెను నిర్వీరత జామదగ్న్యుఁడు తలన్ జేయెత్తి శ్రీరామునిన్. 994

రాముసెడ సంక్రమించిన ప్రకటతేజ
మునను జడుఁడై పరశురాముఁడును దశరథ
రాము లోకాభిరామునిఁ బ్రకటతేజు
నల్లనల్లన వినయాన ననియె నిట్లు. 995

వరకశ్యపునకును వసుం
ధర నెపు డిచ్చితివో యపుడె నాదేశమునన్
మరియుండకు మన నేనున్
గురువాక్కున ధరణి రాత్రికూడ వసింపన్. 996

సరె యని ప్రతిజ్ఞ చేసితి
ధర కాశ్యపునకును నిచ్చిదనరితిఁ గావన్
మరి నాగతి కొట్టనిచో
నరిగి మనోగతి మహేంద్ర మనుగిరి నుందున్. 997

తపసుచేత నాచేత ననుపమ మైన
లోకములు జయింపఁబడెను లోకరామ
శరముచే నింకఁ గొట్టుమి నాజగము లెల్ల
ఇంక నాలస్యమేమి గావింపవలదు. 998

ఈధనుస్సును నీవు స్పృశింపఁబట్టి
నీవు మధుసూదనుఁడ వని నేను దలఁతు
ఇరుగొ నిన్ను సురలు నిరీక్షింతు రిట్లు
అవమానము నీకెదురైంది నరయు నిఁక. 999

అ త్రిలోకనాథుండ వైన యనఘుండ వైన
నీవలన నేవిముఖుండనై నెగడియుంటి
ఇందు నే సిగ్గుపడు పని యేమి లేదు
ఎనయు లేని శరంబు విసర్జింపు మిపుడు. 1000

శరము విడువంగ నేను మహేంద్రగిరికి పోదు
అనుచు భార్గవరాముండు ననుచు నుండ
దాశరథి రాముండు శరంబు వేసె నంత
రాముచే జగాల్ చన భృగురాముం డేగె. 1001

పిదప దిశలు విదిశలును విశద మయ్యె
సురలు ఋషులును రాముం జేసిరి ప్రశంస
ఇంక దశరథరాము శ్లాఘించి యంత
తగం బ్రదక్షిణ గొని జామదగ్న్యుం డరిగె. 1002

-: దశరథుండు పుత్త్రులతో అయోధ్య చేరుట :-

పరశురాముండు పోవ దాశరథి రాముం
డాధనుస్సును వరుణుని కప్పగించి
యపుడు భక్తితోడను వసిష్ఠాది ఋషులు
మ్రొక్కి విహ్వలుడౌ తండ్రి మ్రొక్కి యనియె. 1003

జామదగ్న్య రాముండు వెళ్లె సైన్య మిపుడు
నాథుం డైన నీచే రక్షణంబు పొందె
యింక నయోధ్యాభిముఖ మౌచు నేగుంగాక
అన దశరథుం డామాటల నాలకించి. 1004

రాముని గౌగిలించి శిరంబును మూర్కొని జామదగ్న్యుఁ డా
రాముఁడు వోయె నంచును ధరాపతియున్ విని పొంగి పోయి శ్రీ
రామునిఁ బుత్త్రిఁ దన్నును ధరన్ మరలన్ జనియించి నట్లుగా
నే మది నెంచి సేనఁ గదలించి యయోధ్యకుఁ బోయె వేగమే. 1005

అల జెండాలును చేతు లెత్తి ప్రభు నాహ్వానింప ఘోషించి భే
రులు మ్రోయన్ వడి రాజమార్గముల నీళ్లన్ జల్లి తీర్చంగ పూ
వులు పూమాల లలంకరించి గడుముఖంబుల్ పైకిఁగా నెత్తి పౌ
రులు సన్మంగళవాద్యముల్ చెలఁప స్త్రీలున్ జూడఁ జొచ్చెం బురిన్. 1006

జనముల్ ప్రోగయి చేరఁ బౌరులును రాజద్వారమందుండి జై
యని ఘోషించుచు స్వాగతం బిడి యెదుర్కొ నాబ్రాహ్మణుల్ రాఁగ రా
తనయుల్ తో నరుదేఁహర్మ్యము గిరింద్రంబట్లు వేగంబ చొ
చ్చిన పత్రమాట్లు సపుత్త్రిబాంధవముగా శీఘ్రంబ హాయిన్ గనెన్. 1007

మైత్రితోడఁ గౌసల్య సుమిత్ర కైక
అతదితరరాజవనితల్ సీత యూర్మి
ళలకు మాండవి శ్రుతకీర్తులను ప్రియంపుఁ
గోడళులను గ్రహించిరి కూర్మితోడ. 1008

మంగళాలాపములచేత మంచిచేత
శోభిలుచు క్షేమవసవముల్ చూచి దాల్చి
అఖిల వధువులు ప్రియ దేవతాలయముల
కేగి భక్తి దేవతలఁ బూజించి రెలమి. 1009

మ్రొక్కఁ దగువారలకు మ్రొక్కి భూపసుతులు
ప్రియసతులఁ గూడి యెంతొ హర్షించినారు
నరవరులు పెండ్లియాడి ధన్యాత్ము లగుచు
జనకు శుశ్రూష చేయుచు సంతసిలిరి. 1010

పిదప బ్రాహ్మణుల్ వణిజులున్ విషయ వాసు
లంత రాము శీలము వృత్త మరసి ప్రీతి
నుండ రాముండు సత్యధర్ముండె యగుచు
యశము గని స్వయంభు వయి గుణాఢ్యుఁ డయ్యె. 1011

రాముఁడు సీతతోఁ గలసి రమ్యములౌ ఋతులందు పుష్పితా
రామములన్ మనస్వి యయి రాత్రిపవల్ విహరించుచుండ నా
రామయు సీతగూడ ప్రియరామునికిన్ పితచేత దత్తయై
రాము గుణాల రూపమున లాగఁగ నొండొరుఁ బ్రీతి వర్ధిలెన్. 1012

ఆమెకు భర్తయున్ ద్విగుణమై హృదయంబున నెంతొ వర్తిలెన్
ఆమెకు లోని వెల్ల హృదయంబుననే హృదిఁ దెల్పు రాముఁడున్
ఆమెయు సీత రామునికి నన్నిటికంటె బ్రియంబె యయ్యె నిం
దీమెయె మూర్తి దాలిచిన శ్రీ యను దేవత తుల్యయై తగెన్. 1013

అభిరామను సీతను గని
అభిమతుడు మనోభిరాముఁ డభిరాముండై
శుభ కామినితో రాముఁడు
విభవము గనె శ్రీని బొంది విష్ణువువోలెన్. 1014

ఇది
శ్రీ చర్ల నారాయణశాస్త్రి జనక గురు ప్రాప్త విద్యుఁడును
వెంకమాంబా పుత్త్రుఁడు నగు చర్ల గణపతిశాస్త్రిచే
అనువదింపబడిన
వాల్మీకి రామాయణసుధ యందు
బాలకాండము.